# సంభాషణలు - సమన్వయాలు




రచన:

డా॥ మోపిదేవి కృష్ణస్వామి, M.A., Ph.D.



యూనివర్సల్ హ్యూమానిటేరియన్
ఎడ్యుకేషన్ ట్రస్ట్

తృతీయ ముద్రణము

ముఖచిత్రం : బాలి

ముఖచిత్ర ముద్రణ :
శ్రీ కె. నాగభూషణం



ప్రతులకు :

1. మానవ ధర్మ శిక్షణా సంస్థ
23-10-7, పురుషోత్తం వీధి
సత్యనారాయణపురం
విజయవాడ - 520011.

2. మానవ ధర్మ శిక్షణా సంస్థ
1-99, ముంజులూరు-521366.
బంటుమిల్లి మండలం, కృష్ణాజిల్లా.

వెల : రు. 30-00

ముద్రణ :
శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం, విజయవాడ-2.

# సామాన్యుని సంభావన

ఇదేం చిత్రమో! నన్ను ఉపోద్ఘాతం వ్రాయమన్నారు కృష్ణస్వామి గారు. సుప్రసిద్ధుణ్ణి గాని, గ్రంథగత విషయంలో నిష్ణాతుణ్ణి గాని, ఫలానా వారివల్ల ప్రామర్యం వస్తుందనుకున్న వాళ్ళను గాని ముందుమాట వ్రాయమని కోరతారు సాధారణంగా. ఈ చూపుతో నేనెంత అర్హుణ్ణో నాకుతెలుసు. ఇదే చూపుతో నేనెంత అనర్హుణ్ణో రచయితకు తెలుసు. ఈ రెండు రకాల తెలియటం ఒకటే. అది అందరకు తెలుసు.

మరయితే నన్ను ఎందుకు వ్రాయమని అడిగినట్లు? "మాస్టారు" గాని, వారి శిష్యులుగాని చేసే పనుల్లో నాకొక నమ్మకం ఉంది. వాళ్ళు ప్రాపంచికమయిన ఆలోచనల వల్ల గాక, భౌతికేతరమయిన ప్రేరణ వల్ల మామూలు కంటికి కనుపించని ప్రణాళికలో కార్యకర్తలుగా పనిచేస్తుంటారు. ఈ పని నాకు అప్పగించటంలో గూడ బహుశ అట్లాంటి కారణమేదో ఉండి ఉంటుంది. నాకు గూడ ఆ అదృశ్య ప్రణాళికలో ఏదోపాత్ర వచ్చి ఉండాలి. అందుకు ఇదొక ఆకర్షణీయమైన శిక్షణ అయి ఉండవచ్చు. అందుకని నమస్కరించి సరేనన్నాను.

అసలు భౌతికేతరమయిన విషయమే మిథ్య అనో, భ్రాంతి అనో, కల్పన అనో, చప్పరించే వారికి ఈ పుస్తకం ఇప్పుడప్పుడే అక్కరలేదు. ఎందుకంటే వాళ్ళ హేతువాదం భౌతిక జగత్తుకు మాత్రమే పరిమితం. అన్నింటికీ హేతువుల్ని భౌతిక పరిధిలో మాత్రమే వెదకాలని వాళ్ళ దీక్ష. భౌతికశాస్త్ర నిర్ధారితములయిన సత్యాల ననుసరించి హేతువులను నిరూపించడం మాత్రమే హేతువాదమని ఆ శాస్త్రదృష్టికి రాని అంశాలను హేతువు

లుగా చూపడం హేతువాదం కాదని హారం చేసేపరకు పెడతారు. అంటే వారి యిష్టాయిష్టాలను పరిశీలన మీద రుద్దుతున్నారు. కాని భౌతికేతర జగత్తునుండి గూడ హేతు పరిశీలనం చేసేవాడు మాత్రం శాస్త్ర శోధిత సత్యాలన్నింటినీ స్వీకరించే జగత్కారణాన్ని వివరిస్తున్నారు. ఇప్పుడు చెప్పండి ఎవరిది పిడివాదమో!

అంటే శాస్త్రీయ హేతువాదం ద్వారా మనఃపరిధిలోకి వచ్చిన జ్ఞానాన్ని ఆమోదిస్తూనే దానికంటే ఉన్నతమయిన కోశాల నుండి వచ్చిన విజ్ఞానాన్ని లోకానికి తెలియజెప్పేవారున్నారు. వారే జ్ఞానులు. వారి జ్ఞానం ఎల్లా వస్తుందన్న ప్రశ్నకు సమాధానం చెప్పగల వాణ్ణి నేను కాను· వారే. అయితే వారిమాట నమ్మడం ఎల్లాగా-అనేది అవిశ్వాసికి కలిగే శంక. వారిమాటలు అనుభవంలో నిర్ధారణ కావడంచేత- అనేక విషయాలను శాస్త్రం గూడ తర్వాత నిరూపించడం చేత-ఇట్టి జ్ఞానులు భిన్న కాలాల్లో, భిన్న దేశాల్లో చెప్పిన విషయాలు ఏకరూపంగా ఉండటంచేత-ఈ జ్ఞానాన్ని అందించడంలో వారికి స్వప్రయోజనం ఏమీ లేకపోవడం చేత-అవిలోకోప కారకంగా ఉండటంచేత-వారందించిన జ్ఞానాన్ని శిరస్సున ధరిస్తాము. అట్టి వారిలో "మాస్టారు" ఒకరు.

సందేహభావులు అనేకులు మాస్టారితో చేసిన సంభాషణలవల్ల వెల్లడయిన సమన్వయాల క్రోడీకరణమే ఈ గ్రంథం. సరయిన వాహిక మిత్రుడు శ్రీ కృష్ణస్వామిగారు.

ఏ బుద్ధిమంతుడయినా వచ్చి "అయ్యా! మాకెందుకు ఇవన్నీ? హాయిగా ఇంత సంపాదించుకుంటున్నాను. అనుభవిస్తున్నాను చాలదా!" అంటే "పాపం ఇతనికి మరో రెండుకాళ్ళు తక్కువగా ఉన్నాయి కాబోలు అనుకొని ఊరుకోవడమే మార్గం. భోగాసక్తిలో తృప్తి ఎంత గుణమో, జ్ఞానార్జనలో అంత దోషం. ఆకాశంవైపుకు ముఖం పెట్టుకొని వెల్లకిలా పడుకోగల జీవి మానవుడొక్కడే. వాడి దృష్టి గ్రహాలను దాటి ప్రయాణం చెయ్యటం గూడ అప్పటినుండే. దాని ఫలితంగానే తన చుట్టూ జరుగుతున్న

సంఘటనలకు కారణాల్ని ఇతర లోకాల్లో చూడగలిగాడు. తనకు తానే కారణం కావడం గూడ తెలుసుకున్నాడు. అయితే అక్కడ ఏవో క్రొత్త సూత్రాలు ఉన్నాయి. ఆ సూత్రాల రహస్యాలు తెలిస్తే అంతా కరతలామలకమే. అంతా హేతుబద్ధంగానే ఉన్నట్లు బోధపడుతుంది. వట్టి నమ్మకాలు మాత్రమే ననుకున్న వాటికి గట్టి పునాదులు కనిపిస్తాయి.

పూర్వజన్మ కర్మలకు ఈ జన్మలోని ఫలితాలను గూర్చి చర్చిస్తూ అనేక ఉదాహరణలను "నమ్మకాలు-నిజానిజాలు" అన్న భాగంలో విశదం చేశారు. చేసేపనికంటే ఆ పని వెనుక నున్న మనస్సు ముఖ్యం. ఏడుస్తూ దానం చెయ్యడం కంటే దానం చేసే మనస్సంస్కారం ముఖ్యం. ఈ సంస్కారమే మన కర్మ ఫలితాన్ని నిర్ణయిస్తుంది.

దయ్యాలు-ప్రయోగాలు మొదలయిన విషయాల్ని గూడ వివరించారు. వాటికి ఎంతశక్తి వున్నదో-వాటిని ఎదుర్కొగల శక్తి గూడ ప్రతి వ్యక్తికీ అంతగానే ఉన్నది. ఆత్మవిశ్వాసం-భగవద్విశ్వాసం-శుచి- ప్రార్థన ఇవి ఎదుర్కొనే శక్తినిస్తాయి.

మరణానంతరం ఏం జరుగుతుంది? అన్నది మానవుణ్ని చిరకాలంగా వేధిస్తున్న ఆసక్తికరమైన ప్రశ్న. అందుకు "మాస్టారు" ఇచ్చిన సమాధానాలు భిన్నమత విశ్వాసాలను సమన్వయం చేస్తున్నాయి. ప్రాచీన ఆచార వ్యవహారాలకు ఇచ్చిన వివరణలు-స్త్రీ పురుష సంబంధాన్ని గూర్చి, సమాజంలో వాళ్ళ స్థానం గూర్చి వారిచ్చిన అవగాహన ఎంతో సత్యబోధకంగా ఉంది. ప్రాచీనులు అందించిన జ్ఞాన ప్రవాహాన్ని కొంత అజ్ఞాన కశ్మలం గూడ ఆవరించింది. ఏది అజ్ఞానమో గూడ నిరూపించారు ఇందులో. ఉదాహరణకు నక్షత్రాల మంచి చెడులను గూర్చి, వశీకరణ ఉంగరాల గూర్చి. ఇట్లాంటి వాటిల్లో మాస్టారు చెప్పే అధికార సూత్రం ఒకటే. ఋషిప్రోక్తాలనే గాని పండిత ప్రోక్తాలను నమ్మనవసరం లేదని.

వారిచ్చే ప్రబోధాత్మకమయిన గొప్ప సందేశం శిష్యులతో సంభాషణల్లో కనిపిస్తుంది. అందులోనే మాస్టారి కార్యక్రమ లక్షణంకూడ

ద్యోతకమవుతుంది. అదే సత్కార్యాచరణకు ప్రేరణ కలిగించటం. ఇప్పటి వరకు భగవదారాధన ఏకాంతోపాసనగాను, సదాచార నిష్ఠగాను మాత్రమే అనుకుంటున్నాం. ఇది మనుష్యులను ఏకాకులను చేస్తున్నదేగాని సమాజం యెడల క్రియాశీలమయిన ఆరాధనగా మారలేదు. 'మానవసేవయే మాధవసేవ' అన్న సూక్తి అందమయిన వాక్యంగా ఉందేగాని, అందరి ఆచరణగా పరిణమించలేదు. మాస్టారు ఒక నూతన మార్గాన్ని బోధిస్తున్నారు. ఈ మార్గంలో వ్యక్తిగత జీవిత సమస్యలు మొదలుకొని ప్రపంచ ఆర్థిక సమస్యల వరకు పరిష్కారం లభిస్తుంది.

సత్కర్మాచరణం-దేన్నయినా వైరాగ్య భావంతో చెయ్యటం - ఎక్కువ చేసి తక్కువ ఆశించటం-తనకు తోచినట్లుగా ఒక్కడే ఏదో చేసుకుంటూ పోవడంగాక ఒక మంచి పనికై నలుగురిని కూడగట్టుకొని రావటం-ఇవి. చదవటానికి ఎంత స్వల్పమయిన ప్రణాళికగా ఉంది!

ప్రార్థన అయినా సరే ఒంటరిగా కంటే కలిసి చెయ్యడం ముఖ్యం. ఎవడికి వాడుగా గిరి గీసుకొని బ్రతుకుతున్న నేటి సమాజానికి-కలివిడిగా ఉండి సామూహిక సత్సంగాన్ని పెంపొందించుకోవడం పరిష్కారమని బోధిస్తున్నారు. మంచి కాలం ఎంతో దూరం లేదు—త్వరలోనే వస్తుందంటూ తరం మారితే స్వర్ణయుగమేనని ముందుకు వ్రేలు చూపిస్తున్నారు.

ఈ సందేశం కర్మాచరణ ద్వారా భగవదారాధనను బోధిస్తుంది గనుక మానవుని భౌతిక మానసిక జీవితాలకేగాక, ఆధ్యాత్మిక జీవితానికి గూడ మార్గదర్శకం అవుతున్నది. క్రియాశీలురయిన యువతరానికి దేవుని రాజ్యాన్ని భూమిపైకి తెచ్చే కార్యక్రమాన్ని అందిస్తున్నది.

—వావిలాల సుబ్బారావు

# కామధేనువు కదలివచ్చినవేళ

ఒక చెట్టు సారం, ఆ చెట్టు యొక్క పండులో అనుభవానికి వచ్చినట్లు, ఒక వ్యక్తి సారమూ, సంస్కారమూ ఆ వ్యక్తి వాక్కులో వెల్లడి అవుతాయి. ముఖం చూస్తే మనస్సు స్థితి బోధపడుతుందన్నాడు షేక్స్పియర్. అలాగే మాటలోనే మనిషి సంగతి పూర్తిగా వెల్లడి అవుతుంది. మానవుడు చేస్తున్న సాధన, పొందిన సిద్ధి వాని వాక్కులో అంతర్లీనంగా ప్రవహిస్తూ వుంటుంది. ఆవు తన శరీర సారాన్ని పాలుగా పిండి యిచ్చినట్లు మనిషి తన సాధనా సంస్కారాల సారాన్ని తన వాక్కులలో అప్రయత్నంగా వ్యక్తం చేస్తూ ఉంటాడు. జీవితాన్ని సద్వినియోగ పరచుకుంటూ, ఋషిత్వంతో ప్రకాశించే వ్యక్తి వాక్కు కామధేనువు వంటిదని వేదవాఙ్మయం చెబుతోంది. ఆ కామధేనువు ఎవరికి కావల్సినది వారికి అందిస్తూవుంటుంది. ఇదివ్వగలను, ఇదీయలేదు అనే పరిమితులు దాని దగ్గర వుండవు. కోరిన వారిని కోరినంతగా ఆ కామధేనువు కరుణించగలదు. మన అదృష్టవశాన ఆ కామధేనువు తన సాన్నిధ్యాన్ని మన కనుగ్రహించింది. మాస్టరుగారి వాక్కే ఆ కామధేనువని మన కందరికీ అనుభవమే గదా!

మాస్టరుగారి దినచర్య అంతా ఆర్తజన సేవతోనూ, ఆస్తికులకు ఆవశ్యకమైన దివ్యగ్రంథ రచనతోనూ నిండిఉంటుంది. ఆయన ఖాళీగా కనబడటమే అరుదు. ఏ భోజనం చేస్తున్నప్పుడో, ఏ రాత్రి పడుకోబోయే ముందో ఆవశ్యకతనుబట్టి, ఆయనకు ఆయనగా అవకాశాన్ని కలిగించి నప్పుడో, ఆయనతో సరదాగా అన్నివిషయాలమీద మాట్లాడడానికి అవకాశం దొరుకుతుంది. ముఖ్యంగా ఊరి ప్రయాణాలు చేసేటప్పుడు ఆయనతో వివరంగా మాట్లాడేటందుకు వీలు చిక్కుతూ ఉంటుంది. ఈ అవకాశాలకు

నోచుకున్న వాళ్ళ తగినరీతిలో వాటిని సద్వినియోగ పరచుకుంటూ ఉంటారు. ఎన్నాళ్ళిట్టి నుండో తమలో గూడుకట్టుకొని ఉన్న సంశయాలను నివృత్తిచేసు కోవడానికి, తమకున్న రకరకాల అనుమానాలను తీర్చు కోవడానికి, తా మెదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారాలు పొందడానికి, తమకు కావల్సిన ప్రత్యేక అంశాలపై తగిన వివరణలు పొందటానికి, ఆ అవకా శాలను సద్వినియోగపరచుకొంటూ ఉంటారు. కొందరు దేశంగూర్చి అడుగు తుంటారు. కొందరు దేశంగూర్చి మాట్లాడతారు. కొందరు దేవుళ్ళను గూర్చి అడుగుతుంటారు. కొందరు సంప్రదాయపు లోతుపాతులు అడిగి తెలుసుకొంటూ ఉంటారు. కొందరు సాహిత్యమంటారు. ఇలా ఎన్నెన్నో రీతులలో ఆ సంభాషణలు సాగిపోతూ ఉంటాయి. ఆ సంభాషణల్లో అడుగు తున్న వారికీ, ఆ సమయంలో అక్కడున్న వారికి, మాత్రమేకాక అన్ని కాలాలవారికి, అన్ని దేశాలవారికీ ఒక్కమాటలో చెప్పాలంటే, యావత్ మానవ జాతికీ పనికివచ్చే సమన్వయాలు మాస్టరుగారి నుండి లభిస్తూ ఉంటాయి.

అలాంటి సంభాషణల నెన్నిటినో ఆయనతో జరిపే అదృష్టం నాకు కలిగింది. మరెందరో ఎన్నెన్నో అంశాలమీద ఆయనతో సంభాషణ జరుపు తున్నప్పుడు పాల్గొని వినే అవకాశం కూడా కలిగింది. ఆ సంభాషణలలోని శక్తి అపూర్వమైనది. దేశ కాలాల కతీతమై, మానవాళికి సర్వకాల సర్వా వస్థలయందు చేయూత నిచ్చి, కనువిప్పు కలిగించి ముమ్ముందుకు నడిపించే శాశ్వతమైన సమన్వయాలు ఆ సంభాషణల్లో నిండియుండటం చేత అవి నా మనస్సులో అలాగే ముద్రింప బడ్డాయి. వాటి నన్నిటిని ఒక పద్ధతిలో, అందరికీ అందుబాటులో ఉండే తీరులో, ఆకర్షణీయమైన రీతిలో, అందరి అభిరుచులకు తగినట్లుగా కూర్పుజేసి కొన్ని గ్రంథాలుగా అందిస్తే, ఉప యోగకరంగా ఉంటుందన్న సంకల్పం కలిగింది. ఆ సంకల్పమే ఇప్పుడీ గ్రంథాన్ని తీర్చిదిద్దింది. ఇక మీదట ఎన్ని గ్రంథాలుగా ఈ సంభాషణలు- సమన్వయాలు వెలువడ గలవన్నది రచన జరిపిస్తున్న ప్రణాళికకు సంబం ధించిన అంశం మాత్రమే.

మనలో చాలామందికి కొన్ని సంశయాలు కలుగుతూ ఉంటాయి. మనమున్న పరిణామ స్థితినిబట్టి సంశయాలు కలగడం సహజమేగాని దోష మేమీ గాదు. ఎంతమంది పెద్దల ఉపన్యాసాలు విని అనుభూతి చెందినా, మళ్ళీ మన సంశయాలు మనకు మిగిలిపోతూ ఉండటం మనలో చాలా మందికి అనుభవంలోని విషయమే. పెద్దలు, మహానుభావులు మానవులకు సహజంగా కలిగే సంశయాలను తీర్చి వాళ్ళెదుర్కొంటున్న సమస్యలకు ఆచరణీయమైన పరిష్కారాన్ని చూపి, వాళ్ళకున్న ఈతి బాధలనుండి బయట పడేందుకు చేయూత నిచ్చి, ఆపైన బ్రహ్మ విద్యను బోధిస్తే, జనులు తేలికగా అందుకొని ఆచరించి తరించ గలుగుతారు. జనం ఉన్న స్థితిగతులూ, పరిస్థితులూ పట్టించుకోకుండా బ్రహ్మ విద్యను బోధించు కుంటూ పోతే కలిగే ప్రయోజనం చాలా తక్కువనే చెప్పాలి. టెలిఫోన్ డయిల్‌ను తొమ్మిదిదాకా త్రిప్పి వదిలినా మళ్ళీ 'సున్నా' దగ్గరకు వచ్చి ఆగినట్లు, ఆ పెద్దల సాన్నిధ్యంలో తాత్కాలికంగా అనుభూతి పొందినా మళ్ళీ మనకున్న సంశయాలలోనే మనం పడిపోతూ ఉండటం జరుగుతూ ఉంటుంది. ఈ సత్యాన్ని దృష్టిలో పెట్టుకొని మనకు తరచుగా గలిగే సంశయాలూ, నేడు మనం ఎదుర్కొంటున్న సమస్యలూ, ఈ సంభాష ణల్లో చర్చించబడ్డాయి. తగిన సమన్వయాలు, పరిష్కారాలు అందించ బడ్డాయి రానున్న గ్రంథాలలో ఇదే ప్రణాళికలో పరిధిని విస్తృత పరచు కుంటూ సంభాషణలు కూర్పు చేయటం జరుగుతుంది. బహుముఖాలుగా సమన్వయపు వెలుగును విరజిమ్ముతున్న మాస్టరుగారి సంభాషణలు తగిన రీతిలో కూర్పు చేయబడితే మానవునికి కావల్సిన సర్వస్వమూ వాటిలో లభించగలదు.

ఈ గ్రంథంలో అయిదు అధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయం "మన సమాజంలో స్త్రీ". నేడు మన సమాజంలో 'స్త్రీ'ని గూర్చి ఎంద రెందరో ఎన్నెన్నో రకాలుగా అభిప్రాయపడుతున్నారు. కొందరు ఆడ వారికి అన్యాయం జరుగుతోందంటే, మరికొందరు అనాదిగా స్త్రీ

జాతిఅణగ దొక్కబడుతూనే ఉందంటున్నారు. కొందరు మగవాళ్ళ జులుం పోవాలనీ, ఇంకొందరు స్త్రీలకు సమాన హక్కులు కావాలనీ రకరకాలుగా సిద్ధాంతాలు చేస్తున్నారు. వీటన్నిటి రూపంలో కన బడుతున్నది వివిధ భంగిమలు ధరిస్తున్న ఆవేశం మాత్రమే. నిజానికి స్త్రీ అని వేరుగా లేదుగదా! తల్లిగానో, భార్యగానో, అక్క చెల్లెళ్ళుగానో, కుమార్తెలుగానో, బంధుమిత్రుల రూపంలోనో ఉంటున్నదామె. అలాగే పురుషుడని వేరే ఉన్నాడా? భర్తగానో, తండ్రిగానో, బిడ్డగానో అన్న దమ్ముల, బంధుమిత్రుల రూపంలోనో ఉంటున్నాడు తప్ప, మనం నేర్వ వలసిం దేమిటంటే స్త్రీ పురుషులు ఒకరితో ఒకరు ఏ సందర్భాలలో ఎలా ప్రవర్తించాలో అలా ప్రవర్తించ గలగడం, కనుక ఈ అధ్యాయంలో స్త్రీల యెడల మనం అనుసరింపవలసిన బాధ్యతాయుతమైన ఆచరణమార్గం మాస్టరు గారెలా బోధపరస్తున్నదీ కూర్పు చేయబడింది. స్త్రీల విషయంలో తూలనాడేవాళ్ళూ, స్త్రీల అభ్యుదయం కోసం పాటుబడదామనుకునే వాళ్ళూ ఒక్కసారి ఈ అధ్యాయాన్ని అధ్యయనం చేస్తే వాళ్ళలో రావాల్సిన మార్పు వస్తుంది.

మనకు కొన్ని సందేహాలు వస్తూ ఉంటాయి. మరణించిన తర్వాత మనిషి ఏమౌతాడు? మనవాళ్లు చెప్పే స్వర్గనరకాలు నిజంగా ఉన్నాయా! మనం చేసే పితృకర్మలూ, పిండ ప్రదానాలూ పోయిన వారికి చెందుతాయా? అసలు పునర్జన్మ ఉందా? ఉంటే దాని తీరు తెన్నులేమిటి? పూర్వ జన్మలు గుర్తుకొస్తాయా? వస్తే కొందరికే ఎందుకొస్తాయి? మొదలైన సంశయాలు మనకు కలుగుతూ ఉంటాయి. అలా కలగడం సహజమే. చిత్ర మేమిటంటే ఈ దేహంలో ఉన్న మనకు ఈ దేహం ధరించక ముందు మన మెవ్వరమో, ఎక్కడ ఉండేవారమో తెలియదు. ఈ దేహం విడిచాక మన మెక్కడికి పోతామో, ఏమైపోతామో మనకు తెలి యదు. అంటే మనకు మొదలూ తెలియదు, చివరా తెలియదు. ఆ మొదలూ

చివర్లేమిటో తెలుసుకోవాలని. కోరిక గలగడం సహజమే గదా! అయితే ఈ సందేహాలను తీర్చగల వారెవరు? దేహాలలో ఉన్న మనలాంటి వాళ్ళు తీర్చలేరు మన కెంత తెలుసో వాళ్ళకీ అంతే తెలుసు. కాకపోతే సంస్కార వంతులూ, పండితులూ పెద్దల గ్రంథాలు చదివి వివరించ గలరు. అప్పుడు గ్రంథాలలో ఉన్నది నిజమో, కల్పనో అన్న అనుమానం కొందరికి వచ్చి తీరుతుంది. మరి ఆ అనుమానాన్ని తీర్చగలవాడెవ్వడు? మాస్టరుగారి వంటి ద్రష్టలే ఈ సందేహాలను తీర్చగలవారు. మనమంతా దేహాలలో ఉంటున్నాం. మాస్టరుగారులాంటివారు దేహాలతో ఉంటున్నారు. మన సౌకర్యం కొరకు వాళ్లు దేహాలద్వారా వ్యక్తమవుతూ ఉంటారు. మనకు మన యిళ్ళు ఎలాంటివో వాళ్ళకు వాళ్ళదేహాలలాంటివి. అవసరాన్నిబట్టి యింటికి తాళం వేసి బయటకుపోయి పనులు చూసుకొని వచ్చి తాళం తీసి యింట్లో ప్రవేశిస్తూ ఉంటాం మనం. అలాగే మాస్టరుగారి లాంటి వారు అవశ్యకతనుబట్టి శరీరాన్ని భద్రపరచి ఆయా సూక్ష్మ లోకాలలోనికి ప్రవేశిస్తూ ఉంటారు. చి॥ సత్తిబాబు కూర్పు జేసిన మాస్టరుగారి ప్రేమ లేఖలలో ఇలాంటి సన్నివేశాలు కొన్ని మనకు కనబడతాయి. వారికి స్థూల సూక్ష్మ లోకాలన్నిటితో సూటియైన సంబంధ బాంధవ్యా లున్నాయని వేరే చెప్పనక్కరలేదు.

అలాంటి మాస్టరుగారు మన సందేహాలకు కావాల్సినంత వివరంగా సమాధానాలివ్వడం "నమ్మకాలు-నిజానిజాలు" అన్న అధ్యాయంలో వరుసగా మనం చూడగలం. ఇంతవరకు ఇంటువంటి సమన్వయంతో, ఇంత పరిపూర్ణమైన వివరణ రావటం ఏ భాషలోనూ జరగలేదు.

అలాగే మనకు కొన్ని అనుమానా లుంటాయి. చేతబడులు, చిల్లంగులు ఉన్నాయా? పూనకాలూ, ఆవేశాలూ సత్యమేనా? దెయ్యాలున్నాయా?

మొదలైన ఈ అనుమానాలతోబాటు నిత్య పూజలో సంశయాలను కూడా మనం తృప్తి పడేటట్లుగా తీరుస్తుంది. 'నమ్మకాలు-నిజానిజాలు' అనే అధ్యాయం.

మూడవ అధ్యాయం 'శిష్యులతో మాస్టరుగారు'. మాస్టరుగారు ఎవరికి తగిన సంభాషణలు వారితో జరుపుతారు. ఎవరికి కావల్సిన రీతిలో వారితో మాట్లాడతారు. మాస్టరుగారి సరసమైన సంభాషణలను సజీవంగా పట్టివ్వడానికి ఈ అధ్యాయంలో ప్రయత్నం జరిగింది. ఈ అధ్యాయంలో మాస్టరుగారు శిష్యులకు చేయూత నిచ్చే చిత్రమైన విధానం మనకు దర్శన మిస్తుంది. ఈ సంభాషణలు ఎంత వినోదంగా ఉంటాయో, అంత వికాసాన్ని కలిగిస్తాయి. ఎంత వికాసాన్ని కలిగిస్తాయో అంత వినియోగ పడతాయి.

నేడు మనం సామాజికంగా లెక్కలేనన్ని సమస్యలను ఎదుర్కొం టున్నాం. సమస్యలకు తట్టుకోలేక దుఃఖించేవాళ్ళూ, ఆ సమస్యలను ఏకరువు పెట్టుకుంటూ కాలక్షేపం చేసేవాళ్ళూ, వాటిని గూర్చి భీకరంగా మైకుల్లో వర్ణించి పదవులు మొదలైనవి పొందుతున్న వాళ్ళూ, నిత్యమూ మనకు తగులుతూనే ఉంటారు. చిత్తశుద్ధితో ఈ సమస్యలకు పరిష్కారా లను అన్వేషించే వాళ్ళూ, తమకు తట్టిన పరిష్కారాలను తాము ఆచరణలో పెట్టి పదిమంది చేత పెట్టించే వాళ్లూ చాల తక్కువమంది కనబడుతు న్నారు. ఇలాంటి స్థితిలో మాస్టరుగారు నేటి సమస్యలకు పరిష్కారాలను ఆచరణాత్మకమైన రీతిలో సూచిస్తున్నారు. వాటిని తా నాచరించి కొన్నివేల మందిచేత ఆచరింపజేస్తున్నారు. నేడు మనకు అత్యంతావశ్యకమైన ఆ పరిష్కార మార్గాలను ఈ అధ్యాయంలో పొందుపరచడం జరిగింది. ప్రస్తుతం సమాజంలో కర్తవ్యాన్ని హృదయపూర్వకంగా కోరేవాళ్ళకి సమ

స్యలు-పరిదారులు అనే ఈ నాల్గవ అధ్యాయం ఎంతైనా ఉపయోగపడు తుంది.

ఈ గ్రంథంలో చివరి అధ్యాయం మహానుభావుల మర్మాలు. మనం విన్న, ఎరుగున్న మహానుభావులను గూర్చి ఎన్నో ప్రచారాలు మనకు వినబడుతూ ఉంటాయి. ఈ ప్రచారంలో వాళ్లను గూర్చి కొన్ని అనుమానాలు మనకుకూడ కలుగుతుంటాయి. ఈ ప్రచారాలను నమ్మేవారు కొందరుంటారు. నమ్మనివారు కొందరుంటారు. కాని వీటిని గూర్చి సరైన తీరులో విశదీకరించ గలవా రెందరుంటారు? పురుటి నొప్పులు తల్లి కే తెలిసినట్లు, వజ్రం మాత్రమే మరో వజ్రాన్ని భేదించగలిగినట్లూ మహాను భావుల జీవితాలలోని సూక్ష్మాంశాలను గూర్చి మళ్ళీ మహానుభావులే వివరించాలి మహానుభావులలో కొందరిని గూర్చిన అనుమానాలకు, సందేహాలకు మాస్టరుగారు దర్శింప జేసిన విలువైన సమన్వయాలు ఈ శీర్షికలో కూర్చబడ్డాయి.

ఇప్పటికి మానవుడికి అవశ్యకమైన అంశాలలో కొన్నిటికి సూటియైన, సంపూర్ణమైన సమన్వయాలను మాస్టరుగారి నుండి అందుకొని జిజ్ఞాసువులకు అందించగలిగానన్న తృప్తి నాకు కలుగుతోంది. నేటి సంపాదన రేపటికి పెట్టుబడి అయినట్లు, నేటి తృప్తి రేపటికి కర్తవ్య నిర్వహణకు ప్రేరణ. మానవుడికి అవశ్యకమైన అంశాలన్నిటికి మాస్టరుగారందిస్తున్న సమన్వయాలను అందరికీ అందుబాటులోనికి తీసికొని రావల్సిన అవసరం ఎంతైనా ఉన్నది.

సంభాషణలు జరుగుతున్నప్పుడు గాని, ఈ కూర్పు జరుగుతున్నప్పుడు గాని నాకు కలిగిన అనుభూతి ఏమిటంటే ఈ సంభాషణలు నేటి నరుడికి కావల్సిన గీత అని. అనాడు కృష్ణుడు బంధుమిత్రులను చూచి

మోహం చెంది విషాదాన్ని పొందిన అర్జునుడికి సత్యదర్శనాన్నందించి ధర్మరక్షణకై ధనుస్సు పట్టించాడు. అలాగే ఈ నాడు మాస్టరుగారు హక్కుల పోరాటంలో పడి కొట్టుకొంటున్న మానవుణ్ణి బాధ్యతా నిర్వహణమనే రామ రాజ్యంలోనికి మేల్కొలిపి శిక్షణ నిస్తున్నారు. ఎప్పుడెప్పుడు ధర్మానికి గ్లాని ఏర్పడుతుందో, అప్పుడప్పుడు తనను తాను సృజించుకొంటానని గీతలో చేసిన వాగ్దానం కృష్ణుడు నిలబెట్టుకొన్నాడనిపించింది. ఇది రచన జరుగుతుండగా నాకు లభించిన దర్శనం. తరువాత మాస్టరుగారి విశ్వరూపం లాంటి గురుపూజల్లో ఈ గ్రంథం ఆవిష్కరింపబడటం కూడ ఈ గ్రంథ వైభవాలలో ఒకటి. తరతరాల సోదరులు తరుగని ఈ ధనాన్ని స్వీకరించి తరించ గలరని విశ్వసిస్తున్నాను.

వాల్తేరు
3-1-80

మీ
వోపిదేవి కృష్ణస్వామి

# విషయసూచిక

## I మన సమాజంలో స్త్రీ



## II నమ్మకాలు-నిజానిజాలు

### A. పిశాచాలు-పూర్వాపరాలు

## B. దేహాలు విడిచిన తరువాత



## C. పితృకర్మల పరమార్థం

## D. పునర్జన్మల తీరుతెన్నులు



## E. పూర్వ జన్మల స్మృతులు



## F. చేతబడులు-దిగదుడుపులు

## V. మహానుభావుల మర్మాలు

పేజీ నెం.





# మన సమాజంలో స్త్రీ

## ఆడవాళ్ళు ఆధ్యాత్మికతకు అడ్డమా?

వ్యక్తి : మన పెద్దలు, ఆడవాళ్ళు ఆధ్యాత్మిక జీవితానికి అడ్డం అని చెప్పడానికి కారణం ఏమిటి? ఇలా అనడం ఎంతవరకు సబబు అంటారు?

మాస్టరుగారు : మన పెద్దల మాటలు మనం సరిగ్గా బోధపరచుకోక పోవడం వలన ఆడవాళ్లు ఆధ్యాత్మికతకు దూరం అనే అభిప్రాయం మనలో కరడు గట్టుకు పోయింది. మన పెద్దలు ఆధ్యాత్మికమైన అభివృద్ధిని కోరే వారు స్త్రీ సంపర్కాన్ని తగుమాత్రం పొందడం అభ్యాసం చేయాలన్నారు. అంటే సంతతి కొరకు మాత్రమే కామాన్ని సద్వినియోగ పరచుకొనే స్థితికి ఎదగాలని వారి ఉపదేశం. అసలు సత్యం ఏమిటంటే సంతానోత్పత్తి కొరకే ఈ సృష్టిలో స్త్రీ, పురుషభేదం అనేది ఏర్పడింది. అంతకుమించి స్త్రీ, పురుషులకు మరేమీ తేడా లేదు. శారీరక, మానసిక కక్ష్యలను దాటి నపుడు స్త్రీలు, పురుషులనే భేదమే ఉండదు. ఈ కారణంవల్లనే కొన్ని విశిష్టమైన ఆధ్యాత్మిక క్రతువులలో సంబోధించేటప్పుడు స్త్రీ, పురుష భేదాన్ని పాటించరు. అందరినీ అతడనే సంబోధిస్తారు. ఈ సత్యాలనన్నిటినీ ఒకచోట చేర్చి చూచినపుడు మనవాళ్ళు నియమాన్ని పాటించమన్నది కేవలము స్త్రీ, పురుష సంసర్గ విషయంలో మాత్రమే అని తెలుస్తుంది. అలా గని అసలా సంసర్గాన్నే కాదని కేవలం బ్రహ్మచారిగా ఉండిపోవడం క

కూడని పనే. అన్నం ఎక్కువతింటే అజీర్తి చేస్తుందిరా అని చెప్తే అన్నం తినడం మానేయమని అర్థం కాదుకదా! అన్నం తినడం అవసరం. అన్నాన్ని అతిగా తినడం ప్రమాదం. అలాగే స్త్రీ, పురుష సహజమైన దాంపత్యాన్ని అనుభవించడం అవసరం. దానికి లొంగిపోయి అతి చేసుకోవడం మాత్రం జరుగ కూడని పని.

వ్యక్తి : అయితే ఆదిశంకరుల మాట ఏమిటి? ఆయన వివాహమే చేసుకోలేదు కదా?

మాస్టరుగారు : ఆదిశంకరులు తాను వివాహం చేసుకోలేదు కాని, చేసుకో కూడదని మాత్రం చెప్పలేదు. ఆయన ప్రణాళిక ప్రకారం భూమి మీద ఆయన చేయవలసిన పని చేసి వెళ్ళిపోయారు. ఆయన శరీరంలో ఉన్నది కేవలం 33 సంవత్సరాలు. ఆ తక్కువ కాలంలో ఆయనకు వివాహము యొక్క అవశ్యకత లేకపోయింది.

ఈ సందర్భంలో ఇంకో సూక్ష్మం కూడా తెలియాలి. యోగసాధనలో పురోగమిస్తున్న కొద్దీ క్రమంగా జీవి పరిణామంలో పై స్థితికి చేరుకుంటాడు. అప్పుడు అతనికి కామానికి అతీతమైన దివ్యశరీరం లభిస్తుంది. ఆ స్థితికి వచ్చిన తరువాత అతడు భూమి మీదకు ఎప్పుడు దిగివచ్చినా, ఆ దిగి వచ్చిన ప్రణాళికలో వివాహంయొక్క అవశ్యకత ఉంటే వివాహం చేసుకుంటాడు. లేకపోతే దాని ప్రసక్తి తలపెట్టడు. ఆదిశంకరులు ఆ కోవకి చెందినవారు. అలాంటివారిని చూసి సామాన్యులు బలవంతాన వివాహాలు విరమించడం పులిని చూసి నక్క వాత పెట్టుకోవడం. దానితో మనం చెడిపోవడమే కాకుండా పెద్దల మార్గానికి వక్రభాష్యం చెప్పేవాళ్ళం కూడా అవుతాము. ఇంతకీ దాంపత్యం మనం అనుభవించే భోగంగా భ్రమపడినపుడు ఈ ఇబ్బంది అంతా వస్తుంది. అలా కాకుండా దాంపత్యం అనేది ప్రకృతి మన కప్పగించిన బాధ్యతగా గ్రహించ గలిగిన నాడు మరి సమస్యలు అనేవే ఉండవు.

## స్త్రీ మళ్ళీ పెళ్ళి చేసుకోకూడదా?

వ్య_క్తి: మాస్టరుగారూ! భార్యపోతే మగవాడు మళ్ళీ పెళ్ళి చేసుకుంటున్నాడు- భర్తపోతే స్త్రీ మళ్ళీ ఎందుకు పెళ్ళి చేసుకోకూడదు?

మాస్టరుగారు : భారతీయ స్త్రీ యొక్క ఉ_త్తమ స్థితికి అది నిదర్శనం. భర్త పోయిన తరువాత చేసుకోవాలా, అక్కర్లేదా అన్నది మనం నిర్ణయించకూడదు. అది ఆ స్త్రీలకే వదలిపెట్టడం ధర్మం. స్త్రీల మనోభావాలు, ముఖ్యంగా భారతీయతను జీర్ణించుకొన్న స్త్రీల మనోభావాలు మన ఊహల కందేవి కావు. మన సిద్ధాంతాలకు లొంగేవి కావు. మనం మన సంస్కారాలతో నిర్ణయం చేస్తూ ఉంటే, వాళ్ళు వాళ్ళ సంస్కారాలతో కర్తవ్యాన్ని నిర్ణయించుకుంటూ ఉంటారు. ఒక్కొక్క స్త్రీ భర్త ఎడల ఆరాధన పెంపొందించుకుంటూ అతనినే దైవంగా భావించి పూజించుకుంటుంది. అలాంటప్పుడు భర్త శరీరాన్ని వదలినా, ఆమె హృదయంలో మరింతపెద్ద మూర్తితో భర్త నిండుతాడు గాని, నిష్క్రమించడు. అలాంటప్పుడు ఆమె ఆరాధన మరింత పెరుగుతుంది. అలాటి స్త్రీని మనకు తోచిన హేతువులు చూపి పెళ్ళి చేసుకో మనడం ధర్మమెలా అవుతుంది? ఆరాధన మూర్తీభవించగా భారతీయ స్త్రీ రూపు కట్టుకుంది. అందువల్ల భారతీయ స్త్రీలలో ఎక్కువమంది మళ్ళీ వివాహానికి ఇష్టపడరు. ఇలాగే మగవాళ్ళు కూడా ఆచరించాలని రాముడు తన జీవితంలో చూపాడు. అదీ మన మగవాళ్లు ఎంత వరకు ఆచరిస్తున్నా రన్నది మనకు సంబంధించిన విషయం. మళ్ళీ పెళ్ళి చేసుకుంటున్న మగవాళ్ళని ఎలా అడ్డు పెట్టడం లేదో, మళ్ళీ పెళ్ళి చేసుకుంటామన్న ఆడవాళ్ళని అలాగే అడ్డుపెట్టనక్కరలేదు. అయితే మన పెద్దలు ఒకమాట చెప్పారు. సంతతి కలుగకుండానే భర్త పోయినపుడు- సంతతి కొరకై మళ్ళీ వివాహం చేసుకోవడం తప్పు కాదు అన్నారు. కాని అప్పుడు కూడా వ్యక్తుల ఇష్టాలకు మనం ఎప్పుడూ వ్యతిరేకంగా ప్రవర్తించకూడదు. పరిణామమనే నిచ్చెనమీద ఒక్కొక్కరు, ఒక్కొక్క

మెట్టుమీద ఉంటారు. వాళ్ళున్న మెట్టునుబట్టి వాళ్ళు తీసుకునే నిర్ణయాలు అవీ ఆధారపడి ఉంటాయి. అందరూ ఒకేలా ఉండటం అనేది ఎప్పుడూ సాధ్యంకాదు. లోకాన్ని పరిశీలించేటప్పుడు మన మీ సత్యాన్ని దృష్టిలో పెట్టుకోవాలి.

## కుంకుమ, పూలు పెట్టుకోకూడదా?

వ్యక్తి : భర్త పోయాక పసుపు కుంకుమలు, పూలు మొదలైనవి ధరించక పోవడం, జుట్టు తీసివేసి వికృతమైన ఆకారాన్ని పొందడం మొదలైన ఆచారాలు ఎలా వచ్చాయంటారు?

మాస్టరుగారు : ఈ ఆచారాలు కూడా పరిణామంలో ఉన్నత స్థితిలో నున్న స్త్రీలు కావాలని కోరి నెలకొల్పు కున్నవే. భర్తనే దైవంగా భావించిన స్త్రీ భర్త పోయిన తరువాత అలంకారాలను, అభిరుచులను తనకు తానుగా వదులు కొంటుంది. కొండంత భర్త లేనపుడు ఇవన్నీ ఎవరికోరకు అని ఆమె ప్రశ్న. తన శేష జీవితాన్ని నిర్లిప్తంగా గడపాలని ఆమె కోరిక. అలాంటి స్త్రీని బలవంతం చేసినా, తన నిర్ణయాన్ని మార్చుకోదు. భర్త పోయిన తరువాత తమలో కూడని కోర్కెలు ఏ సందర్భంలోనూ కలుగకుండా ఉండటానికి, తమని చూసినవారికి కూడ, కూడని మోహావేశాలు రేగకుండా ఉండటానికి స్త్రీల విషయంలో ఈ ఆచారాలు పాటింపబడుతున్నాయని కూడ మనం గ్రహించవచ్చు. ఈ విషయంలో కూడ స్త్రీకి స్వేచ్ఛని ఇవ్వటం అవసరం. ఆమెకి ఇష్టం లేకుండా ఆమెను ఇబ్బంది పెట్టడం మంచిదికాదు.

## స్త్రీకి స్వేచ్ఛ కూడదా?

వ్యక్తి : మన శాస్త్రాలు "నస్త్రీ స్వాతంత్ర్య మర్హాతి" అని స్త్రీకి స్వేచ్ఛను, అంగీకరించలేదుకదా! ఇలా అనడం ధర్మమేనా?

మాస్టరుగారు : "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అంటే స్త్రీకి స్వేచ్ఛ ఉండకూడదని అర్థం కాదు స్త్రీకి రక్షణ అవసరమని హెచ్చరిక. చిన్నతనంలో తల్లిదండ్రులు, పెళ్ళి అయ్యాక భర్త, తరువాత కుమారులు స్త్రీని రక్షించుకోవాలి. అంటే ఆమెను నిర్లక్ష్యం చేయకుండా ఆమె ఎడల పూజ్యభావంతో ప్రవర్తించాలి అని అర్థం. ఎక్కడ స్త్రీలు పూజింపబడుతున్నారో, అక్కడ దేవతలు విహరిస్తూ వుంటారని ఆ శాస్త్రకారుడే చెప్పిన వాక్యాలని ఈ సందర్భంలో మనం గుర్తుచేసుకుంటే మనం పట్టాలు తప్పకుండా వుండటానికి పనికివస్తుంది.

లాంతరు వెలుగుతున్నంత వరకు, లాంతరు గ్లాసు తప్పకుండా ఉండాలి అంటే ఆ వెలుగును అవమానించినట్లు అర్థంకాదు. వెలుగు నీకు ఉపయోగపడాలి అంటే రక్షణగా గ్లాసు పెట్టుకోవడం అవసరమని అర్థం. అలాగే సున్నితమైన స్త్రీ స్వభావాన్ని పూజ్యభావంతో రక్షించుకోవలసిన ఆవశ్యకత, బాధ్యత ఉన్నదని పెద్దలు తెలియచెప్పారు. పెద్దల వాక్కులను పఠించబోయే ముందు మనకంటిని సరిచేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

వ్యక్తి : మీరు చెప్పిన వివరణ బాగుంది మాస్టారూ! అలాగే మరో అనుమానాన్ని కూడా తీర్చి పుణ్యం కట్టుకోండి.

మాస్టరుగారు : దానికేమిటి చెప్పు.

వ్యక్తి : అనాదిగా మన సమాజం ఆడవారిని అణగతొక్కిందని, వంటఇంటి కుందేళ్ళుగా మార్చిందని, కేవలం మగవాళ్ళపై ఆధారపడే వాళ్ళుగా సామాజిక వ్యవస్థ సృష్టింపబడటం జరిగిందని ఆంక్షలు,కట్టుబాట్లు స్త్రీని కట్టిపడవేశాయని చాలామంది అంటున్నారు. ఇది ఎంతవరకూసత్యం?

మాస్టరుగారు : వాళ్ళ నినాదాల మాటెందుకోయ్! నేనొక మాట అడుగుతాను చెప్పు. మీ ఇంట్లో మీ ఆవిడ మంచిమాట చెప్పిందనుకో నువ్వు వింటున్నావా! లేదా!

వ్యక్తి : భలేవారు మాష్టారూ! ఇంటి వ్యవహారమంతా ఆవిడే చూసుకుంటూ ఉంటుంది. ఆ విషయాల్లో నేనెపుడూ వేలుపెట్టను కూడా. ఆవిడ సామర్థ్యం ముందు నా చదువు, ఉద్యోగం ఎంత అనిపిస్తుంది. ఆవిడ ఆలోచన ఎప్పుడూ కుటుంబాన్ని గురించే, ఆవిడ మాటలు నేను కాదనవలసిన పని వుండదు.

మాస్టరుగారు : చూశావామరి! ఆ చాలామంది చేస్తున్న నినాదాలు మీ ఇంట్లో ఎంతవరకు వర్తించాయో! ఈ విధంగా పరిశీలిస్తూ పోతే మన లాంటి సాధువైన కుటుంబాలే ఎక్కువగా కనపడతాయి. అయితే స్త్రీలను నిర్లక్ష్యంచేసే పిచ్చివాళ్ళు లేరని నేను అనను. అలాంటి పిచ్చివాళ్ల పెరిగినప్పుడే స్త్రీలకు జరిగిన అవమానం కారణంగా కరువులు, కాటకాలు మొదలైనవి ఆ ప్రాంతాలను క్షోభింపచేస్తూ ఉంటాయి. కలకంఠి కంట కన్నీరొలికితే కలిమి మరి కనపడదని మన పెద్దలు ఘంటాపథంగా చెప్పారుకదా! పరిణామంలో మానవ శరీరాలు మాత్రం ధరించి, ఇంకా జంతు స్వభావాలను పూర్తిగా వదలని ఆడ, మగ ఒకళ్ళనొకళ్ళు తక్కువగా చూసుకొంటారు. మానవత్వం ఉన్నవాడెవడూ మరొక మనిషిని తనకన్నా తక్కువగా చూడడు. అయితే అనాదిగా అణచిపెడుతున్నారు అంటున్నారు. మనలో కొంతమందికున్న రోగ లక్షణాలను సమాజాని కంతటికీ ఆపాదించటమే తప్పు. అంతటితో ఆగక అనాదినుంచి ఈ రోగ లక్షణాలున్నాయనడం క్షమించరాని తప్పు. మాతృదేవోభవ, పితృదేవోభవ అని తల్లికి మొదటి పీఠం వేసింది వేదం. వేద భాగాలను దర్శించిన వారిలో స్త్రీలు కూడా ఉన్నారు. ఇక పురాణేతిహాసాల దగ్గరకు వస్తే సీత లేకపోతే రామాయణం లేదు. ద్రౌపది లేకపోతే భారతం లేదు. సీతకొరకు రాముడెంతగా తపించాడో మనకు తెలుసు. అలాగే ధర్మరాజు పరిపాలనకు సంబంధించిన విషయాలన్నీ తల్లిఅయిన కుంతీదేవితో సంప్రదించి చేసేవాడు. రాజ్యపాలనలోనూ, అంతఃపుర నిర్వహణలోనూ ద్రౌపది ఎంతటి బాధ్యతాయుతమైన

పాత్రను నిర్వహించేదో భారతం చదివితే మనకు బోధపడుతుంది. చివరకు జమా ఖర్చులుకూడ ఆవిడే సరిచూచేది. ఆవిడున్నదన్న ధైర్యంతో పాండవులు ఆదమరచి నిద్రపోగలిగేవారు. సత్యభామను, నరకాసుర సంహారానికి వెంట తీసుకువెళ్ళాడు కృష్ణుడు. ఆ సందర్భంలో ఆవిడ ఆ రాక్షసులతో కొద్దిసేపు యుద్ధంచేసింది కూడా. తప్పు తెలుసుకున్న దుష్యంతుడు శకుంతల పాదాలపై సాష్టాంగపడ్డాడని వ్రాశాడు కాళిదాసు. ఈ విధంగా మన సంప్రదాయం స్త్రీని దేవతగా ఆరాధించింది. అయితే అందరూ అలాఉంటున్నారని నేను చెప్పను. అందరూ అలా ఉండాలని మాత్రం నేను పదేపదే చెబుతుంటాను.

సమాజంలో అన్ని రంగాల్లోనూ కొందరు దుష్టులు ఎప్పుడూ ఉంటారు. మీ కాలేజీలో కొందరు విద్యార్థులు అల్లరి చేసినప్పుడు ఈనాటి యువకులంతా పనికిమాలినవాళ్ళు అనడం ఎంత సత్యమో, వెనుకటి పురుషులంతా స్త్రీలను అణగద్రొక్కారనడం అంతే సత్యం.

వ్యక్తి : మబ్బులు విడిపోయాయి మాష్టారూ! మీ మాటలు వింటుంటే సత్యం బోధపడింది.

మాస్టరుగారు : వివాదాలు చేయడంవల్ల ఉపయోగం లేదు. మనం రొష్టుపడి, పదిమందిని రొష్టుపెట్టడం తప్ప. సమదృష్టితో కొంచెం నిదానించి ఆలోచిస్తే సత్యం దర్శనమిస్తుంది. కర్తవ్యం బోధపడుతుంది.

## స్త్రీ జాతి అణగ ద్రొక్కబడిందా ?

వ్యక్తి : భర్తలుపెట్టే బాధలన్నీ సహిస్తూ భర్తలను ఆరాధించే సీతలు, దమయంతులు, సావిత్రులు, అనసూయలు, అరుంధతులు ఈ కాలంలో కూడ ఉండబట్టే స్త్రీజాతి అణగద్రొక్కబడుతోంది అని కొందరంటున్నారు. ఇంతకూ ఆ మాటల్లో నిజం ఎంత ఉందంటారు మాష్టారూ!

మాస్టరుగారు : అవును. సినిమా కవులు విశేషంగా అంటున్నారు. అది వ్యాపారసరళి. మరి పదిమంది ఆడవాళ్ళని సినిమాకి రాబట్టడానికిచేసే చవకబారు ప్రయత్నం. ఇంతకీ ఈ చెప్పిన అయిదు ఉదాహరణలు వారి వాదాన్ని లేవకుండా ఖండిస్తున్నాయి. సీతకు రాముడంటే ఎంత ప్రేమ. రాముడికి సీతఅంటే ఎంత ప్రేమ? ఆమెమాట కాదనలేక అతగాడు లేడి కోసం వెళితేనేగదా కొంప మునిగింది. సీతను తనతో అడవికి రమ్మని రాముడు బలవంతం చేయలేదు. వస్తానని ఆమె కుతూహలపడ్డది, రాముడు మగవాడు కదాఅని ఆమె కుతూహలాన్ని అణచిపెట్టలేదు. ఇక దమయంతి నలుణ్ణి ప్రేమించి మోహపడి దేవతలను కాలదన్ని మరీ అతణ్ణి పెళ్ళి చేసుకుంది. ఇక సావిత్రి తాను ప్రేమించిన సత్యవంతుడు చనిపోతాడని చెప్పినా లెక్కచేయకుండా వివాహమాడింది. అనసూయ దాంపత్యంలో అత్రి మహార్షికి కూడ ఆమె గౌరవనీయురాలైన ఒకదేవత. అరుంధతి వశిష్ఠునకుగూడా పూజ్యస్థానం వహించినదే గానీ అణగద్రొక్కబడినది కాదు. పాపం ఈ సినిమావాళ్ల ఇంకేమైనా ఉదాహరణలు తీసుకుంటే బాగుండేది. సమాజాన్ని పిచ్చివాళ్ళ క్రింద జమకడుతున్నామనుకొంటూ వాళ్ళెంత పిచ్చివాళ్ళయి పోతున్నారో ఈ ఉదాహరణల వల్ల తెలుస్తుంది. ఇక దాన్ని మెచ్చుకునే వాళ్ళ తెలివితేటల్ని ఏమనాలి ?

## నెలసరిలో వేరెందుకు ?

వ్యక్తి : మాస్టరుగారూ! స్త్రీలు నెలసరి కాలంలో వేరుగా ఉండాలన్న నియమం మనవాళ్ళెందుకు పెట్టారు? ఇలా పెట్టడంలో పరమార్థమేదైనా ఉందా ?

మాస్టరుగారు : తప్పకుండా ఉంది. ఋతుకాలంలో మొదటి మూడు రోజులు వేరుగా ఉండటం అనేది చాలా శాస్త్రీయమైన నియమం. ఆ మూడు

రోజులు ఒళ్ళంతా పచ్చిగా ఉంటుంది. శరీరాన్ని శ్రమపెట్టకూడదు. బరువు లెత్తడం, నీళ్ళు తోడడం మొదలైనవి చేయకూడదు. విశ్రాంతి చాలా అవసరం. విశ్రాంతి తీసుకోకుండా శరీరాన్ని శ్రమపెట్టి పనిచేసిన వాళ్ళు, నీళ్ళల్లో దిగి పనిచేసినవాళ్ళు. తర్వాత కాలంలో తీవ్రమైన రోగాలకు గురి అవుతారు.

అలాగే ఆ మూడు రోజులూ స్త్రీ శరీరంచుట్టూ కొంతలెక్క వరకూ ఒక రకమయిన వాతావరణం ఏర్పడుతుంది. ఆ వాతావరణ ప్రభావం ఇతరులపై పడకుండా ఉండటానికి ఆమెను ముట్టుకోవద్దు అంటారు. ఈ సత్యం తెలియక ఆ మూడు రోజులు అందరితో కలిసి తిరిగితే ఇంట్లో వాతావరణం అంతా disturb అవుతుంది. అలా disturb అయిన వాతావరణంలో ఉన్న వాళ్ళు దైవసాన్నిధ్యాన్నిగాని, పరమగురువుల సాన్నిధ్యాన్నిగాని, పెద్దల ఆశీస్సులను గాని స్వీకరించే స్థితిలో ఉండరు. క్రమంగా దివ్యత్వాన్నుండి కత్తిరింపబడతారు. తింటూ, తిరుగుతూ కాలక్షేపం చేయటాని కలవాటు పడిపోతారు. అంతకు మించి ఎదగటానికి అవకాశం లేకుండా చేసుకున్నవాళ్ళవుతారు. ఇన్ని కారణాలను దృష్టిలో పెట్టుకుని మనవాళ్ళు స్త్రీలను ఆ మూడు రోజులు దూరంగా ఉండమన్నారు

ఇది మన వాళ్ళలోనే కాదు. ఇందలి సూక్ష్మమైన సత్యాన్ని గ్రహించిన అన్నిజాతుల ప్రాచీనులకు ఈ నియమం ఉన్నది. నాగరికత పెంపొందిన ప్రాచీన జాతుల చరిత్ర పరిశీలించు. ఉదాహరణకు యూదు జాతి సంప్రదాయంలో ఋతుకాలం మొదలుకొని స్త్రీలు 7 రోజులు వెలుపల ఉంటారు. అలాగే ప్రాచీన ఈజిప్టు సంప్రదాయకూండా చెబుతోంది. ఇంకో సత్యం పరిశీలనకు సులువుగా అందుతుంది. ఋతుకాలంలో స్త్రీలకి మనస్సు చాల సున్నితంగా, అవ్యవస్థితంగా, చాలామందికి బాధాకరంగా ఉంటుంది.

వరాలన్నీ పచ్చిపుండులాగా ఉంటాయి. కొందరికి అకారణంగా దుఃఖం కూడా కలుగుతుంది. కొందరికి గ్రంథులు నొప్పి చేస్తాయి. శీతోష్ణాలుగాని, పురుషుని పశుప్రవర్తనగాని సహించదు అప్పటి స్థితి. బాగా చల్లని నీళ్ళలో కాళ్ళు కడుక్కున్నా స్రావం ఆగిపోతుంది. ఎక్కువ వేడినీళ్ళతో కాళ్ళు కడుక్కున్నా స్రావం ఎక్కువై నీరసం వస్తుంది. అంతేకాక స్రావం సందర్భంలో భోజనాది విషయాలలో అపరిశుభ్రత అనేక రోగాలను కలిగిస్తుంది. అందరికీ పరిశుభ్రత పాటించ గలంత సంస్కారం ఉండకపోవచ్చు. ఇన్నిటినుండీ రక్షింపబడటానికే వేరుగా ఉండటం, పనులు చేయకుండా ఉండటం ఏర్పాటు చేశారు.

వ్యక్తి: ఏదో గుడ్డిగా అనుసరిస్తున్నారనుకున్నాను. ఆచారం వెనుక ఎంత కథ ఉంది మాస్టారూ! మీరు చెబుతున్నది వింటున్న కొద్దీ మన వాళ్ళు ఎంతగా తపస్సుచేసి ఈ ఆచారాలను రూపొందించారో ననిపిస్తుంది.

మాస్టరుగారు : అంత కథ లేకపోతే ఇన్ని యుగాలుగా కొన్ని వేల తరాలచే ఈ ఆచారాలు ఎందుకనుష్ఠింప బడతాయి స్వామీ!

## నెలసరి రాకుండా మాత్రలు వాడవచ్చా ?

వ్యక్తి : వివాహాదుల సందర్భంలోనూ, తీర్థయాత్రల సందర్భంలోనూ స్త్రీలు వెలుపల ఉండే టైమ్ తప్పించడానికి కొందరు మందులు వాడుతుంటారు. దానిని గూర్చి మీరేమంటారు ?

మాస్టరుగారు : పెళ్ళి ముహూర్తం కోసం కాల కృత్యాలు ఆపుకోవడం ఎలాంటిదో ఇదీ అలాంటిదే. ఒక మోటు ఉదాహరణ యిస్తాను. కోప్పడకు. ఒకామెను శోభనపు గదిలోనికి పంపవలసిన రోజున ఆమెకు అధిక సంఖ్యలో నీళ్ళ విరోచనాలు అవుతున్నాయనుకో. ఆమెను బిగపట్టి

ఆపుకోమనడం సమంజసమా! శోభనపు ముహూర్తం మార్చడం సమంజసమా! ఏది వాంఛనీయం? ఆమె బ్రతికి బట్ట కట్టాలంటే ముహూర్తం మార్చడం మంచిదని ఒప్పుకొని తీరాలి. అన్నం తినేవాడెవడూ దీన్ని కాదనలేడు. నువ్వు చెప్పిన విషయంలో కూడా అంతే! ఇక ఇలా చేస్తున్న వాళ్ళ విషయంలో తప్పెవరిది? ఈ మందులు తింటున్న వాళ్ళది మాత్రం కాదు. తినమని చెప్పిన వైద్యుడిదీ, తయారుచేసిన ఫార్మసీ వాడిదీ, అనుమతించిన ప్రభుత్వానిదీ. ఎవరి మాట ప్రజలకు ప్రమాణమో వాళ్ళ చెయ్యమన్నప్పుడు తప్పుగా సామాన్యులు ఎలా భావించగలరు? డబ్బుకోసం గడ్డి తినటం అధికార వర్గాలవాళ్ళు చేయరాదు. వాళ్ళు ఆ నీచతకు పాల్పడితే, ప్రజలే జాగ్రత్త పడటం అవసరం. ఒక్కమారు మందులతో ఋతుకాల భేదనం చేసిన స్త్రీకి అంతకు ముందున్న ఆరోగ్యం ఇక ఆ జన్మలో ఉండదన్నది అనుభవసిద్ధం. ఆచరించిన వాళ్ళని అడిగిచూడు.

పెళ్ళి ముహూర్తానికి బహిష్టు కాలం విఘ్నం కలిగించిందంటే అది ముహూర్తం కాదన్న విషయం స్పష్టం. ముహూర్తం పెట్టినవాడు అంత ప్రయోజకుడన్న మాట! అలాంటి మందులు తినమన్న డాక్టరు, తయారు చేసినవాడు, ఆమోదించిన ప్రభుత్వం,ముహూర్తం పెట్టినవాడు, ఒకే జాతికి చెందుతారు. అది ఏ జాతి అన్నది చెప్పనక్కరలేదు.

### నెలసరిలో మంత్రోపాసన :

వ్యక్తి : మాస్టరుగారూ! స్త్రీలు నెలసరి కాలంలో ప్రార్థన, మంత్రోపాసన చేసుకోవచ్చా?

మాస్టరుగారు : స్త్రీలు వెలుపల వున్నప్పుడు అపవిత్ర కాలం కనుక జప ధ్యాన పూజాదికాలు చేసుకోగూడదని కొందరి మతం. స్నానం చేయ

కుండా జపం చేసుకోగూడదు అంటే ఎంతో, యిదీ అంతే, కాని పెద్దల సంప్రదాయం దీనికి భిన్నంగా ఉంది. అపవిత్రుడైనా పవిత్రుడైనా ఏ స్థితిలో ఉన్నా ఎవడు దైవ స్మరణ చేస్తాడో అతడు బహిరంతర శుచిత్వాన్ని పొందుతాడని సంధ్యావందన ప్రార్థన చెబుతోంది. ఇదే వెలుపల ఉన్న స్త్రీల విషయంలో కూడా వర్తిస్తుంది. దేవుని స్మరణ మనలను పవిత్రం చేస్తుంది. కాని మన మైల దేవుడికి సోకదు. కాకపోతే పూజలో కొన్ని పాత్రలు, పూజాసామగ్రి, పూజా మందిరం ఉంటాయి కనుక వాటిని తాకడం, వాడుకోవడం మంచిదికాదు. జప ధ్యానాదులకు మాత్రం తప్పు లేదు.

**ఆడవాళ్ళు-ఉద్యోగాలు :**

వ్యక్తి : మాస్టరుగారు! ఇటీవలి కాలంలో స్త్రీలు కూడా పురుషులతో సమానంగా చదువులు చదివి ఉద్యోగాలు కూడా చేస్తున్నారు గదా! ఆడవాళ్ళు ఉద్యోగాల్ని చేయడం గూర్చి మీ అభిప్రాయం ఏమిటి ?

మాస్టరుగారూ : న్యాయమైన ఏ వృత్తి అయినా స్త్రీలుగాని, పురుషులు గాని చేసుకోవచ్చు. నీతిమంతులైన పురుషుల దగ్గర నీతిమంతులైన స్త్రీలు ఏ ఉద్యోగం చేసినా తప్పేమిటి? అది సంఘంలో సోదరభావాన్ని పెంపొందింప చేస్తుంది. అజ్ఞాతవాసకాలంలో ద్రౌపదీ చేసింది ఉద్యోగం కాదా! అలాంటివారు ఏ ఉద్యోగం అయినా చేయవచ్చు.

మరొక విశేషం ఉంది. పుట్టుకచేత స్త్రీ గౌరవింప బడటం సమాజం యొక్క అదృష్టాన్ని, సుఖ జీవనాన్ని పెంపొందిస్తుంది. గౌరవింపబడుతూ సరదా కోసం విజ్ఞానాభివృద్ధి కోసం స్త్రీ ఉద్యోగం చేయడం మంచిదే. పొట్టతిప్పల కోసం తప్పని సరై ఉద్యోగం చేయడం మాత్రం మంచిది కాదు. ఏ సమాజంలో ఆడది ఉద్యోగం చేయకపోతే కుటుంబానికి జీవనోపాధి గడ

పదో ఆ సమాజంలో పురుషులు అసమర్థులని, ప్రభుత్వం ఒక చపట అని తేల్తుంది. అలాంటి సమాజంలో స్త్రీకి పూజ్య భావం ఉండదు. ఆ దేశంలో జరిగే పనులన్నీ నిష్ఫలం అవుతాయని మనువు చెప్పాడు.

యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః ।
యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రా ఫలాక్రియాః ॥

మనువు వాక్యాన్ని దృష్టిలో పెట్టుకొని మనం మనుగడ సాగించవలసి ఉంది.

పూజ్యభావంతో ఉంటే స్త్రీలు గౌరవంగా ఉద్యోగం చెయ్యడం దేవతల కథలలో కూడా కనిపిస్తుంది. బ్రహ్మగారికి సరస్వతి స్టెనోగ్రాఫర్ (stenographer)గా పనిచేస్తోంది. పార్వతి అనేక అవతారాలెత్తుతూ రాక్షస సంహారం విషయంలో భర్త దగ్గర పార్టుటైమ్ ఉద్యోగాలు చేస్తోంది. అలా విలాసార్థం స్త్రీలు ఉద్యోగం చేసుకున్నా తప్పులేదు.

వ్యక్తి : నిజమే మాస్టారూ! స్త్రీలు తమ సామర్థ్యాన్ని సద్వినియోగపరచటానికి అభిరుచులను పెంపొందించుకోవటానికి ఉద్యోగాలుచేస్తేతప్పేమిటి ? కాకపోతే వారిని పూజ్యభావంతో చూచుకోవడం మనకుచేతకావాలి.

## ఆడవాళ్ళు - ఆస్తి హక్కు :

వ్యక్తి : మన కుటుంబాల్లో సామాన్యంగా ఆస్తిహక్కు పురుషులకే ఉంటోందిగాని స్త్రీలకు లేదుగదా మాస్టారూ! ఇలా ఎందుకుజరిగిందంటారు?

మాస్టరుగారు : నరజాతి చరిత్రలో పురుషులకి ఆస్తిహక్కులున్న సమాజాలూ స్త్రీలకే ఆస్తిహక్కులున్న సమాజాలు శతాబ్దాల తరబడి వేర్వేరుగా కనిపిస్తాయి. ఇది కేవలం అలవాటు చొప్పున సంక్రమించి చట్టంగా చట్రంలో బిగిసిపోయిన విషయమే గాని పెద్ద సత్యాసత్యాలను నిరూపణ

చేసే విషయం కాదు. ఇలాంటి విషయాల్లో సదుపాయం, సద్వినియోగం అనేవే సత్యాలు. మిగిలినవన్నీ సభవారు బిల్లగుద్దుకోవడానికి పనికివస్తాయి. ఇలాంటి విషయాల్లో ఘర్షణ పడటాలు సంకుచితత్వాన్ని తెలియచేస్తాయి. కొన్ని కుటుంబాల్లో పొలాలు, ఇళ్ళ అద్దెలు, భార్యలే చూసుకుంటూ ఉంటారు. భర్త హాయిగా భోంచేసి విలాసంగా తిరిగి వస్తూ వుంటాడు. ఇక ఆస్తి ఎవరిపేర వుంటేనేమి ? భర్తపేర వున్నదని ఏడ్చే భార్యలు, స్త్రీలకు హక్కులు లేవని పత్రికలలో చెరుక్కునే రచయితలూ పొందలేనిసుఖాన్ని పైన చెప్పిన భార్యాభర్తలు పొందుతూనే వున్నారు. ఆస్తిలేని వాళ్ళలో కూడా జీతాన్నితెచ్చి భార్యకిచ్చి ఆ తిప్పలేవో ఆమెనే పడమనే భర్తలు,ఆ భర్తలకి ఏ లోపం రాకుండా లాలనచేసే భార్యలు కూడా ఉన్నారు గదా ! ఇంతకీ సుఖపడటం తెలిసినవాళ్ళ గడుసువాళ్ళు.హక్కులు,చట్టాలు,న్యాయస్థానాలు పట్టుకుని వ్రేలాడే వాళ్ళ, ముందుకు పోతున్నామనుకునిఆవేశపడే రచయితలు,సుఖపడలేని శక్తిజీవుల్లాంటివాళ్ళు, జీవితానికిసార్థక్యంసుఖంలో ఉంది అని మరచిపోనంతవరకు ఏది సదుపాయమో దాన్ని అవలంబించటానికి గాని మార్పులు చేసుకోవడానికి గాని కావలసిన గడుసుతనం ఉంటుంది. లేనివాళ్ళకి ఎప్పుడూ ఉండదు. సుఖం కావాలో, హక్కులు కావాలో ఎన్నుకోవడంతోనే వాళ్ళ వాళ్ళ తెలివి, అతి తెలివి బయటపడుతుంది. చూస్తూ చూస్తూ సుఖపడలేని వాళ్ళ సిద్ధాంతా లల్లుకుంటారు. పూర్వం సమాజం ఇలావుంది. మన తాతలు ఇలా చేశారు అని రోషపడుతూనే చచ్చిపోతారు.

వ్యక్తి : భార్యాభర్తలు ఆది దంపతుల్లా ఒక్కటిగా ఉండగలిగినప్పుడు ఆస్తిహక్కు ఎవరిపేరనున్నా ఏమీ బెంగలేదు. అలా కాకుండా దాంపత్యంలో పొత్తు లేనపుడు ఎవరి పేర ఎంత ఆస్తి వున్నా ఒరిగే సుఖమూ లేదు. అంతే గదా మాస్టారూ ! సుఖం ఆత్మీయతలో ఉన్నదిగాని ఆస్తిలో లేదుగదా !

మాస్టరుగారు:చెప్పానుగదా! సుఖపడటం తెలియనివాళ్ళే హక్కులని రోషపడుతూ ఉంటారని.

## కట్నాల కంతమెప్పుడు ?

వ్యక్తి : మాస్టరుగారూ ! ఈ కట్నాల దొకటి పెద్ద సమస్యగా తయారయింది. దీనితో జనం ఏ స్థితికి వచ్చారంటే ఆడపిల్ల పుట్టిందంటేనే బెంగపడే స్థితికి వచ్చారు. పుట్టినప్పటినుండి పెళ్ళి అయ్యేదాకా బరువు మోస్తున్నట్లు ఫీలయ్యే తల్లిదండ్రులు పెరుగుతున్నారు. అన్నిధరలూ పెరిగి నట్లే పెళ్ళికొడుకుల ధరలు కూడా అమితంగా పెరిగిపోతున్నాయి. మరి ఈ కట్నాల సమస్య పరిష్కారం అయ్యేదెలా ?

మాస్టరుగారు : కొన్ని శతాబ్దాలలో వరశుల్కమూ. కొన్ని శతాబ్దాలలో కన్యాశుల్కమూ వుండటమనేది మానవుని పశుత్వానికి చిహ్నం. దానివల్లనే వివాహాలు నరకప్రాయాలుగా పరిణమించటం జరుగుతోంది. ఈ లోపం సంఘాన్ని తిట్టినందువల్ల తీరదు. కట్నం పుచ్చుకోకుండా ఉండడం వల్ల తీరుతుంది. జంతువులను చూసి అయినా మానవుడు సంసారసౌఖ్యం నేర్చుకోవలసిన స్థితిలో సమాజం వున్నప్పుడు, లోపాలు ఎత్తిచూపి తిట్టుకుంటే జంతువులలో లేని పశుత్వం మరింత మానవులకి అబ్బుతుంది. ఇది ప్రత్యేక వ్యక్తుల ప్రవర్తనకు సంబంధించినది కనుక తీరేమార్గంలేదు. అది జాతి అదృష్టంమీద ఆధారపడివుంటుంది. నోరు చేసుకున్నా, చట్టాలను లంగోటీలులాగ బంధించినా జరిగేదేమీ లేదు.

వ్యక్తి : మనుషుల్లో మార్పురానపుడు చట్టాలు మాత్రం ఏం చేయగలవు మాస్టారూ ! అవి చేసినవాళ్ళూ, తెలిసినవాళ్లూ ఆచరించని దుస్థితిలో ఉన్నప్పుడు అవి తెల్లముఖాలు వేసుకుని దీనంగా చూస్తున్నాయి.

మీరు అంటూ ఉంటారే అలాగ తరం మారితే ఈ విషయంలో కూడ మన అదృష్టం బాగుండి మార్పు రాగలదేమో వేచి చూడాలి!

మాస్టరుగారు : మనిషి విలువ, సహ జీవనం విలువ తెలిసి చేవతో బ్రతకగలిగిన తరం పుట్టుకొస్తేనే ఇలాంటి సమస్యలు పరిష్కారమయ్యే అవకాశం వుంటుంది.

## కాంతలు సంసారబంధ కారణాలా ?

వ్యక్తి : మాస్టరుగారూ। ఒక ఘాటైన నిజాన్ని అడుగుతాను. మీరు దానికి ఎప్పటిలాగే సూటిగా సమాధానం చెప్పాలి.

మాస్టరుగారు : మన సంగతి తెలుసుగదా ! మొహమాట పడ నక్కరలేదు.

వ్యక్తి : మనవాళ్ళు కాంతా కనకాలు బంధ కారణాలంటారు. మోక్షం కోరేవాళ్ల ఆ రెంటికీ దూరంగా వుండాలంటారు. అంతేకాక చని పోయేటప్పుడు భార్య వాకిట్లోనే నిలిచిపోతుంది. పుత్రుడు నిప్పంటించివెళ్ళి పోతున్నాడు అని చెపుతూ వుంటారు. మరి భార్యలుపోయినపుడు పురుషులు నిలిచిపోక వెంట వెడుతున్నారా ? నిజాన్ని పరిశీలించినపుడు భర్తపైన ప్రేమతో భర్తలేని జీవితం తమ కక్కరలేదని చితుల్లో దూకిన స్త్రీలే ఎక్కువమంది వున్నారు. అలాంటి పురుషులు వేళ్ళమీద తప్ప మనకి కన పడరు. మోక్ష జీవితానికి ఆలుబిడ్డలు అడ్డమంటారు. మరి అలాంటప్పుడు స్త్రీ మోక్ష జీవితానికి భర్త, బిడ్డలు అడ్డంకారా ? పైగా ఈ మాటలన్నీ పెద్దవాళ్ళు వ్రాసిన పుస్తకాల్లో కూడా కనపడుతున్నాయి. అంతమాత్రాన వీటిని ప్రమాణంగా స్వీకరించగలమా ? సిసలైన మార్గం ఏమిటి ? ఏ ఒక్కరివైపుకో మొగ్గేది ధర్మమెలా అవుతుంది ? దీని అసలు స్వరూపం మీరు వివరంగా చెప్పాలి.

మాస్టరుగారు : కాంతలు సంసారబంధ కారణాలనీ, మోక్షానికి అడ్డు తగులుతున్నారనీ వ్రాసిన వ్రాతలు మన పెద్దవాళ్ళ పుస్తకాల్లో కూడా చాలా ఉన్నాయి. ఈ లక్షణం మనజాతి రక్తంలో ఉన్న నీచ లక్షణాల్లో ఒకటి. దాన్ని మనం ప్రయత్నించి పోగొట్టుకోవాలి గాని సిగ్గుపడ కూడదు. కప్పి పుచ్చుకోనూ కూడదు. నిజస్వరూపం ఏమిటంటే స్త్రీలు పురుషులను గూర్చి, పురుషులు స్త్రీలను గూర్చి కామ విషయంలో చిక్కుకో కూడదు. సుఖాలను యాదృచ్ఛికాలుగా అనుభవిస్తూ, లేనప్పుడు పట్టించుకోకుండా సంతోషంగా జీవించడం నేర్చుకోవాలి. అది లేకపోతే కాంతలు పురుషుల కెలాగో, పురుషులు కాంతలకీ అలాగే బంధకారణాలు అవుతారు. వైరాగ్యం పుండు పుట్టి నట్లు పుట్టుకొస్తే పురుషుడు భార్యను, పిల్లలను వదిలి సన్యసించడం ధర్మం అనుకున్నప్పుడు, భార్యకూడా భర్తనీ, పిల్లలనీ వదలడం ధర్మమే అవుతుంది. మోక్షానికి పరిత్యాగ బుద్ధి ఇదే గనక అయితే అది ఎవరికైనా ఒక్కటే.

అయితే మన ప్రాచీన సంప్రదాయాల్లో ఇలాంటి అన్యాయమే అన్నిసందర్భాల్లోనూ జరిగింది అనడానికి వీల్లేదు. స్త్రీలు కూడా ఇలాంటి స్వాతంత్ర్యాన్ని అనుభవించా రనడానికి శ్రీ విద్యా సంప్రదాయమే నిదర్శనం. కాళీతంత్రం మొదలైన సంప్రదాయాల్లో స్త్రీకి కామ మవసరం ఉన్నదో లేదో తెలుసుకుని పురుషుడు అణుకువతో, పూజ్యభావంతో ప్రవర్తించాలని ఉన్నది. ఆ సంప్రదాయంలో భార్యకి వైరాగ్యం కలిగితే భర్త వెంటనే ఆజన్మాంతం బూడిద పూసుకోక తప్పదు. ఇలా రెండు పక్కల ఎగదీసి దిగలాగిన పద్ధతులు మన సమాజంలో ఉన్నాయి. అలా కాక ఉభయ పక్షాలకు సమదృష్టి కలిగి ప్రవర్తించిన సంసారజీవుల సమాజాలు ఋషులలో ఉన్నాయి. ఉదాహరణకు వరాహమిహిరాచార్యుడు స్త్రీ-పురుషుల సమాజ జీవితాన్ని గురించి ఏం చెప్పాడో వినండి.

1) ఏ పురుషులు వైరాగ్యమని వంకపెట్టి స్త్రీల గుణములు విడిచి దోషములను ప్రసక్తి చేయుచున్నారో వారు దుష్టులని నా నిర్ణయం. వారికి సద్భావము, సత్ప్రవర్తన లేదని ఇందు మూలంగా చాటుకొంటున్నారు. వారు నమ్మని వ్రాతలను వ్రాస్తున్నారు.

2) స్త్రీలు ఆచరించారని చెపుతున్న దోషాలు పురుషు లాచరించటం లేదా? ఈ పురుషుల సహకారం లేనిదే స్త్రీలు దోషాలాచరించడం ఎలా సాధ్యం? పురుషులు స్త్రీలను తిరస్కరించే రచనలు చేయడం దబాయింపు. ప్రకృతి సహజంగా పరిశీలిస్తే పురుషుల కంటే స్త్రీలే గుణవతులు.మనువే దీనికి ప్రమాణం. (శీలం చెడటానికి పురుషుడికి ఉన్నంత చొరవ స్త్రీకి ఉండటానికి అవకాశంలేదని దీని అర్థం. కారణ మేమంటే కాలు జారితే స్త్రీకి గర్భం కలుగుతుందనే భయం ఉంది. పురుషుడికి అలాంటి కట్టుబాటు ప్రకృతిలో లేదుగనక తప్పించుకొనడానికి అవకాశం ఉంది. దీన్నే వరాహ మిహిరుని స్నేహితుడైన కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలంలో మరో రకంగా తిప్పి చెప్పాడు. గాంధర్వ రాక్షస వివాహాలు పనికి వస్తాయని చట్టం ఒప్పు కున్నా, మోసం ఒప్పుకోదని కాళిదాసు నిరూపించాడు. చట్టాన్ని బట్టి అలాంటి పెళ్ళిళ్ళు చేసుకున్న శకుంతలలాంటి వాళ్ళని మొగాడు మోసం చేస్తేఎలాంటి పాట్లు వస్తాయో చూడమని చిత్రించాడు. ప్రభుత్వం త్రాగుడు అంగీకరించినంత మాత్రాన కల్లు, సారాయి జబ్బు చేయవనుకోవడం ఎలాంటిదో ఇదీ అలాంటిదే.)

3) బ్రాహ్మణులు పూజ్య ప్రవర్తనలవలన పాదములందు మహిమ కలవారు, గోవులు తమ వెనుక బొదుగునందు మహిమ కలవి. గొర్రెలు, గుర్రాలు తలపైపున సారవంతములు. స్త్రీలు తమ సమస్తము చేతను సార వంతములు. (అనగా సత్ప్రవర్తన చేత, మాతృత్వం చేత, ఇళ్ళు తీర్చి

కొనడం చేత, సౌందర్యంతో సంతోషం కలిగించటం చేత సారవంతు లని అర్థం. ఈ లక్షణాలు పురుషులకు లేవు గదా!)

4) వ్యభిచారదోషం స్త్రీ పురుష లిద్దరూ సహకరించనిదే జరుగదు. అప్పుడు కూడా నెల నెలకు స్త్రీ శరీరం రజోదర్శనంతో క్షాళనం అవుతూ వుంటుంది. పురుషుడికి అలాంటి పవిత్రత లేదు.

5) స్త్రీలకు అమర్యాద చేసిన ఇండ్లలో స్త్రీల తిరస్కారం ఉంటుంది. ఆ ఇళ్ళు చేతబడి ప్రయోగం చేయబడ్డట్టు క్రమంగా నశిస్తాయి.

6) ఆడది భార్యయైనా తల్లియైనా ఇవ్వవలసిన మర్యాద ఒక్కటే. స్త్రీలు లేనిదే ఈ నిందించేవారు పుట్టడం ఎలా సంభవం? కనుక స్త్రీని తిరస్కరించడం కన్న, నిందాభావంతో చూడటం కన్న పురుషుడికి కృతఘ్నత ఇంకొకటి ఉండదు. అలా నిందించేవాడికి సుఖం ఎక్కడనుండి వస్తుంది?

7) ధర్మశాస్త్రం ప్రకారం స్త్రీ వ్యభిచరించినా పురుషుడు వ్యభిచరించినా దోషం ఒక్కటే. కాని పురుషుడు తాను చేసే పాపాలను లెక్క చెయ్యక స్త్రీని మాత్రం నిందిస్తాడు. దీనిని బట్టి కూడా పురుషుడికన్న స్త్రీ మంచిదని స్థిరపడుతోంది.

8) పురుషుడు వ్యభిచారదోషం చేస్తే స్త్రీ చేత కూడ చేయించినవాడు అవుతున్నాడు. కనక వాడు ఆ దోషంనుండి పరిశుద్ధి చెందాలంటే ఆరు మాసాలు రోమాలున్న గాడిద చర్మం కప్పుకొని భిక్షాటనం చేసి భుజించాలి.

9) పురుషుడికి అసమర్థత వస్తేనేగాని కామతృష్ణ శాంతించదు. అసమర్థతే లేకపోతే నూరు సంవత్సరాలకైనా వాడి మదం తగ్గదు. స్త్రీ మాత్రం తన ధైర్యంచేత, మాన మర్యాదలచేత దమించుకో గలదు.

10) సహజంగా స్త్రీ పురుషుల విషయంలో ఇంత భేదం ఉన్నప్పుడు ఇక శీల సంపదగల స్త్రీలని నిందించే తుచ్ఛుల దుర్జనత్వాన్ని ఏమనాలి? దొంగతనం చేసి పారిపోతూ 'దొంగ దొంగ పట్టుకో పట్టుకో' అంటూ పరిగెత్తే దొంగల్లాంటి వాళ్ళు వీళ్ళు.

11) పురుషులు ఏకాంతంలో స్త్రీలని చేసిన బుజ్జగింపులు, ప్రేమ వాక్యాలు తరువాత మర్చిపోతారు. స్త్రీలు కృతజ్ఞులై మరచిపోరు. ఆ భర్త చనిపోయినా అవే తలచుకుంటూ భర్తతో నిప్పులలో కూడ దూకగలరు.

12) పరిపాలకులు రత్నాలు మొదలైన ఇతర సంపదలతో పాటు స్త్రీలనుకూడా ఒకటిగా చూస్తారు. అంటే అర్థం ఏమిటి? ఆ పరిపాలకులకి తిండి, ఆడది ఒక్కటే. భర్త ప్రభువైనా, ముష్టివాడైనా ఆడదానికి భోగాపేక్ష ఒక్కటే. భర్త దరిద్రుడైనా, రాజైనా భార్యకు ప్రేమ ఒక్కటే.

ఇవి వరాహ మిహిరుడు చెప్పిన స్త్రీని గూర్చిన ముఖ్యాంశాలలో కొన్ని.* కనుక స్త్రీ విలువ తెలియనివాళ్లు అన్ని శతాబ్దాల్లోనూ ఎలా ఉంటున్నారో. తెలిసినవాళ్ళు, కూడా అన్ని శతాబ్దాలల్లోనూ ఉంటూనే ఉన్నారు.

వ్యక్తి : చాలా నిశితంగా వివరించారు మీరు. ముఖ్యంగా వరాహ మిహిరుడు స్త్రీని గూర్చి ఇంత విలువైన సత్యాలను చెప్పాడని ఇప్పుడేనాకు తెలిసింది. ఇంకా మహనీయుల గ్రంథాలను తిరగేస్తే ఎందరెందరు ఇలాంటి మహనీయులు దొరుకుతారో చెప్పలేం. మొత్తంమీద స్త్రీ యొక్క పరిపూర్ణ స్వరూపాన్ని వివరించి చెప్పిన మీకు హృదయపూర్వక ధన్యవాదాలు.

---

*బృహత్సంహిత 74వ అధ్యాయం 5,6,8,9,10,11,12, 13, 14, 15, 16, 17 శ్లోకాలు.

1. యేఽప్యంగనానాం ప్రవదంతి దోషాన్
వై రాగ్యమార్గేణ గుణాన్ విహాయ ।
తే దుర్జనా మే మనసో వితర్కాః
సద్భావ వాక్యాని నతాని తేషామ్॥ 5.

2. ప్రబ్రూత సత్యం కతరోఽంగనానాం
దోషోస్తి యో నాచరితో మనుష్యైః।
ధార్ష్ట్యేన పుంభిః ప్రమదానిరస్తా
గుణాధికాస్తా మనునాత్ర చోక్తమ్॥ 6.

3. బ్రాహ్మణాః పాదతో మేధ్యా
గావో మేధ్యాశ్చ పృష్ఠతః।
అజా శ్వా ముఖతో మేధ్యాః
స్త్రియో మేధ్యాస్తు సర్వతః॥ 8.

4. స్త్రియః పవిత్ర మతులం
నైతా దుష్యంతి కర్హిచిత్।
మాసి మాసి రజో హ్యాసాం
దుష్కృతా న్యపకర్షతి॥ 9.

5. జామయో యాని గేహాని
శపన్త్యప్రితి పూజితాః।

తాని కృత్యా హతానీవ
వినశ్యన్తి సమంతతః॥ 10.

6. జాయావా స్యాజ్జనిత్రీవా
సంభవః స్వీకృతో నృణామ్।
హే కృతఘ్నాస్తయో ర్నిందాం
కుర్వతాం వః కుతః శుభమ్॥ 11.

7. దంపత్యో ర్వ్యుత్క్రమే దోషః
సమః శాస్త్రే ప్రతిష్ఠితః।
నరా న తమవేక్షంతే
తే నాత్ర వరమంగనాః॥ 12.

8. బహిర్లోమ్నాతు షణ్మాసాన్
వేష్టితః ఖర చర్మణా।
దారాతి క్రమణే భిక్షాం
దేహిత్యుక్త్వా విశుధ్యతి॥ 13.

9. న శతేవాపి వర్షాణా మపైతి మదనాశయః।
తత్రాశక్త్యానివర్తంతే నరా ధైర్యేణ యోషితః 14.

10. అహోధార్ష్ట్య మసాధూనాం
నిందతా మనఘా స్త్రియః।
ముష్ణతామివ చౌరాణాం
తిష్ఠ చౌరేతి జల్పతామ్॥ 15.

11. పురుషశ్చటులాని కామినీనాం
కురుతే యాని రహోనతాని పశ్చాత్।
సుకృతజ్ఞతయాంగనా గతాసూనవ గుహ్య
ప్రవిశంతి సప్తజిహ్వామ్॥ 16.

12. స్త్రీరత్న భోగోఽస్తి నరస్య యస్య
నిస్స్వోఽపి సంపత్త్యవనీశ్వరోఽసౌ।
రాజ్యస్య సారోఽశన మంగనాశ్చ
తృష్ణానలోద్దీపన దారుశేషమ్॥ 17.



# నమ్మకాలు - నిజా నిజాలు

## A. పిశాచాలు - పూర్వాపరాలు

**చనిపోయినవాళ్ళు పిశాచాలవుతారా ?**

వ్యక్తి : చనిపోయిన వ్యక్తులు పిశాచాలవుతారని, కోరికలున్న వాళ్ళు అలా అయి తిరుగుతూ ఉంటారనీ అంటారు. మాస్టారూ! ఇది ఎంతవరకు నిజమంటారు?

మాస్టరుగారు : చనిపోవడం అనేది జీవపరిణామంలో ఒక భాగం. పరిణామం ప్రకృతిచేసే యజ్ఞార్థమైన సత్కర్మలో ఒక భాగం. ప్రకృతి ఎప్పుడూ ఉత్తమగతి కలిగిస్తుంది గాని అధోగతికి కారణం కాదు. జీవసృష్టి జలచరాదుల నుండి బయలుదేరి సకల జీవరాసుల స్థితులనుండి దాటించి మానవస్థితికి జీవుణ్ణి ఉద్ధరిస్తున్నది. అలాంటి జీవపరిణామంలో ఒక భాగమైన మృత్యువు ఉత్తమగతిని కలిగిస్తుంది గాని పిశాచపు స్థితులను కలిగించదు. కనుకనే శరీరం వదలినవారిని ఉత్తమ గతులకు పోయారని, పరలోకానికి పోయారని, పరమపదించారని అనటం వాడుకలోకి వచ్చింది. నూటికి యాభై మందికి పైగా నరులు చనిపోయిన తరువాత స్థూల సూక్ష్మ కోశాల క్షాళనం పొంది, అక్కడికక్కడే కర్మల ఫల స్మృతి రూపాలైన స్వర్గ నరకాలు అనుభవించి, అంతకన్న ఉత్తమ జన్మ పొందుతారు. భువ

బంధాలు లేనివారు ముక్తులై స్వేచ్ఛామయ మూర్తులవుతారు. ఇక కొద్దిమంది తీవ్రద్రోహాలు చేసినవాళ్ళు మాత్రం పిశాచత్వాన్ని పొందుతారు. బ్రతికి ఉండగా కోపాలు, పగ, దుఃఖాలు, దిగుళ్ళు, అవమానాలు, ఆశలు,ఎక్కువ కాలం పనిచేయక ఎప్పటికప్పుడే పట్టించుకోకుండా వ్యవహరిస్తూఉపయోగ కరమైన పనులుచేస్తూ వెళ్ళేవాళ్ళుమాత్రం ఎవరూ పిశాచత్వాన్ని పొందరు. తీవ్రమైన పగ, కృశించేటంత దిగులు, నిద్రపట్టనీయని ఈర్ష్యాదులు కల వాళ్ళు భౌతికదేహం విడిచిపెట్టి కూడా పట్టుదలలతో ముడివేయబడిన లింగ శరీరంతో కొంతకాలం వ్యవహరించవచ్చు. వారు పిశాచాలుగా వ్యవహ రిస్తారు. ఇంకా భార్యాబిడ్డలపై తీరని వ్యామోహంకలవాడు, డబ్బు, నగలు మొదలైనవి ఎవరితో చెప్పకుండా దాచిపెట్టినవాడు. ఆకస్మిక దుర్మరణము చెందినపుడు అనగా హత్య, రైళ్ళు ఢీకొనడం మొదలైన సందర్భాల్లో చనిపోయినపుడు తప్పకుండా పిశాచాలవుతారు. వారి వ్యామోహానికి కారణ మైన ప్రదేశంలో చాలాకాలం తిరుగుతూ ఉంటారు. రహస్యాలు వ్యక్తం చేయటానికి మనస్సు, నోరు, నాలుక, కావాలి కనుక ఎవరినో పట్టి వారి ద్వారా వాగుతూ ఉంటారు. మిగిలిన సామాన్య మరణాల విషయంలో పిశా చత్వం చాలా అరుదుగా సంభవిస్తుంది.

## గిట్టనివాళ్ళని పీడిస్తారా?

వ్యక్తి : పిశాచాలైన వాళ్ళు తమకు గిట్టని వాళ్ళను పీడించడమనేది జరుగుతూ ఉంటుందా?

మాస్టరుగారు : కొన్ని సందర్భాల్లో తప్పకుండా సాధ్యమవుతుంది. వాళ్ళు బ్రతికి ఉన్నప్పుడు ఎవరైనా తీరని హాని చేసినా, హత్య చేసినా, లేకపోతే వాళ్ళల్లో కక్షకక్కుర్తి ఏమాత్రం ఉన్నా వారిచేత పీడితులవుతారు.

చనిపోయినవాడు ఒక మంచివాడిమీద శత్రుత్వం పెంచుకొని చనిపోతే మాత్రం ఆ మంచి వాడిమీద వాడికేమీ పట్టుచిక్కదు. కక్కుర్తి ఉన్న సందర్భాల్లో శత్రువునే కాక వాడితో ఉన్నవాళ్ళని కూడా ఏడిపించడం సాధ్యమవుతుంది.

వ్యక్తి : ఆత్మహత్య చేసుకొన్నవాళ్లు వాళ్ళ జీవితకాలం అయిపోయేటంతవరకు దెయ్యమై తిరుగుతారంటారు. నిజంగా అలా జరుగుతుందా మాస్టారూ!

మాస్టరుగారు : ఆత్మహత్య చేసుకున్నవాడు జీవితకాలం కన్న చాల ఎక్కువకాలం పిశాచమై తిరగడానికి వీలుంది. భౌతికానికన్న పై లోకాల్లో ఆత్మహత్య పరహత్య అని ఉండవు. హత్యానేరం ఒక్కటే వుంటుంది. సామాన్యంగా తాను తెచ్చుకున్న చిక్కుల్లోంచి బయటికి రాలేనివాళ్ళే ఎక్కువమంది ఆత్మహత్య చేసుకుంటారు. తన ఆశ్రితులకు కూడా అన్యాయం చేసిన నేరం వుంది కనుక ఆ మొత్తం జీవుణ్ణి పట్టుకొని వేధిస్తుంది. భయ-దుఃఖాదులు మనస్సు ద్వారా వ్యక్తమౌతాయి గాని, మనస్సు కన్న పైన అంటి వుంటాయి. కనుక మనస్సు లేకుండా పోయాక కూడా ఏడిపిస్తాయి. మనస్సులేని చెట్లకి, గర్భకోశంలో వున్న పిండానికి దెబ్బ తగిలితే ఎలాంటి బాధ వుంటుందో అలాంటి బాధ మనస్సు పోయాక కూడా హత్య చేసిన జీవుణ్ణి వేధిస్తుంది.

## మనం చూడగలమా ?

వ్యక్తి : దెయ్యాల్ని మనం చూడటానికి సాధ్యమవుతుందా మాస్టారూ ?

మాస్టరుగారు : దెయ్యాలు కొందరికి కనిపిస్తాయి. కొందరికి కనిపించవు. ఇంద్రియాలద్వారా తెలివి తేటల ద్వారా మాత్రమే పరిసరాలని అర్థం చేసికొనటం అలవాటైన జన్మలు కలవాళ్ళకి కనిపించవు. అలాకాక

కొందరు పరిసరాల్ని సూటిగా అర్థం చేసుకొనే వాళ్ళుంటారు. వారికి ఇంద్రియాల ప్రమేయం లేకుండానే, తెలివితేటల ప్రమేయం లేకుండానే బోధపడుతూ వుంటాయి. "వాళ్ళ నే నిలా ఫీలవుతున్నాను. నా కిలా అనిపిస్తోంది" అనే పదాలలో అంతరాంతరాలైన సత్యాలను వెలిబుచ్చ గలుగుతారు వాళ్ళకి కొందరి ప్రక్కన కూర్చుంటే సంతోషంగా వుండటం. నీరసం తగ్గడం. ఆరోగ్యం బాగుపడటం జరుగుతుంది. అలాంటివాళ్ళకి దెయ్యాలు ఉన్నట్లు తెలియటం, అనిపించడం రూపంతో కనిపించడం, మాట్లాడడం కూడా జరుగుతుంది. వాళ్ళని మీడియమ్స్ అంటారు. అలాంటివారు వాతావరణం, అభ్యాసాలు అపరిశుభ్రంగా వుంచుకుంటే దెయ్యాలుకనిపిస్తాయి. పరిశుభ్రంగా ఉంచుకొంటే గురువులు సిద్ధులు మొదలైనవారు కనిపిస్తారు. ఆ కనిపించడం వినిపించటం కన్నులకీ, చెవులకీ కాక మనస్సుకి అయివుంటుంది. కనిపించని వాళ్ళ కనిపించే వాళ్ళని ఊహాజీవులనడం సత్యంకాదు. ఈ ఊహా జీవులు ఆ దెయ్యాలతో సంప్రదించిన వెనుక వారిని గూర్చిన విషయాలు ఎవ్వరూ ఎరుగనివి వివరంగా చెప్పగలగడమే దీనికి తార్కాణం.

## కొరివి దెయ్యా లున్నాయా ?

వ్యక్తి : కొరివి దెయ్యాలు అంటారే అవి నిజంగా ఉంటాయా?

మాస్టరుగారు : ఉంటాయికాని అవి దెయ్యాలు కావు. కొన్ని రసాయనిక పదార్థాలు ఏర్పడిన భూములనుండి కొన్నిరకాల వాయువులు బయటకువచ్చి ప్రాణవాయువుతో సంయోగము చెందినపుడు రవ్వలు, వెలుతురు వస్తాయి. మిణుగురు పురుగులు ఎలా నిప్పురవ్వలు కావో కొరివి దెయ్యాలు అలాగే దెయ్యాలు కావు.

## వదిలించడానికి తతంగం అవసరమా ?

వ్యక్తి : దెయ్యం పట్టినవాళ్ళకు వదిలించడానికి భూతవైద్యులు చాలా తతంగం చేస్తారుగదా ! నిజాని కదంతా అవసరమా ?

మాస్టరుగారు: తతంగాలు అన్నిరంగాల్లో ఉన్నట్లే భూతవైద్యంలో కూడ వున్నాయి. వైద్యుడు చేసే వైద్యంలో పొట్టకూటికి వేసే దుస్తులు మొదలైన ఆడంబరా లుంటాయి. అదంతా వైద్యశాస్త్ర మనలేం గదా! ప్లీడరు ఇచ్చే తర్ఫీదు అంతా న్యాయశాస్త్రం అనలేం కదా! అలాగే భూత వైద్యంలో ఉన్న తతంగం భూతవైద్యం అనలేం. ముఖ్యంగా దెయ్యం పట్టిన వాళ్ళని హింసపెట్టడం, చెప్పుతో, చీపురుతో కొట్టడం మొదలైన పశుప్రాయాలైన విధానాలు విషవైద్యాల వంటివి. నిషమైన భూతవైద్యంలో నిర్మలమైన, ప్రశాంతమైన వాతావరణాన్ని కల్పించడం, చక్కని సంగీతం, దైవస్మరణ మాత్రమే వుంటాయి. ముఖ్యంగా దెయ్యం పట్టిన వారిని వారిలో వున్న దెయ్యాన్ని, దైవంగానో, తన గురువుగానో ధ్యానం చేయడం తిరుగు లేని మార్గం. కొన్ని ద్రవ్యాలు అప్రయత్నంగా, సునాయాసంగా, దయ్యాలను పోగొడతాయి. ఉదాహరణకు తులసిదళం తినిపించడం, రావిచెట్టుక్రింద కూర్చోబెట్టటం, మంచిగంధం, కర్పూరం ధూపం వేయడం, తెల్లజిల్లేడు వేరు దేహానికి తాకేటట్లు కట్టడం వల్ల మోటు ప్రయత్నాలు ఏమీ అక్కర లేకుండా భూతావేశం తగ్గిపోతుంది.

## భూతాలను వశపర్చుకోవచ్చా ?

వ్యక్తి : భూతాలని కొందరు భూత వైద్యుల్లాంటి వాళ్ళు వశంలో వుంచుకొని గిట్టనివాళ్ళ మీదకు ప్రయోగిస్తారు అంటారు. అది సాధ్యమా మాస్టారూ ?

మాస్టరుగారు: భూతాలను తమ వశంలో ఉంచుకొని కొందరిమీదకు ప్రయోగం చేయడం పూర్తిగా సాధ్యమే. కాని పుట్టుకచేత ఈర్ష్య, అసూయ మొదలైన లక్షణాలు లేనివాళ్లు కొందరు వుంటారు. వాళ్ళు సాధారణంగా చదువు మొదలైన వాటిల్లో చాలా ప్రావీణ్యం గడించినా ఇతరులతో వ్యవహరించడంలో తెలివితక్కువగా, అమాయకంగా,కొంచెం పిచ్చివాళ్ళులాగా వుంటారు. ఎవరైనా హేళన చేసినా, నిందించినా వాళ్ళ బుర్రకి ఎక్కవు. అవమానపడడమంటే యేమిటో వారికితెలియదు. అలాంటి వాళ్ళమీద మాత్రం ఇవి పనిచేయవు. లేదా ప్రకృతిశక్తుల రహస్యాలు సరియైన గురువువద్ద తెలుసుకొని వైరాగ్యంతో జీవితాన్ని నడిపేవాళ్ళమీద కూడ పనిచేయవు. ఇక దయ్యాలచేత వస్తువులను కదలించడం, పనులు చేయించడం విశేషంగా సాధ్యపడదు. బ్రతికి వున్నప్పుడు వాళ్ళచేత చేయించే చిల్లరపనులు కొన్ని సాధ్యపడతాయి. ఇదికాక కొందరు భూత తంత్రజ్ఞులు పెద్ద కొండరాళ్ళను క్రిందకు దింపించడం మొదలైన మంచి పనులుగాని, నదుల్లో పడవలు ముంచెయ్యడం మొదలైన చెడ్డపనులుగాని చేయిస్తూవుంటారు. అవి దయ్యాలవల్ల సాధ్యం కావు. ఒక్కొక్కచోట వ్యక్తులుగా మెలిగే ప్రకృతి శక్తులు వుంటాయి. వాటిని యక్షులుఅంటారు. ఉదాహరణకు చీకటిగా వున్న కొండల ఇరుకు లోయల్లో చిన్నకోనేరుచుట్టూ గుబురుచెట్లు, వాటిలో సర్పవృశ్చికాదులు ఒక గుంపుగావుంటాయి. అక్కడ విశేషంగా మనుష్య సంచారము లేకపోతే ఆ మొత్తం ప్రదేశంలో ఒకే జీవుడు ఉంటాడు. మిగిలిన చెట్లు, విషజంతువులు ఆ జీవుడి శరీరభాగాలుగా పని చేస్తుంటాయి. అందులో ఒక జంతువునుచంపితే నొప్పి మిగిలిన వాటన్నిటికీ తెలుస్తుంది. కొన్ని క్షణాల్లో అన్నీ పరుగెత్తుకువస్తాయి. అలాంటి జీవిని యక్షుడు (group soul) అంటారు.ఆ యక్షుణ్ణి శాస్త్రవిధానంలో వశపరచుకుంటే అనగా మైత్రి చేస్తే పడవలు ముంచడం చేయవచ్చు. కొంద

రాత్రిపూట అనుకున్న చోటికి రాళ్లు విసరడం, మనుషుల్ని ఈడ్చుకుపోవడం మొదలైన పనులు దుష్ట తాంత్రికులు చేస్తారు. పూర్వం ఋషులు ఈయక్షుల సహాయంతో జబ్బులు నయం చేయడం, వస్తువులు మోయించడం మొదలైన ఉపయోగకరమైన పనులు చేయించేవారు.

## గృహ మెలావుంటే దయ్యాలు రాలేవు ?

వ్యక్తి : గృహ వాతావరణాన్ని ఏ రీతిగా తీర్చిదిద్దుకుంటే దయ్యాల ప్రభావం పడకుండా ఉంటుంది? ఆ తీర్చిదిద్దుకొనే విధం మీరు వివరంగా చెప్పాలి ?

మాస్టరుగారు : తప్పకుండా చెబుతాను. భూత ప్రేతాదుల ప్రభావం ఒక ఇంట్లో వున్న వాళ్ళ మనస్సుల మీద ముఖ్యంగా ఆధారపడివుంటుంది. సామాన్యంగా వైద్యము. శుచి, ఆరోగ్య శాస్త్రము మొదలైన వాటిమీద ఆస్తిక్య బుద్ధి లేకపోవడం, భయ కారణాల మీద నమ్మకం పెంచుకోవడం ఉన్న యింట్లో దెయ్యాలు ప్రవేశించడానికి సుళువు వుంటుంది. ఉదాహరణకి వైద్యుడు తమ జీతగాడుగా అనుకోవడం. ఎవరో తనకు చేతబడి చేశారు అనుకోవడం, అందరూ తనను చూచి ఈర్ష్యపడుతున్నారు అనుకోవడం మొదలగు భావాలు వున్నచోట. సామాన్యంగా, అసమర్థమైన కోపంతో ఎప్పుడూ ఎవరో ఒకరిని ఆడిపోసుకోవడం ఉంటూ వుంటుంది. అలాంటి వాళ్ళ ఇళ్ళలోకి ఏ దయ్యమైనా, ఎప్పుడైనా ప్రవేశించ వచ్చు. వాళ్ళని ఆ మార్గము వదిలిపెట్టమని చెబితే వాళ్ళకు సాధ్యం కాదు. నచ్చదుకూడా. ఇంట్లో అందరూ పరస్పరత్వం లేకుండా సూది మొనలు తేలిన కంకరరాళ్ల పెట్టెల్లాగ వుంటారు. ప్రతి ఇద్దరి మధ్య మూడవవాడితో రహస్యంగాచెప్పు కొనేవి వుంటూ వుంటాయి. అలాంటి ఇళ్ళలో మనస్సులు పరిశుభ్రపడ డానికి అవకాశంవుండదు. కానీ ఏరోజు చెత్త ఆరోజు మనస్సులలోనుండి

ఎత్తిపారబోసుకొనటానికి వీలవుతుంది. దానికి ఒకటేమార్గము. రోజూ ఒకే టైమ్‌కి నేతిదీపం, అగరువత్తి పెట్టి ఒకేచోట ప్రేయరుగాని, పూజ గాని జరుపుకోవాలి. ఆ టైమ్‌కి అందరూ అక్కడ వుండాలి. దీనిని సాధ్యపరచు కొన్న ఇండ్లలోకి దెయ్యాలు రాలేవు. ఇంకా దొడ్లో తులసిచెట్టు, నిమ్మచెట్టు వేపచెట్టు, రావిచెట్టు, తెల్ల జిల్లేడుచెట్టు, కరివేపాకు. దమనం,మరువం, పారి జాతం, మామిడిచెట్టు వుండడంవల్ల దెయ్యాలు ఆకర్షింపబడటానికి వీలు లేకుండా పోతుంది. ఇంకా ప్రొద్దెక్కకుండా స్నానం చేయడం, ఏరోజు బట్టలు ఆరోజు మార్చుకోవడం, నెలసరులలో వేరుగా వుండటం. పురిటి వాళ్ళను వేరే గదిలో ఉంచడం, కాళ్ళు,చేతులు కడుక్కొని భోజనశాలలోకి పోవడం ఈ విషయంలో చాలా ఉపకరిస్తాయి. భారత భాగవతాదిగ్రంథాలు గాని, మహనీయుల సచ్చరిత్రలు గాని: నిత్యము కొంతసేపు చదివి వివరించుకొనడం ప్రబలంగా ఉపకరిస్తుంది.

## B. దేహం విడిచిన తరువాత

### చనిపోయేముందు తెలుస్తుందా ?

వ్యక్తి: మాస్టరుగారూ! చనిపోయేముందు తాము చనిపోతున్నామని ఆ చనిపోబోయే వారికి తెలుస్తుందా? ఒకవేళ తెలిస్తే అప్పటి అనుభూతి ఎలా వుంటుంది?

మాస్టరుగారు : చాలామందికి చావు అంటే ముఖ్యంగా సొంతచావు అంటే అంతో ఇంతో భయం వుంటుంది. వాళ్లకి మాత్రం చనిపోయే సమయంలో తెలిస్తే గుండె బేజారై పోతుంది. అలాంటి వాళ్ళకి ఇంకా కొంచెం ముందుతెలిస్తే ఆ భయంతోనే చిచ్చిపోవచ్చు. అలాంటివాళ్ళకు ఆ సమయంలో ప్రకృతి తెలియకుండా చేస్తుంది. అంటే మృత్యువుకు ముందు తెలివి తప్పుతుంది. భయం ఎంతతీవ్రంగావుంటే అన్నిగంటలో,రోజులో, నెలలో తెలివితప్పిన స్థితిలో వుండిపోతారు. ఆ స్థితిలో ప్రకృతి శక్తులు మత్తుయిచ్చి అట్టే పెట్టి ప్రాణానికి దేహానికిమధ్య బిగించివున్న మేకులన్నీ పీకుతారు. దేహధాతువుల్ని పంచభూతాలలోకి మలచి పార్శిల్ కట్టి వి. పి. చేస్తారు. తీరా పనంతా పూర్తి అయిన తరువాత మత్తువదలి తెలివివస్తుంది.

ఇక మృత్యుభీతి తొలగిపోయినవారు తప్పకుండా ఆరోగ్యవంతులు. జ్ఞానులు, ప్రసన్నులు, వైరాగ్య సంపన్నులు అనే కోవలలో దేనికో ఒక దానికి చెంది వుంటారు. అలాంటివాళ్ళకి కలగబోతున్న దేహ పరిత్యాగం స్పష్టంగా తెలుస్తుంది. వాళ్లకి చనిపోవడం వుండదు. దేహం విడవటం మాత్రం వుంటుంది. వెన్నెముక దిగువనుండి పైకి వీణ మీటుల్లాగ అనిపిస్తుంది. అలా ఎందు కనిపిస్తుందంటే చైతన్యం మూలాధారంనుండి ఊర్ధ్వగతి పడుతుంది. ఇంద్రియాలకు ఇంద్రియార్థాలు అందవు- ఏదో

ఆలోచిస్తూ ఉంటే కంటిఎదుట నున్న వస్తువులు కనిపించనట్లు. అటుపైన ప్రజ్ఞ, శ్వాస కలిసి ఒక్కటి అవుతాయి. ఆ ఒక్కటి నిలిచిపోతుంది. ఇంకొక కక్ష్యలో ప్రజ్ఞ మేల్కొంటుంది. ఇలా మహానుభావులకు జరుగుతుంది.

ఆలాకాక పీకులాటలు, పితలాటాలు ఉన్నవాళ్ళకి కళ్ళు, చెవులు అన్నీ పనిచేస్తూనే వుంటాయి. చుట్టూవున్నవాళ్ల చేసే గోలంతా తెలుస్తూనే వుంటుంది. కానీ ఏ భాగమూ తన ఆధీనంలో వుండదు. శ్వాస ఆడుతూ వున్నా మాట మొదలైనవి సాధ్యపడవు. ఏడవటానికి గాని, మాట్లాడటానికి గాని, తల ఊపటానికి గాని అవసరమైన కీళ్ళ మేకులన్నీ ఊడిపోయి వుంటాయి. ఉదాహరణకు వెనకడిప్ప ఊడదీసిన గడియారంలో ముళ్ళచక్రల్లాగ అన్నీ కొంతసేపు తిరుగుతూనే వున్నా ఏమీ స్వాధీనంలో వుండదు. బాకీలు వసూలు కాలేదని, భార్యాబిడ్డలు ఆదరించలేదని తీవ్రంగా తాపత్రయపడే వాళ్ళకి ఇలాంటి స్థితి కొన్ని రోజులుండవచ్చు.

వ్యక్తి: అయితే పీకులాటలు, పితలాటాలు వున్నవాళ్ళు నరకం అనుభవిస్తూనే దేహం వదులుతారన్నమాట.

మాస్టరుగారు: అందుకే అన్నారు మనవాళ్ళు-చేసుకున్న వాళ్ళకు చేసుకున్నంత అని.

## చనిపోయిన తరువాత ?

వ్యక్తి: ఒక వ్యక్తి చనిపోయిన తరువాత అతనేమౌతాడు? ఈ విషయాన్ని గూర్చి రకరకాలుగా చెప్పుకుంటూ వుంటారు. నిజానికి జరిగేదేమిటో అనుభవజ్ఞులైన మీరు చెప్పాలి.

మాస్టరుగారు: అలాగే! మీకు అర్థమయ్యేటట్లుగా వున్న నిజాన్ని చెబుతాను. చనిపోవడంలో పోవడం అనేది ఏమీ వుండదు. మనిషి అంటే

చోటుతో, మట్టితో, నీళ్ళతో, గాలితో, వెచ్చదనంతో చేయబడిన ఒకబొమ్మ. ఆ బొమ్మమధ్య వున్నచోటు మనిషిగా మేల్కొని పనిచేస్తూ వుంటుంది. శబ్దించేస్తూ ఇద్దరిమధ్యా వున్నచోటు ధ్వనితరంగాలుగా ఎలా మేల్కొంటుందో అలాగే శ్వాసచేసే గుండెకాయలో వున్నచోటు ఆల్టర్ నేషన్ ఆఫ్ కరంట్స్ (Alternation of Currents) గా మేల్కొని ఎలక్ట్రో మేగ్నెట్ (Electro Magnet) లాగా జీవ తరంగాలను పంపుతుంది. పంపడం మొదలుపెట్టేవరకు ఆకాశంలో వున్న శక్తి స్టార్టర్ (Starter) గా పనిచేస్తుంది. పంపడం మొదలుపెట్టాక గుండెకాయలో ఆకాశాన్ని మేల్కొలిపే శక్తి వేరవుతుంది. అప్పటినుండి దాని ఆధీనంలో శరీరం పనిచేస్తూ వుంటుంది. అలా వేరైన మెలుకొలుపునే జీవుడు అంటాము. ఒకసారి వేరైన తరువాత మళ్ళా అది చోటుగా మారడం చాలా కష్టం. అలవాటు చొప్పున స్థూల సూక్ష్మ దేహాలుగా పనిచేస్తూ వుంటుంది. స్థూల దేహం విడిపోయాకకూడా కొన్నివేల సూక్ష్మదేహాలు పనిచేస్తూనేఉంటాయి. పాముకి గాని, కోడికి గాని మెడనరికాక కొంతకాలం దేహభాగాలు కదుల్తూనే వుంటాయి. ఇదేవిధంగా భౌతికమైన చావు జరిగిన తరువాత సూక్ష్మ దేహాలలో జీవుడు బద్ధుడై వుంటాడు. ఇంతలో మరొకదేహం ధరిస్తాడు. దానినే పునర్జన్మ అంటారు. ఆవేశాలు, ఆదర్శాలు. ఆహారాలు తన మనస్సుని ఏమాత్రం బంధించకుండా చచ్చిపోయిన జీవుడికి ఈ సూక్ష్మదేహాలు కూడ విడిపోతాయి. అప్పుడు ఆ మేల్కొన్న జీవతరంగం చోటులో కలిసిపోతుంది! ఇక జీవుడుండడు. పునర్జన్మ వుండదు.

తమ స్థూల సూక్ష్మ శరీరాలమీద స్వామిత్వం సిద్ధించిన కొందరు మహనీయులు కూడా స్థూలశరీరం విడిచాక సూక్ష్మ శరీరాలను చెదిరిపోకుండా నిలిపేస్తారు. అంటే తమకు జన్మరాహిత్యం అక్కరలేదని కోరి మళ్ళీ భౌతిక దేహాలలోకి వస్తారు. ఆ పని జగత్కళ్యాణం కోసంచేస్తారు. కనుక వారికవి పునర్జన్మలైన కారణజన్మలు. భౌతిక జన్మకన్న ముందే

ఒక పవిత్ర కారణం ఏర్పాటు చేసుకోగలిగితే అతనిని కారణజన్ముడు అంటారు. పరమగురువులు మొదలైనవాళ్ళు అలాంటివాళ్లు. చెప్పాలంటే సృష్టిలో జరుగుతున్న కథ యిదే.

వ్యక్తి: సృష్టి రహస్యాన్ని క్షణంలో సులవుగా విప్పి చెప్పారు మాస్టారూ! మీరు చెపుతుంటే జరుగుతున్న కథ కళ్ళకి కట్టినట్లుగా వుంది.

మాస్టరుగారు: ఉన్న సత్యమింతేనోయ్! దీనిని అనేక కోణాలలో చూడటంవల్ల అనేక సిద్ధాంతాలు పుట్టుకువచ్చాయి.

## స్వర్గ నరకాలున్నాయా ?

వ్యక్తి: శరీరం విడిచిపెట్టగానే తాను చేసుకున్న కర్మ ఫలితాలను బట్టి స్వర్గ, నరకాలలో ఏదో ఒకదానికి పోతాడని పురాణాలలోను, కథల లోను చెపుతూ ఉంటారుగదా మాస్టరుగారూ! నిజంగా ఆ స్వర్గ నరకా లనేవి వున్నాయా? వుంటే వాటి నిజస్వరూపం ఏమిటి?

మాస్టరుగారు: భౌతికదేహం విడచిన తరువాత కలిగే అనుభవాలు సూక్ష్మశరీరాల చిక్కదనాన్ని బట్టి అనేకవిధాలుగా వుంటాయి. చనిపో గానే కలిగే అనుభవాలు చనిపోకముందు చావును గూర్చి అతనికున్న అభి ప్రాయాలను బట్టి వుంటాయి. పురాణాలు నమ్మినవాళ్లు చనిపోగానే హిందూ చావు వస్తుంది- అంటే దున్నపోతు, యముడు కనిపిస్తారు. క్రైస్తవులు చనిపోగానే రెక్కల దేవకన్యలు, గులాబీదండ, వెలుగుతున్న క్రాసు కనిపిస్తాయి. మహమ్మదీయుడు చనిపోతే చంద్రవంక, "క బా" అనే అక్షరం కనిపిస్తాయి. విశ్వాసపాత్రుడయిన రాజకీయ నాయకుడు చనిపోతే వాడి తాలూకు జెండా కనిపిస్తుంది. ఇవి స్మరణలతో కలగలుపుగా బెడ్డలు· విమ్మ్రమ కలిసినట్లుంటాయి. కనుక వీటిని అనుభవాలు అనరాదు. నిద్రలో

వున్నవాడికి బయట మాట్లాడుకునే మాటలు వినిపిస్తూ వుంటాయి. అప్పటి వాడి స్థితిని నిద్ర అనడం ఎంత సత్యమో, ఈ యమదర్శనాలు మొదలైనవి అనుభవాలనడం అంతే సత్యం. ఈ స్థితి దాటిపోకుండా మళ్ళీ అంతకు ముందు దేహంలోకి మెలకువ కూడా రావచ్చు. అప్పుడు వాడిని చచ్చి బ్రతికాడంటారు. అప్పుడెవడన్నా విభూతీగాని, మందుగాని వేస్తే చచ్చిన వాణ్ణి బ్రతికించాడంటారు. ఇవేవి అక్కరలేకుండా బుద్ధిపూర్వకంగా చచ్చి బ్రతికిన వాళ్ళుకూడా వున్నారు.

ఈ స్థితిని దాటి ఇంకా కొంతలోతుగా చచ్చిపోయిన వాళ్ళకి కలిగేవి నిజమైన అనుభవాలు. అలాంటివాళ్ళు కూడా మళ్ళా వెనక్కి బ్రతికినవాళ్ళున్నారు. వాళ్ళుపొందే అనుభవాలు ఏ మతంవాళ్ళకైనా ఒకటిగానేఉంటాయి. ఒకటే అనుభవం వాళ్ళందరి విషయంలో రికార్డు చేయబడింది. ఒక చీకటి గొట్టంలోనుండి ప్రయాణం చేస్తున్నట్లు. దానికవతల చక్కని వెలుగు ముద్ద ఉన్నట్లు, ఆ వెలుగు దగ్గరకు వెళతూ వున్నకొద్దీ ఉక్కిరి బిక్కిరి తగ్గుతున్నట్లు, ప్రాణానికి హాయి కలుగుతున్నట్లు అనిపిస్తుంది. అయినా రాక తప్పక బలవంతాన మళ్ళా వెనక్కి ఉక్కిరి బిక్కిరిలోకి దూరుతున్నట్లనిపించి వెనుకటి శరీరంలో మేల్కొంటారు.

ఇంకొక విశేషం వుంది. భౌతికశరీరం ఉన్నప్పుడు దానిద్వారా పని చేసే మనస్సు ప్రజ్ఞవేరు. భౌతికశరీరం పోయాక సూక్ష్మశరీరాలు మాత్రమే ఉన్నప్పుడు పనిచేసే ప్రజ్ఞవేరు. భౌతిక శరీరంలో గుండా పనిచేసే ప్రజ్ఞ ఇంద్రియాలతో వస్తువుల ప్రతిబింబాలను మాత్రమే గ్రహించి వాన్నిబట్టి ఎదుట ఆ వస్తువులు వున్నట్లు గ్రహించగలుగుతుంది. అంతే గాని వస్తువుల అస్తిత్వం సూటిగా గ్రహించడం దీనికి సాధ్యం కాదు. ఉదాహరణకి మనకంటి ఎదురుగుండా వున్న శరీరంపై పడిన వెలుగు కిరణాలు వెనుదిరిగి వచ్చి మన కంటిమీద ఆ శరీరాకారం ఫొటో పడటం వల్ల మాత్రమే ఫలానా వ్యక్తి మన ఎదురుగుండా ఉన్నాడని

మనం గ్రహించగల్గుతున్నాం, అంటే మనం ప్రతిబింబాలను చూచి వ్యక్తులతో మాట్లాడుతున్నామన్న మాట. ప్రతిబింబం నిమిత్తంగా ఆ వ్యక్తిని గూర్చిన స్మరణ, లేక పూర్వ స్మృతి మనమీద సంస్కారంగా పనిచేయడాన్ని ఆ వ్యక్తితో పరిచయం ఉండడం అంటున్నాం. పరిచయం స్మరణకు సంబంధించినది. ప్రతిబింబం కంటికి సంబంధించినది. ఈ రెండింటిలో అలవాటు చొప్పున ప్రతిబింబం మీదే ఎక్కువ ప్రాధాన్యం ఉంటున్నది. శరీరం వదలగానే దీనికి అవకాశం పూర్తిగా పోతుంది. అంటే ప్రతిబింబాన్ని చూడట మనేది ఉండదు గదా! అప్పుడు వ్యక్తిని గూర్చిన స్మృతి, సంస్కారము మాత్రమే మిగులుతాయి. కొన్ని గంటలలో స్మృతికి ఆధారమైన మనస్సుకూడా పోతుంది. స్మృతికూడా సంస్కారంగా ఉండిపోతుంది. ఆ స్థితిలో స్మృతికీ ఆ వస్తువు అస్తిత్వానికి భేదం వుండదు. ఒక విషయం జ్ఞప్తికి రావడం అన్నా జరగడం అన్నా ఒక్కటే. అప్పుని వాడు జ్ఞప్తికి వచ్చేసరికి నిజంగా వచ్చి నెత్తిన కూర్చుంటాడు. ఈ సంస్కార స్మృతులలో మంచివీ చెడ్డవీ రెండూ వుంటాయి. కానీ మంచి వాటికన్నా ముందుగా భయకారణాలు, శోక కారణాలు తలఎత్తి ప్రాధాన్యం వహించడం సహజం. పొరుగూరు వెళ్ళినపుడు అక్కడ మనం ఎరుగున్న వాళ్ళలో సత్కరించేవాళ్ళు, అప్పులవాళ్ళు, వున్నారనుకో, ఆ ఊళ్ళో దిగుతూ వుండగా మొదట అప్పులవాడు కనుపిస్తాడేమో ననిపిస్తున్నది గాని, మన వాళ్ళు కనిపిస్తే బాగుండును అని జ్ఞాపకం రాదు. అలాగే చని పోయిన తరువాత అప్పులవాళ్లు, శత్రువులు, రోగాలు, నొప్పులు అంతకు ముందు ఎవరో చనిపోయిన దుఃఖాలు, తాను చేసిన నేరాల స్మృతులు, స్మృతి సంస్కారాలుగా తేలతాయి. అంటే వాళ్లంతా నెత్తినెక్కి కూర్చుం టారు. వారినిగూర్చి ఏ బాధలు వస్తాయని భయపడుతున్నామో ఆ బాధలు పెడుతుంటారు. ఈ అనుభూతినే యమలోకం అంటారు. తలనొప్పి, కీళ్ళ నొప్పులు జ్ఞప్తికి వచ్చినపుడు ఆ నొప్పులకు రూపకల్పన వస్తుంది. ఆ నొప్పులు ఈటెలతో, కత్తులతో, బల్లాలతో పొడుస్తారు. మూలవ్యాధి రూపాలు

వున్నదనుకో, దానికొక రూపం కల్పింపబడి ఆ రూపం నిప్పుల మీద వేయిస్తుంది. చీము నెత్తురు బాధలుంటే ఆ నసులలో వీడు ఈదుతూ వుంటాడు. శస్త్రచికిత్సల్లాంటివి జరిగివుంటే ఆ స్మృతులు కత్తులతో కండలు, ఎముకలు ముక్కలు తీస్తారు. ఆ కోశంలో ఉన్న ప్రజ్ఞ అరిగి పోయేదాకా ఈ యమలోక బాధలు తప్పవు. అది పూర్తిగా అరిగిపోయిన వెనుక తనకు తృప్తినిచ్చే సంస్కారాలు గుర్తుకొస్తాయి. ప్రేమపాత్రులైన బంధువులు, మిత్రులు జ్ఞప్తికి వస్తారు. అంటే వచ్చి నెత్తిన కూర్చుంటారు. చనిపోయిన చుట్టాలు, మిత్రులు, తల్లిదండ్రులు అందర్నీ కలుసుకుంటాడు. వారితో తనివితీరా సుఖపడతాడు. తీరని కోరికలువుంటే తీరుతాయి. తాను బ్రతికి ఉండగానే ఒక స్త్రీ సౌందర్యానికి ముగ్ధుడై ఆమెతో సుఖించాలని ఆశపడ్డాడనుకో, స్వర్గలోకంలో ఆమెతో సుఖిస్తాడు. దీనినే కవిత్వంలో చెబితే రంభా సంభోగాదులు అంటారు.

ఇందులో ఇంకొక విశేషం ఉన్నది. మెలకువగా దేహంలో ఉన్న మనస్సుకి కాలమానం వేరు, స్వప్నంలో కాలమానం వేరు. మృత్యువు తరువాత ప్రజ్ఞకు కాలమానం వేరు. నిద్రపోతున్నవాడికి కాలిమీద పిన్ను గుచ్చితే క్షణంలో మెలకువ వస్తుంది. పిన్ను గుచ్చాక మెలకువ వచ్చే లోపున ఒక కల వస్తుంది. ఎవరో వెంటపడుతు ఉంటే తాను పారిపోతూ ఉన్నట్లు, దారినిండా ముళ్ళకంచెలు ఉన్నట్లు, చాలాదూరం చాలాసేపు పరి గెత్తి, పరిగెత్తి ముళ్ళకంచెలో దూకినట్లు, ముళ్ళు గుచ్చుకున్నట్లు కల వచ్చి మెలకువ వస్తుంది. ఇదంతా పిన్నుగుచ్చుకున్న నెప్పికి స్వప్నంలో తర్జుమా. క్షణంలో కొంతభాగం భౌతిక కాలమానంలో ముల్లుగుచ్చుకుంటే ఆ క్షణంలోనే మెలకువ వచ్చేలోపల స్వప్నంలో కొన్ని గంటలు పరుగెత్తు తాడు. అలాగే స్వర్గలోకపు, నరక లోకపు కాలమానాలు వేరు. అందులో ఎవరన్నా తంతూఉంటే అతని పూర్వానుభూతి తీవ్రత ననుసరించి నర

కంలో కొన్ని సంవత్సరాలు తంతూనే ఉంటాడు. స్మృతుల భీతి తీవ్రతర మైతే కొన్ని పదుల సంవత్సరాలో, వందల సంవత్సరాలో, వేల సంవత్సరాలో ఆ యమభటుడు కత్తులు పెట్టి పొడుస్తూనే ఉంటాడు. అలాగే స్వర్గంలో ఇష్ట జనులతో కొన్నివేల సంవత్సరాలు సుఖిస్తూ ఉంటాడు. ఆపేక్షతో పాయసాన్నం బీదలకి పెట్టి, వాళ్ళు తింటూ ఉంటే ఆనందించిన స్మృతివలన స్వర్గంలో కొన్నివేల సంవత్సరాలు మహరాన్నాలు అనుభవిస్తూ ఉంటాడు. పుణ్యకర్మల వల్ల లభించే పుణ్యలోకాలలో ఇది ఒక తరగతి. ఇక బ్రతికి ఉండగానే అనుభవించే గౌరవ మర్యాదలు, పేరు ప్రతిష్ఠలు మరియొక తరగతి. ఇదే టూకీగా చెప్పాలంటే స్వర్గ నరకాల వృత్తాంతం.

వ్యక్తి : చాలా బాగుంది మాస్టారూ! మీరు శాస్త్రీయంగా వివరించిన అంశాలనే మన పెద్దలు అనుభవంలోకి వచ్చేటట్లుగా వర్ణించారన్న మాట. వాళ్లు చేసిన పని ఎంత ప్రతిభావంతమైనదో ఇప్పుడు బోధపడుతున్నది. సూక్ష్మమైన ఈ అంశాలను సామాన్యుడికి కూడా అనుభవంలోకి వచ్చేటందుకే ఆ పెద్దలలా వర్ణించి ఉంటారని అనిపిస్తోంది.

మాస్టరుగారు : అనిపించడమేమిటి వాళ్ళు చేసిన పనే అది! సృష్టిలోని ఎన్నో సూక్ష్మాంశాలను శాస్త్రీయంగా చెప్పి యిబ్బంది పెట్టకుండా మన పెద్దలు పిట్టకథల్లా చెప్పారు. మనలో చాలా మంది ఆ కథల్ని పట్టుకు వ్రేలాడుతూ ఉంటాం. ఆ పిట్టలేమో ఎగిరిపోతూ ఉంటాయి.

వ్యక్తి : మళ్ళీ మీలాంటి వాళ్ళు ఆ పిట్టల్ని చూపించే వరకు అంటే విప్పి చెప్పేవరకు పెద్దల ప్రణాళిక బోధపడదు మాస్టారూ!

## పుత్రుడు - పున్నామనరకం

వ్యక్తి : పుత్రుడు కలిగితే పున్నామ నరకం తప్పుతుంది అంటారు. ఆ విశ్వాసంలోని పరమార్థమేమిటి? మాస్టారూ!

మాస్టరుగారు : జీవుడి పరిణామానికి రెండు మార్గాలు ఉన్నాయి ఒకటి రాబోయే జన్మ. ఇంకొకటి రాబోయే తరం. అందులో మొదటి దానికి దేవయానమని, రెండవ దానికి పితృయానమని పేర్లు. దేవ యానానికి తన సంస్కారాలు ఉపాధిగా నిలుస్తాయి. పితృయానానికి తన భార్య, గర్భంలో పిండోత్పత్తి ఉపాధిగా నిలుస్తుంది. జీవుని గతికి దేవతలనబడే ప్రజ్ఞలు మార్గము చూపుతారు. పిండోత్పత్తికి పితరులనబడే దేవతలు మార్గం చూపుతారు. ఈ రెండు మార్గాలలో పురోగతి ఉన్నప్పుడే నరక బాధలు ఉండవు.

కొన్ని లక్షల సంవత్సరాలనుండి పరిణామంలో ముందుకు నడుస్తూ తెచ్చుకున్న నరజన్మకి దేహంలోని సప్తధాతువులుగా నిరగ్నులనబడే పితృ దేవతలు పనిచేస్తూ వుంటారు, అందు శుక్ర ధాతువు ద్వారా ఆ పరిణామానికి ముందు గతి కల్పించటానికి భార్గవులు లేక ఉశనసులు అనబడే పితృదేవతలు సహకరిస్తూ ఉంటారు. వారి ఆశ్రయంలో తన తాత తండ్రులు అంత పరంపర వచ్చిన సంస్కారాల రూపంలో తనయందు వ్రేళ్ళాడుతూ ఉంటారు. వారికి రాబోవు గతి భార్య గర్భంలో పిండ ప్రదానం చేస్తే మాత్రమే పుత్రుడు రూపంలో సిద్ధిస్తుంది. అది లేనపుడు మళ్ళీ ఆ వెనకటి తరాల సంస్కారాలన్నీ మట్టిలో, గాలిలో, నీటిలో కలిసిపోతాయి. వైకుంఠ పాళిలో పాముతోక లాగ మళ్ళా అక్కడ నుండి పరిణామం మొదలు పెట్టాలి. దీనినే అధోగతి లేక పున్నామ నరకం అంటారు.

వ్యక్తి : అయితే మన పూర్వులు మనయందు సంస్కార రూపాలను వదలి, తాము తమ పరిణామంలో పైకి వెళ్ళిపోతారన్నమాట!

మాస్టరుగారు : అహా! దేవయానంలో వారు ముందుకు సాగుతూనే ఉంటారు. వారు వదలిన సంస్కార రూపాలు మనయందు వ్రేలాడుతూ మననుండి రాబోయే తరం కొరకు వేచి ఉంటాయి. వాటిని వినియోగించుకోలేక పోవటమే పున్నామ నరకంగా చెప్పబడింది.

వ్యక్తి: ఇందువల్లనే కాబోలు మాస్టారూ! భారతంలో జరత్కా రునికి తాతముత్తాతలు చెట్టుకు వ్రేలాడుతూ ఉన్నట్లు కనపడటం. పెళ్ళి చేసుకోమని కోరటం. అప్పుడు జరత్కారుడు సత్యాన్ని గ్రహించి పెళ్ళి చేసుకోవడం. ఇప్పుడు మీరు వివరిస్తుంటే నా కా జరత్కారువు కథ కళ్ళకు కడుతోంది మాస్టారూ!

మాస్టరుగారు : ఈ సత్యాన్ని కళ్ళకు కట్టేటట్లుగా చేయడానికే భార తంలో ఆ కథ చెప్పబడింది.

## వైతరణి అంటే ?

వ్యక్తి : వైతరణి దాటడం వుంటుంది అంటారు కదా! మరి అదే మిటి? దాని స్వరూపం ఎలా వుంటుంది ?

మాస్టరుగారు : నిద్రలో ఉన్నవాడికి కాలిలో పిన్ను గుచ్చితే మెల కువ వచ్చే లోపల ఆ నొప్పికి రూపకల్పన జరుగుతుందని చెప్పాను. ఆ రూపకల్పన ఆ వ్యక్తి మేల్కొని ఉన్నపుడు అతనికి నొప్పిని గూర్చి ఉన్న అభిప్రాయాల సమాహారం మీద ఆధారపడి ఉంటుంది. అంతకు ముందు అతనికి ముళ్ళకంచెలో నడవటం అలవాటయితే ముళ్ళకంచెలో అడుగు వేసినట్లు, ముల్లు గుచ్చుకున్నట్లు కలవస్తుంది. అరికాలులో వ్రణం వేసి తగ్గిన వాడయితే వ్రణం లేచి బాధపెడుతున్నట్లు కల వస్తుంది. శస్త్ర చికిత్స పొందిన వాడి కయితే కత్తులతో ముక్కలు తీస్తున్నట్లు కలవస్తుంది. ఈ రూపకల్పన అతని పూర్వ సంస్కారాల తరగతినిబట్టి ఉంటుంది. ఎక్కువమంది సంసార జీవులకు కోప తాపాలు, భయము మొదలైనవి కలిగినపుడల్లా రక్తము యొక్క ఉష్ణోగ్రత మొదలైనవి మారుతూ ఉంటాయి. వాటి సంస్కారాల సమాహారం రక్తపు నదిలాగ అనుభవ

మౌతుంది. దేహం వ్యాధి గ్రస్తమై, రక్తం చెడిపోతే చీము నెత్తురు గూడుకట్టితే వాటి సంస్కారాల మొత్తం చీమునెత్తుళ్ళ యేటివలె దుర్గంధామయంతో కనుపిస్తుంది. వాడు లోగడ పొందిన మంట మొదలైన బాధలు ఆ యేటి మీద తేలుతున్న అగ్ని జ్వాలల లాగ, నిప్పుల సుడిగుండాల లాగ అనుభవం తెస్తాయి. నొప్పులు, పీకులు, తీపుల సంస్కారాలు మొసళ్ళు, తిమింగలాలు కరుస్తున్నట్లు, మింగుతూ ఉన్నట్లు కనిపిస్తాయి. వాడు లోగడ పొందిన బాధల తీవ్రతను బట్టి, కాల పరిమితిని బట్టి, ఆ యేటిలో ఈదడం యొక్క సాధ్యా సాధ్యాలు రూపింపబడతాయి. ఇతరులకు బాధలు తగ్గించి హృదయపూర్వకమైన మిత్ర ధర్మాన్ని అనుభవించి సంస్కారంగా పొందిన వానికి, తనపైన ఎవరో దయ తలచినట్లు, ఆ నదిలో పడవ ఎక్కించి దాటిస్తున్నట్లు అనిపిస్తుంది. దేహం వదిలాక అనిపించడానికి జరగడానికి భేదం లేదు గనుక, పరహిత జీవులకు ఈ మొత్తం శాస్త్రీయ సత్యం. కనుకనే శాస్త్రపురాణ గ్రంథాల్లో ఇది సత్యంగా వర్ణింపబడింది.

## నరక బాధల నుండి విముక్తి పొందడ మెలా ?

వ్యక్తి : మాస్టరుగారూ! శరీరం విడిచాక ముందుగా దుఃఖాన్ని కలిగించే స్మృతులు యమలోకాన్ని సృష్టిస్తాయని. అవన్నీ అనుభవించాక అప్పుడు మంచి స్మృతులు స్వర్గ సౌఖ్యాలను సృష్టిస్తాయని చెప్పారు. ఈ విధంగా స్మృతుల వలన ఇబ్బంది పడకుండా దేహంలో ఉన్నప్పుడు, దేహం విడిచాక కూడా ప్రశాంతంగా హాయిగా ఉండాలి అంటే మానవుడు అనుసరించవలసిన మార్గమేమిటి ?

మాస్టరుగారు : దేహంలో ఉన్నప్పుడు, దేహం విడిచిన వెనుక సుఖ శాంతులతో ఉండ గలగడాన్నే ఇహపర సౌఖ్యాలు అన్నారు. ఇవి సిద్ధించాలంటే ఏంచేయాలో చెప్పడానికే ఋషి ప్రోక్తమైన సకల ప్రమాణ

గ్రంథాలు పుట్టినాయి. ఆ కర్తవ్యాన్నే ధర్మాచరణ మన్నారు. వానిని ప్రతిపాదించినవే వేదాలు, ఉపనిషత్తులు పురాణేతిహాసాలు, ఆహార, విహార, నిద్రా దాంపత్యాది విషయాలలో శీలవంతుడై ప్రవర్తించడం, దేశకాలపాత్రాలను వివేకంతో ఎరిగి మెలగడం, దాన ధర్మాది సత్కర్మ లాచరించడం, భూతదయ మొదలైన మార్గాలతో నలుగురితో మంచిగా ప్రతి మెప్పులతో సుఖాలు పొందడం, సత్సాంగత్యంతో ఉన్నత కక్ష్యలో నిలబడటం, నాలుగాశ్రమాల ధర్మాలు నిర్వర్తించడం, ఉపనయన వివాహాది సంస్కారాలతో పశుత్వం నుండి కాపాడుకుంటూ సుఖాలు అనుభవించడం, ఇంద్రియాలు, మనస్సు తన వశంలో ఉంచుకోవడం, హింసాబుద్ధి లేకుండా పరోపకారంతో బ్రతకడం, వీటివల్లవచ్చే సంస్కారాలతో కూడిన సునయాసమైన దేహత్యాగం, మళ్ళా ఉత్తమ జన్మపొందడం, ఈ మొత్తానికి సారాంశం. ఈ మార్గానికి భిన్నంగా నడుచుకోవడం వల్లనే పైన చెప్పిన దుర్మరణాలు. యమలోకబాధలు కలుగుతాయి. వేదాలలో శాసనరూపంలో చెప్పినా, ఉపనిషత్తులు, పురాణాలలో మిత్ర ధర్మంగా చెప్పినా, కావ్యమార్గంలో ప్రియురాలు చెప్పినట్లు చెప్పినా, అందలి అర్థవాదాలు, కథలు, కమామిషులు ప్రతిపాదించేది ఇంతకన్నా వేరే ఏమీ లేదు. ఈ మార్గాన్ని అవలంబించిన వారిని వేద మార్గగులని, ఆర్యులని అంటారు. తప్పి త్రిప్పలు పడుతూ సుఖం కోసం వెంపర్లాడుకుంటూ, ఇంద్రియాల వెంట, ఆస్తిపాస్తులవెంట, మత రాజకీయాల వెంట కోర్టుల వెంట తిరుగుతూ, సుఖపడటానికి నోచుకోకుండా చచ్చేవారిని మ్లేచ్ఛులు అంటారు. వారినే వేద బాహ్యులు అన్నారు. వారి సాంగత్యం వల్ల సుఖజీవనం కలిగించే వేదమార్గం నుండి దృష్టి చెదరడానికి అవకాశం ఉంది గనుక అలాంటి వారిని పూర్వులలో కొందరు అస్పృశ్యులుగా భావించేవారు.

వ్యక్తి : మానవులకు శాంతియుత సుఖజీవనాన్ని సిద్ధించేటట్లు చేయటానికి మన పెద్దలు చేసిన కృషి తల్చుకున్నప్పుడు ఆశ్చర్యానందాలతో

వారికి చేయెత్తి నమస్కరించడం తప్ప వారికి మనం ఏం చేయగలం? వారి ఋణం ఎలా తీర్చుకోగలం ?

మాస్టరుగారు : వారు నడిచినట్లు నడిచి పదిమందికి ఆ మార్గాన్ని విప్పి చెప్పి వారి జీవితాలను కూడా సుఖశాంతులతో నిండేటట్లు చేయగలిగితే మనం ఆ పెద్దల ఋణాన్ని తీర్చుకున్న వాళ్ళం అవుతాం. వారెందుకు కృషి చేశారో దర్శించి ఆ కృషిని వివేకంతో సద్వినియోగపరుచుకొనడమే మనం చేయగలిగింది చేయవలసింది.

## యముని నిజస్వరూపం

వ్యక్తి : మాస్టరుగారూ ? మన సంప్రదాయంలో యముడు, యమధర్మరాజు అంటారు కదా! అతని స్వరూప స్వభావాలేమిటి ? సృష్టిలోనున్న ఒకానొక తత్త్వానికి యముడని నామకరణంచేశారు అనిపిస్తుంది. ఆ తత్త్వం ఏమిటో మీ లాంటివాళ్ళే వివరించి చెప్పాలి.

మాస్టరుగారు : మానవజన్మకు పశుకామం. ఇంద్రియలోలత ఈర్ష్యాసూయాదులు పరిణామం యొక్క అసంపూర్ణతకు లక్షణాలు. దాని సంపూర్ణతను అర్జించుకొనడానికి మానవుడు తన్ను తాను కాలానికి, ప్రకృతికి విడిచిపెట్టి చూస్తూ ఉండనక్కర్లేదు. జంతువులకి చెట్లకి పరిణామం పూర్తిగా ప్రకృతి కార్యక్రమంలో ఇమిడి ఉంటుంది. ప్రకృతి తెచ్చిన పరిణామానికి ఫలితమే మానవుడు. ఆప్రకృతే మానవుడికి వివేకం అనే శక్తిని ప్రసాదించింది. దాన్ని వినియోగించు కొనడం మొదలు పెట్టిన దశనుండి ప్రకృతి అతని పరిణామాన్ని క్రమంగా అతనికే వదిలివేస్తుంది. కనుక మానవుడు జంతువులను చూచి తనకు కూడా భవిష్య త్పరిణామాన్ని ప్రకృతే చేకూర్చాలని చతికిలబడి కూర్చుంటే అధోగతేకాని పురోగతి ఉండదు.అలా కూర్చోనీయకుండా ముల్లుకర్రతో పొడవడానికి ఆ ప్రకృతే వాడికి కర్మ

ఫలాన్ని ఏర్పాటు చేసింది. జంతువులు మొదలైన వాటికి కర్మఫలం లేదు. కారణం ఏమంటే అవి చేసే పనులకి ఆకలిదప్పులు మొదలైన ప్రకృతిగుణాలే కారణంగాని అభిప్రాయాలు, ఆశయాలుకావు. అభిప్రాయాలు, ఆశయాలు ఉండటంవల్ల మానవుడికి కర్మఫలాలుంటాయి. చెడ్డకర్మకి బాధా కరమైన ఫలితం వుంటుంది. జంతువులకు అప్పుచేయడం ఉండదు కనుక అప్పులవాళ్ళ బాధలు లేవు. నరుడు అప్పుచేసినా, తప్పుచేసినా ఇతరులచేత దండింపబడతాడు. అంటే నరుడితోనే నరుడికి కర్మఫలాలను అనుభవింప చేస్తుంది ప్రకృతి. ఇలాంటి దుష్కర్మ ఫలితాలు శిక్షలుగా పనిచేసి శిక్షణవైపుకి మనస్సుని మరలిస్తాయి. దీనినే యమించడం లేక యమము అంటారు. దీనివలన అపరిపూర్ణత నుంచి శోధనపొంది నరుడు పరిపూర్ణత లోనికి పయనిస్తాడు. ఇక్కడ వివేకాన్ని ఉపయోగించుకున్న వాడికి అనేక జన్మల పరిణామం ఒక జన్మలోనే జరుగుతుంది, నర ప్రకృతిలోని, ఈ "యమించే"సామర్థ్యాన్నే యముడు లేక యమధర్మరాజు అంటారు. వివిధ కర్మఫలాలే యమలోకంలో బాధలు.

## చిత్రగుప్తుని కథ

వ్యక్తి : చాలా చక్కగా బోధపడింది మాస్టారూ! మరి చిత్రగుప్తుడంటే ఏమిటో, ఆ తత్త్వంలో వున్న చిత్రమేమిటోకూడా వివరించిచెప్పండి.

మాస్టరుగారు: జ్ఞప్తివున్నా లేకపోయినా అప్పులవాడు అన్నరోజుకు వచ్చి కనబడతాడు. మనకు జ్ఞప్తి వుండడం లేకపోవడంతో వాడికిసంబంధం లేదు. రుచిగా ఉన్నదని మరియొక పెసరట్టు ఎక్కువ తిని మర్చిపోతే అది మర్చిపోదు. సకాలంలో అజీర్ణవ్యాధి వస్తుంది. మన జ్ఞప్తితో సంబంధం లేక ఇలా వేచియుండి కాలబద్ధంగాపనిచేసే ఫలనిర్ణయం ఒకపద్దులాగ దాచబడి వుంటుంది, కావలసిన తేదీన పద్దు తిరగవేసి వసూలుచేసినట్లు పనిచేసే ఈ

సామర్థ్యాన్నే చిత్రగుప్తుడంటారు. చిత్రంగా మనకు అంతుపట్టని విధంలో గోపనం చేసివుంచి ఫలానుభవాన్ని నిర్ణయం చేయడమని ఈ చిత్రగుప్తుడనే పదానికి అర్థం.

యముడు, చిత్రగుప్తుడు సర్వకాలాల్లో, సర్వ మానవుల మీద పని చేస్తూ పరిపూర్ణతకు దారి తీస్తారు. అది బాధాకరంగా వుంటుంది గనుక వారిద్దరూ భయంకరులుగా వర్ణింపబడ్డారు. సత్కార్మ లాచరించేవాడికి సత్ఫలితాలు అనుభవానికి వచ్చి ఊర్ధ్వగతికి దారితీస్తాయిగనుక పుణ్యాత్ములకు యముడు సుందర, సుకుమార రూపంలో దర్శనమిచ్చి పరాలిస్తాడని కాశీ ఖండంలో శివశర్మోపాఖ్యానము చెబుతుంది.

వ్యక్తి: చాలా బాగుంది మాస్టారూ! యముడు,చిత్రగుప్తుడు కేవలం యమలోకంలోనే దర్శనం ఇచ్చేవాళ్ళుకాదని, మానవులను మంచి మార్గం వైపు మలచేటందుకై నిరంతరం పనిచేసే దివ్యమూర్తులని బోధపడింది. ఇలా బోధపరచుకుంటున్న కొద్దీ మన సంప్రదాయంలోని దేవతామూర్తుల స్వస్వరూపాలు నిత్య జీవితంలో అనుభవంలోకి రాగలవని అనిపిస్తోంది.

మాస్టరుగారు : ఒకసారి ఆ దేవతల నిజ స్వరూపాలు బోధపడాలేగాని ఆపైన వారు అడుగడుగునా సాక్షాత్కరిస్తూనే వుంటారు. దేవతలతో సృష్టి నిండియున్నట్లుగా మన జీవితం కూడా దేవతలచే నిండియున్నదని, నిర్వహింపబడుతోందని అనుభవంలోకి వస్తుంది.

## దున్నపోతే యమవాహనం ఎందుకయింది ?

వ్యక్తి : యముడి వాహనం దున్నపోతు అంటారుగదా! యమునికి దున్నపోతుకి సంబంధం ఏమైనా వున్నదా మాస్టారూ ?

మాస్టరుగారు : దున్నపోతుకీ, యముడికి వున్న సంబంధం తెలియ డానికి ఆధారాలేమీ లేవు. ఎక్కువమంది అనుభవాన్ని బట్టి ఒక చిన్న సామ్యం కనిపిస్తుంది. దున్నపోతు కలలోకివచ్చి వెంటపడినట్లు,తరుముతూ ఉన్నట్లు కనిపించి స్వప్నంలో భయం కలిగితే మాత్రం తానో, తన ఆప్తులో చనిపోవడంగాని, జబ్బుచేసి చనిపోయినంతపని జరగడంగాని అవుతుంది. ఇది నూటికి ఎనభై మంది విషయంలో సత్యం. దున్నపోతులు లేని తెల్ల దేశాలలో ఈ స్వప్నం వైఖరి ఎలా వుంటుందో చెప్పలేంగాని ఉన్న దేశాలన్నిటిలో ఈ సత్యం వర్తిస్తుంది. దీన్ని గమనించి పూర్వు లేమైనా దున్నపోతుని యముని వాహనంగా చేశారేమోగాని చెప్పలేము.

## యమపాశం

వ్యక్తి : మరి యమునిచేతిలో కాలపాశం ఉంటుందంటారు? అదే మిటి మాస్టారూ?

మాస్టరుగారు : పాశం అంటే త్రాడు. దానితో ఉచ్చువేస్తే జీవుడు యముడికి పట్టుబడతాడని పురాణాలు చెపుతున్నాయి. బహుశా ఉరిపోసుకొన డానికి, శ్వాసగతులు నిరోధం కావడానికివున్న సన్నిహితత్వం ఈ సంకేతా నికి కారణం కావచ్చు. చనిపోతూ వుండగా చాలామందికి శ్వాసబిగదీయడం గాలి పీలుద్దామన్నా సాధ్యపడకపోవడం, ఉక్కిరిబిక్కిరి వుంటాయి.కొంద రికి కంఠగతములైన కఫవాతములు, గురక కూడ వుంటాయి. అప్పుడు జీవుడు పడే బాధకి చిహ్నంగా యముని ఉరిత్రాడు పుట్టివుండవచ్చు.

## ఇంద్రుని నిజరూపం

వ్యక్తి : మన పురాణాల్లో, ఇతర గ్రంథాల్లో యమలోకం వున్నట్లే ఇంద్రలోకంకూడా వున్నట్లు వర్ణించారు కదా! ఇంద్రుడు దేవతలకునాయకు

డని, దేవతలు అతని పరివారమని, బృహస్పతి అతని గురువని రకరకాల కథలు చెపుతారు కదా, మరి ఈ ఇంద్రుడి కథ ఏమిటి ?

మాస్టరుగారు: ఇంద్రియ ప్రవృత్తులు స్వతంత్రాలు కావు. మనస్సు మీద ఆధారపడి వుంటాయి. మనస్సులో ఏర్పడిన ఇంద్రియాల కేంద్రమైన ప్రజ్ఞనే ఇంద్రునిగా వర్ణించారు. ఇంద్రియాల ద్వారా మనస్సు సుఖానుభవం పొందుతుంది గనుక ఇంద్రుడు భోగాలకు అధిపతి. శరీరంలోని భౌతిక ధాతువులను పరిపాలించేవి ఇంద్రియాలు కనుక దేహంపైన అవి అధికారం కలవి. వానిపైన అధికారం గలది మనస్సు, దానిపైన అధికారం గలది బుద్ధి, కనుక బుద్ధికి అధిదేవత అయిన బృహస్పతి ఇంద్రుడికి గురువన్నారు. మనస్సుకి గల పైె చెప్పిన ఆధిపత్యం మీదనే సామర్ధ్యం ఆధారపడి ఉంటుంది. కనుక సమర్థుడైన వాడిచుట్టూ ఆశ్రయించుకొని మిగిలినవారు చేరుతారు. దీనినిబట్టి ఇంద్రుడంటే నాయకుడని కూడా అర్థం వచ్చింది. పరిపాలించే వాడిని నరేంద్రుడంటారు. కాలక్రమాన శ్రేష్ఠమనే అర్థం కూడా వచ్చింది. జంతువులలో శ్రేష్ఠము, సమర్ధము అయినదానిని మృగేంద్రుడని మొదలైన అర్థాలు వచ్చాయి. ఇలాగే అకాశంలో శక్తులను కూడగట్టుకునే ప్రజ్ఞ ఇంద్రుడుగా వేదాలలో చెప్పబడినది. పురాణాలలో మాత్రం ఇంద్రియాలద్వారా సమస్త భోగాలని అనుభవించే మనస్సుకు అధిదేవతగానే ఇంద్రుడు ఎక్కువగా వర్ణింపబడ్డాడు వాడిచుట్టూ ఆక్రమించుకొని ఉన్న ఇంద్రియాది ప్రజ్ఞలు వాడి దేవతా పరివారంగా చెప్పబడ్డారు.

వ్యక్తి : అయితే మాస్టరుగారూ! ఇంద్రుణ్ణి సహస్రాక్షుడు అంటారు గదా! మరి ఈ వేయి కన్నుల కథ ఏమిటి ?

మాస్టరుగారు : సృష్టికి కేంద్రంగా పనిచేస్తూ ఉన్న సూర్యుని విషయంలో ఇంద్రుని వేయికన్నులకథపుట్టింది. కిరణాలేకన్నులుగా వర్ణించడం

సమంజసమైన, శాస్త్రీయమైన, వేదవాఙ్మయ కవిసమయం. అహస్సు (పగలు)ని తనలో లీనం చేసుకున్న రాత్రిని అహల్యగా వర్ణించడం, సూర్యోదయంతో ఆమెను జరింప చేసిన సూర్యుడిని అహల్యా జారుడ నడం. వాని ఒంటి నిండా కన్నులుగా కిరణాలు ఏర్పడినాయనడం వేద పురాణ కవిసమయం.

వాల్మీకి రామాయణంలో వేదవాఙ్మయం నుండి మొదటిగా ఈ కథ లోక వాఙ్మయం లోనికి దిగివచ్చింది. కాని వాల్మీకి రామాయణంలో క్రొత్తగా గౌతముడొకడు అహల్యను పెళ్ళిచేసుకుంటాడు. గౌః+తమః అనగా భూమికి ఉత్తమ సంతోషదాయకుడు లేక చంద్రుడని అర్థం. కుముద అన్నమాటకు ఏ అర్థం చంద్రుడుగా సూచిస్తున్నదో గౌతమ అన్నమాటకు కూడ అదే. అతడు అహల్యకు భర్త అనగా చంద్రుడు రాత్రిని పరిపాలించే వాడని అర్థం. అతడు తపస్సుకు పశ్చిమ దిక్కుగా వెళ్ళిపోయిన తరువాత ఇంద్రుడు అహల్యను జరింప చేశాడంటే పూర్ణిమనాడు చంద్రుడు పడమటకు దిగిపోతూఉంటే, సూర్యుడు తూర్పున ఉదయించి రాత్రిని జరింప చేస్తాడు. జారుడు అనగా జరింప చేయు వాడు లేక జీర్ణింప చేయువాడు అనిఒక అర్థం. శీలధర్మాన్ని చెడగొట్టే వాడని ఇంకో అర్థం. ఇంద్రుడు కోడిపుంజుగా మారి ఇల్లెక్కి కూశాడని కూడా కథ ఉంది. సూర్యుడు కోడిలాగా మేల్కొలిపే కాలాన్ని తెలుపుతాడని అర్థం. ఇంతకీ గౌతముడి ప్రతిరూపంగానే ఇంద్రుడు వచ్చాడట. సూర్య చంద్రులు ఇద్దరూ వెలుగుతో కూడిన బింబాల రూపాలే అని అర్థం. వాల్మీకి రామాయణంలో మాత్రం వేదంలో లాగ కాక ఇంద్రుడు పొందిన శాపం మరోలాగ ఉంది. ఇంద్రుని బీజాలు తెగి భూమి మీద పడవలెనని గౌతముడు శపించినట్లు ఉంది. సూర్యోదయం కారణంగా సూర్యకిరణాలు భూమి మీద పడి దివ్యత్వాన్ని కోల్పోయి భూమిపై సృష్టి కారణాలైనాయని దీనికి అర్థం. శాపం తరువాత ఇంద్రుడు దేవత

లను యాచింపగా వారందరు నానా తిప్పలు పడి మేషాండం తెచ్చి ఇంద్రు
నికి బీజంగా అతికింపారని వాల్మీకి వ్రాశాడు. అంటే సూర్యుడు సంవత్సర
మంతా సంచారంచేసి తన తేజస్సును శీతాకాలంలో కోల్పోయి మరల
సంవత్సరాదిని మేషరాశిలో ప్రవేశించి మళ్ళీ వీర్యవంతుడై వసంతఋతువు
కలిగించి సృష్టికి ఉత్తేజం ఇస్తాడని, అలా దిగివచ్చిన కిరణాల మార్గమే
సూర్యవంశమని, దానికి కవిసమయంగా రాముడు చైత్రమాసంలో పుట్టా
డని, విన్యాసం చేయబడ్డది. చెప్పదలచిన విషయాన్ని ఇలాకథలోకి మలచి
ఒకప్పుడు జరిగిన రాముడను చక్రవర్తి కథలో పొదిగి ఇచ్చే పద్ధతినే
వేదార్థ ప్రతిపాదనం అంటారు.

వేదాలలో, పురాణాలలో కూడా భూమి మీదకు సూర్య కిరణాల
రూపంలో సృష్టిగా దిగివచ్చే దైవానికి అధోక్షజుడు అను పేరు
వాడబడినది. క్రిందికి ఊడిపడిన బీజములు కలవాడని దీనికి అర్థము. దీనికి
కావ్యమార్గ వివరణమే వాల్మీకి వ్రాసిన ఇంద్రుని కథ. కాగా పదాలలో
ఉన్న లౌకికార్థాలకు మాత్రం విష్ణువు, ఇంద్రుడు, రుద్రుడు వేరే వేరే
దైవాలుగా కథలు అల్లుకున్నారు. ఇవే పదాలు వేదార్థంలో వాడబడినపుడు
ఇంద్రుడు, రుద్రుడు, విష్ణువు అంతర్యామి యొక్క వేరు వేరు ధర్మాలే
గాని, వేరు వ్యక్తులు కారు.

వ్యక్తి : ఈనాడు ఇంత వివరంగా ఇంద్రుడి కథలను మీరు వివ
రించటంతో ఇంద్రుడంటే మాకున్న కూడని అభిప్రాయాలన్నీ కూకటి
వేళ్ళతో పెళ్ళగింప బడ్డాయి ఇంతటి విలువైన సత్యాలను తెలుసుకోలేక
ఈ కథలను పట్టుకొని హేళన చేస్తూ ఉండే వాళ్ళం. వెనక ఇంతటి
వేదార్థం లేకపోతే ఈ కథలు ఇన్ని యుగాలుగా ఎందుకు నిలిచి ఉంటా
యని ఇప్పుడని పిస్తోంది. ఇలాంటి కథల్ని మీలాంటి పెద్దల దగ్గర శుశ్రూష
చేసి గ్రహించాలి గాని సొంతంగా చదువుకుంటే సత్యం బోధపడక పోగా
ఏవేవో అభిప్రాయాలు ఏర్పడటానికి అవకాశం ఉంది. దేవుడు చల్లగా
చూస్తే మీకు దగ్గరలో ఉంటూ మన పురాణేతి హాసాలలోని ఇలాంటి
పొడుపు కథలన్నీ విప్పి చెప్పించుకోవాలని ఉంది.



# ౮. పితృకర్మల పరమార్థం

## కర్మల వలన పితరులకు మేలు జరుగుతుందా ?

వ్యక్తి : ఒక వ్యక్తి చనిపోయిన తరువాత నిత్యకర్మ మొదలైనవి చేస్తారుగదా ! వీటిని చేయడంవల్ల ఆ పోయినవాళ్ళకు నిజంగా మేలు జరుగుతుందా? ఒకవేళ ఆచరించకపోతే పోయినవాళ్ళేమైనా ఇబ్బందుల పాలవుతారా! మనం ఆచరించే ఈ పితృకర్మలకు పరమార్థం ఏమిటి? వీటిని గూర్చి రకరకాల భావనలు లోకంలో ఉన్నాయి. సర్వజ్ఞులైన మీరు వివరించి చెబితే మా సంశయం తొలగిపోతుంది.

మాస్టరుగారు: ఇందులో విషయాలు విప్పి చెప్పడం కొంతమందికి అంతమంచిది కాదు. అది కొంతవరకు తప్పేఅయినా విప్పిచెపుతాను. పోయినవాళ్ళకి కలగ వలసిన ఉత్తమగతులో, అధోగతులో వారు ఆచరించిన కర్మలను బట్టి ఉంటాయి. గాని వారి పుత్రులో, దత్తపుత్రులో ఆ పది రోజులు ఆచరించే కర్మలను బట్టిమారవు. అపరకర్మ కాండలో రెండు భాగాలు ఉన్నాయి. (1) వేదమంత్రాలు, (2) కల్పం వాక్యాలు. ఈ రెండూ వేరే వేరే గ్రంథాలు. వేదమంత్రాలు ప్రాచీనమైనవి. కల్పాలు బోధాయన, అశ్వలాయనాది ఋషుల కాలంలోనివి. వాళ్ళు కల్పవాక్యాలతో వేదమంత్రాలను కూర్పుచేసుకున్నారు. ఈ కూర్పు మంత్ర ద్రష్టలకు సంబంధించినది కాదు. అంటే తక్కువ రకమని అర్థంకాదు.

వేద మంత్రాల్లో ఉన్న విషయం పితృదేవతలకీ, పిండోత్పత్తికి సంబంధించిన విషయం. అనగా జీవులకు గర్భధారణం, గర్భపిండవృద్ధి, గర్భస్థ జీవుని సత్సంస్కారయుతునిగా చేయడం అనే జగత్కర్మకు సంబంధించిన దేవతలు పితృదేవతలలో ఒకతెగవారు. వీరు చంద్ర కిరణాల

యొక్క, చంద్రకళల యొక్క ప్రభావరూపంలో భూమి జీవులపై పనిచేస్తూ ఉంటారు. శనగగింజ నానవేస్తే తోకల్లేమొక్క బయటికి వస్తుంది.దానినిర్మాణానికి, వృద్ధికి,జలములయందు,జలములపై ఆధిపత్యమువహించే చంద్రుని యందు, ఉన్న పితృదేవతలు పనిచేస్తూ ఉంటారు. అలాగే గర్భధారణాదుల విషయంలో కూడ పనిచేస్తూ ఉంటారు. ఈ ప్రజాసర్గ కార్యక్రమానికి సంబంధించినవే అపరకర్మకాండలో ఉపయోగించే మంత్రాలు. వానిని భోక్తల పూజతో జోడించి చేసిన క్రతువు వలన కర్త ఇంటికి, వారి చనిపోయిన పెద్దలు సంతానంగా దిగిరావడానికి సంస్కార పూర్వకమైన, అంగీకారరూపమైన మార్గం ఏర్పడుతుంది. ఇంతవరకు చెప్పినది అపర కర్మ కాండలో గాని, ఆబ్దిక మంత్రాలలోగాని, అమావాస్యనాడు పితృ తర్పణ విషయంలోగాని యిమిడివున్న శాస్త్రీయమైన విధానం.

ఇక రెండవభాగం. కర్త, వాని బంధువులును, ఆత్మీయుడు పోయినందువలన పొందే శోకతాపాదులు తగ్గించుకోమంటే తగ్గేవి కావు. అవి తగ్గటానికి వారిలోనున్న రాగద్వేషాల లోకానికి కొంతపని కల్పించాలి.దానికోసమే పరేతకు ఆవహాన చేసినట్లు, తాపం తగ్గటానికి స్నానాలు చేయిస్తున్నట్లు, అర్చన పూజనాదులు ఉంటాయి. సన్నిహిత రక్త సంబంధము కల వారు చనిపోయినపుడు మానసిక బాధ మాత్రమేకాక వేరే కొంత తాపం అనిర్వచనీయంగా ఏర్పడుతుంది. ముఖ్యంగా తల్లిదండ్రుల, అన్నదమ్ముల శరీర దహనం జరుగుతూ ఉన్నప్పుడు తమశరీరంలో కొంత వేదన కలుగుతుంది. ఇది కొందరు విషయం తెలియకపోయినా అనుభవించడంకూడా అనుభవ సిద్ధమే. దూరదేశంలో ఉన్న తన కొడుకు చనిపోతూవున్న సమయంలో ఒకామెకు బొడ్డుదగ్గర విపరీతమైన వేదన కలిగింది. తల్లి దేహం దహనంచేస్తున్న సమయంలో ఆ వార్త తెలియని దూరదేశంలో ఉన్నకొడుకు ఒళ్ళంతా మంటలు, మంటలు అని స్నానం చేయటం మేమెరుగుదుము. ఇలాంటి బాధలు ఉపశమనం కావాలంటే శాస్త్రీయమైన మార్గాలు నవీన

శాస్త్రాల్లో లేవు. ఇంతవరకు మానవుడు కనిపెట్టిన వైద్యశాస్త్రం ఇక్కడ అక్కరకురాదు. దీన్ని గూర్చిన సరియైన శాస్త్రీయ తాపోపశమన విధానం ఈ కర్మకాండలోని కల్పంలో వుంది. అదిచేస్తే ఈ తాపం ఎందుకు తగ్గుతుంది? అన్న ప్రశ్నకు ఒక్కటే సమాధానం. ఈ మందులు పుచ్చుకుంటే ఈ రోగాలు ఎందుకు తగ్గుతున్నాయి? దీన్ని వివరించ గలిగితే దాన్ని వివరించ గలగవచ్చు. వివరించలేక పోయినందువల్ల శాస్త్రం కాదు అంటే ఆ లోపం వైద్య శాస్త్రానికి కూడా సంక్రమించవలసి ఉంటుంది.

మరొక ముఖ్య విషయం. ఎంత పాషండుడికైనా భూత దయ, దానబుద్ధి, సత్ప్రవర్తన అంటించవలెనంటే ఇంతకన్నా సరియైన సమయం దొరకదు. చనిపోయిన వారియందు ఆర్ద్రమైయున్న మనస్సుకి దాన ధర్మాలు నేర్పాలంటే ఇవి మీ చనిపోయిన వాడికే చెందుతాయి అని చెప్పాలి. ఎంత విద్యావంతుడికైనా ముముక్షు ధర్మ విశారదుడికీ తప్ప భయాదులు పోవు. చదివిన వారిలోను, చదవని వారిలోను, భయపాశాలున్న వారి సంఖ్య ఎక్కువ. చనిపోయిన తమ బంధువులు బాధపడతారనే భయాన్ని చూపి దాన ధర్మాలు చేయించడం ఈ కల్పంలో ఇమిడి ఉంది. కనుకనే దీనిని విప్పి చెప్పడం అంత మంచిదికాదు అన్నాను. ఇది తెలుసుకున్నవారు కూడ పామరులకు విప్పిచెప్పడంవల్ల అపకారం, చెప్పకపోవడంవల్ల ఉపకారం జరుగుతుంది. ఇక తెలుసుకున్న వారి విషయం వారి యిష్టం మీద, దైవ నిర్ణయం మీద ఆధారపడి ఉంటుంది.

వ్యక్తి : ఇన్ని సత్యాలను కరతలామలకం చేసుకున్న మీరు మీ తండ్రిగారు దేహాన్ని విడిచినపుడు పితృకర్మ విధానాన్ని ఎంతటి శ్రద్ధా భక్తులతో ఎంతటి దీక్షతో ఆచరించారో మేం కళ్ళారా చూశాం, వాటిని అనుష్ఠానం చేస్తున్నప్పుడు మిమ్మల్ని చూస్తున్నమాకు పితృకర్మ నిర్వహణ ఎంత పవిత్రమైనదో బోధపడింది. దీక్షతో ఈ కర్మలను అనుష్ఠించే వారికి

ఎంతటి తృప్తి, పరిపూర్ణత, అభిప్రాయో అప్పటి మీ మూర్తిలో మాకు దర్శనమిచ్చింది. మన సంప్రదాయంలో పెద్దలు దర్శించి యిచ్చిన కర్మ కాండలన్నీ మానవుడిని సంస్కరించి అతని హృదయాన్ని విశాల మొనర్చి ముక్తజీవిగా మలచేటందుకేనని మీ సాన్నిధ్యంలో ఉంటున్న మాకు అడు గడుగునా బోధపడుతూనే ఉంది. మీ అడుగుజాడలే మాకు వెలుగుదారులు. మీ వాక్కు చెవిని సోకినవాడు కర్తవ్యంలోనికి మేల్కొనటమే గాని, కర్తవ్యంనుండి పక్కకు తప్పుకోవడం అనేది సాధ్యమయ్యే పనికాదని మా అనుభవం. కనుక మీరిచ్చిన వివరణ మమ్మల్ని మరింత వికసింప చేస్తుంది. ఈ దర్శనాన్ని పొందే వాళ్ళు కూడా తప్పకుండా మానసికంగా మరింత వికసించి ధర్మాచరణకు అంకితమయ్యే వాళ్ళే అయి ఉంటారు.

## పిండాలు కాకులకే పెట్టాలా ?

వ్యక్తి : మాస్టారూ! పిండాలు కాకులకు పెడుతూ ఉంటారు కదా! కాకులకు మాత్రమే పెట్టాలనే నియమం ఏమైనా ఉందా? కాకులకు పెట్టడంలో విశేషం ఏమైనా ఉన్నదా?

మాస్టరుగారు : కాకులకే పిండాలు పెట్టాలనే నియమం కల్పంలో ఎక్కడా లేదు. మంత్రంలో కాకుల ప్రసక్తేలేదు. కల్పంలో గృధ్ర, వాయస, జలచరాదులు తినాలి అని వుంది. ఆరోగ్య శాస్త్రాన్ననుసరించి పూర్వం రోజుల్లో దహనంగాని, కర్మకాండగాని ఊరివెలుపల నదీతీరాన, కాలువ ఒడ్డున, లేక చెరువు అవతలి గట్టున చేయమని నియమం. అక్కడ పెట్టిన పిండాన్ని తినిపోయే జీవులు ముఖ్యంగా గృధ్ర, వాయస, జలచరాలు అని చెప్పబడ్డాయి. అపరిశుద్ధ భావాలకు గురైన కుక్క, నక్క, పంది తినకూడదు. గోవు తినవచ్చు.

ఇక్కడ ఒక చిన్న విశేషం. రంగుని, రూపాన్ని బట్టి, కంఠ ధ్వనిని, శకునాన్ని బట్టి, శరీర భాగాలను పీక్కు తినడాన్ని బట్టి, నిర్జీవ దేహభాగాలను త్వరగా ప్రకృతిలో కలిపివేసే శక్తిస్వరూపంగా కాకి గుర్తింపబడింది. కనుక కల్పంలో కాకి యమదూతగా వర్ణింపబడింది. దీనిని బట్టి పరేత కాకి రూపంలో వచ్చి తింటాడనే నమ్మకం ఏర్పడ్డది. చనిపోయిన వాని జీవప్రజ్ఞ ఊర్ధ్వగతికి పోయే లోపుగా సమీప విహంగాలను ఆవేశించి ఉండటం సహజం. కనుక ఆ జీవి కోర్కెలకు తాత్కాలిక ప్రతిబింబంగా ఈ కాకి ఇష్టా యిష్టాలు పనిచేస్తాయి.

వ్యక్తి : అయితే పోయిన వారు కాకిని ఆవేశించి ఇష్టమైతే ముట్టుకోవడం, ఇష్టం లేకపోతే చేరకపోవడం, ఆ బంధువులు తప్పు వొప్పుకొని నమస్కరిస్తే వచ్చి తినడం ఇవన్నీ నిజమే నన్నమాట.

## మైల పట్టడ మెందుకు ?

వ్యక్తి : మాస్టరుగారూ! బంధువులు పోయినపుడు మైలపడుతూ ఉంటారు కదా! ఈ మైల పట్టడం శాస్త్రీయమేనా? దీన్ని పాటించడం అవసరమే నంటారా ?

మాస్టరుగారు : మైల యొక్క శాస్త్రీయత అశౌచం అన్న పదంలోనే ఉంది. చనిపోయిన వారి బంధువులు శోక మగ్నులై ఉండగా స్థూల సూక్ష్మ మలాలన్నీ శరీరం నుండి ముమ్మరంగా వెలువడుతాయి. రోదనలో కంటి వెంట, ముక్కు వెంట నీరు ప్రత్యక్షమే. విషయం తెలియకపోయినా దుఃఖితుల ఇంటిలోకి వెళ్ళివస్తే మనస్సు వికాసం తగ్గుతుంటి. ఆ వాతావరణం వాయురూపాలు, భావరూపాలు అయిన మలాలతో నిండి యుండటమే దీనికి కారణం. మంచి సహవాసాలు, చెడ్డ సహవాసాలు, మనిషిని ప్రభావితుణ్ణి చేయడం భౌతికం అనలేం కదా! అది సూక్ష్మ మల సంసర్గం

వల్ల కలుగుతుంది. అలాగే దుఃఖితుల సంసర్గం ప్రభావం కూడా. దాని వలన వారు ధరించిన దుస్తులు, వాడిన వస్తువులు కూడ ఇతరులకు సూక్ష్మ మలాలను సంక్రమింప చేస్తాయి. ఇది ఇతరులకు బాధ కలిగించకుండా జాగ్రత్తపడడమే మైల పట్టడం.

## మైలలో మంత్రోపాసన

వ్యక్తి : మైలలో మంత్రోపాసన చేయవచ్చునా! దేవుడు, పూజలు ఇవేమీ పనికిరావంటారు. నిజమేనా మాస్టారూ! అలాగే సంవత్సర సూతకం ఉంటుందని ఆ సంవత్సరంలో పుణ్యక్షేత్రాలు వెళ్ళకూడదని, దేవుడి గుళ్ళలో ప్రవేశించకూడదని ఆంక్షలు పెడతారు. ఇవన్నీ ఎంతవరకు నిజం మాస్టారూ!

మాస్టరుగారు : ఇది కేవలం అజ్ఞానం. దేవుడుగాని, మంత్రంగాని, మైలపడి పోతారనడం అతి తెలివి. ఇందులోనే గనుక సత్యముంటే "అపవిత్రః పవిత్రోవా" అనే శ్లోకాన్ని సంధ్యావందనంలోంచి కత్తిరించి పారేయాలి. ఆ శ్లోకాన్ని నమ్ముతారో, ఈ సిద్ధాంతాన్ని నమ్ముతారో ఎవరికి వారే తేల్చుకోవాలి. ఇకపోతే పూజాద్రవ్యాలు, పాత్రలు, విగ్రహాలు తాకినందువల్ల అతని అశౌచ వాతావరణం వాటికి సోకే అవకాశం ఉంది. అదికూడా స్థిరబుద్ధి గల వాడికి పట్టించదు. శోక సంవిగ్న మానసులకు పట్టిస్తుంది. కనుక అశౌచ దినాల్లో పూజా ద్రవ్యాదులు తాకకుండా మంత్ర, జప, ధ్యానాదులు నిర్భీతిగా చేసుకోవచ్చు. చేసుకున్నందువల్ల అశౌచం త్వరగా తొలగిపోతుంది. ఆ ఇంట్లో ఇంకొకళ్ళు నిర్విఘ్నంగా పూజ జరపడం కూడ చాల మంచిది. అది పనికిరాదంటే అశౌచ వాతావరణాన్ని ఎక్కువ చేసుకొనడమే అవుతుంది.

ఇక సంవత్సరసూతకం ఉంటుందని ఆ సంవత్సరంలో పుణ్యక్షేత్రాదులు దర్శించడం పనికిరాదని అనడంలో అర్థమేలేదు. పుణ్యక్షేత్రాల్లో ఉన్న

వాళ్ళకి సూతకం వస్తే ఊరు వదలి వెళ్ళిపోవలసి ఉంటుందా! అదీ కాక దహనం చేసిన రోజునే స్మశానం నుండి సూటిగా శివాలయానికి వెళ్ళి శివలింగం దగ్గర దీపదర్శనం చేయాలని ఉంది. శివాలయం పుణ్యక్షేత్రం కాక, పాపక్షేత్రమా?

## చెడ్డ నక్షత్రంలో పోతే ఇల్లు మూయాలా?

వ్యక్తి : ఎవరైనా చెడ్డ నక్షత్రంలో పోతే ఆ యిల్లు కొన్ని నెలలు మూసి వేయాలంటారు. నిజంగా అలాచేయాలా మాస్టారూ?

మాస్టరుగారు : చెడ్డ నక్షత్రంలో పోవడం తప్పయితే పోయేవాళ్ల ఎలా పోతున్నారు? వాళ్ళ చేతుల్లో ఉన్న విషయం కాదు గదా అది! ఒకడు వర్జ్యంలో పుట్టాడనుకోండి! వాడిని అవతల పారెయ్యరు గదా! నక్షత్రాలు చెడ్డవి, మంచివి అన్న విషయం ముహూర్తానికి సంబంధించినది. జనన మరణాలకు సంబంధించినది కాదు. కనుకనే ఋషిప్రోక్త గ్రంథాల్లో ఎక్కడా లేదు. ఇక నిర్ణయసింధు మొదలైన గ్రంథాలు పండిత ప్రోక్తాలే కాని, ఋషి ప్రోక్తాలు కావు. పండితుల మార్గం కావాలా, ఋషులమార్గం కావాలా అన్నది ఎవరికి వారు నిర్ణయించుకోవాల్సిందే.

## గరుడ పురాణం మామూలుగా చదవకూడదా?

వ్యక్తి : గరుడపురాణం ఎవరైనా పోయినపుడు తప్ప మామూలు రోజుల్లో సామాన్యంగా ఎవరూ చదవరు, చదవనివ్వరు. దీనికి కారణం ఏమైనా ఉందా? మిగిలిన పురాణాలలాగ దీనిని మామూలుగా చదువుకోకూడదా?

మాస్టరుగారు : గరుడపురాణం ఎవరన్నా చనిపోయిన తరువాత చదువుతారు. కనుక, మిగిలిన సమయాల్లో చదవరాదని అనుకొన్నారు. ఈ

విషయం గరుడపురాణంలో గాని,ఏ ఇతర పురాణాల్లోగాని లేదు. పైపెచ్చు గరుడపురాణ పఠనం సకల శుభప్రదమని, భోగమోక్ష ప్రదాయమని, సకల పాపహరమని, ఆయుష్యమని ఆ పురాణంలోనే చెప్పబడియుంది. నన్నయ భట్టుగారు అరణ్యపర్వం వ్రాస్తూ చనిపోయారు గనుక అరణ్యపర్వం మంచిది కాదని అనుకోవడంలో ఎంతటి సత్యం ఉందో దీనిలోనూ అంతేఉంది. పింగళి సూరన్న గరుడపురాణం తెనిగించానని వ్రాసుకున్నాడు. అది "జనములే మెచ్చగ" రచించితినని గర్వంగా చెప్పుకున్నాడు. అంటే ఆ మెచ్చిన జనము అందరికీ బంధు శోక కాలంలోనే వినిపించి ఉంటాడని అనుకోలేం కదా! ఈ పద్యాన్ని బట్టి గరుడపురాణాన్ని ఉదంచద్వైఖరిలో రచించాక కూడా తాను జీవించియుండి ఈ పద్యం వ్రాసినట్లు తెలుస్తోంది. ఆ తరువాత ప్రభావతీ ప్రద్యుమ్నం వ్రాశాడు కూడాను. గరుడపురాణం అతని ప్రథమ రచనగా కనిపిస్తుంది. తరువాత అనేక సత్కావ్యాలు రచించి బ్రతికి బట్ట కట్టినట్టు తెలుస్తుంది. సూరనవంటి సత్కవికి లేని భయం మనకి పట్టుకు ఎందుకు?

*

# D. పునర్జన్మల తీరుతెన్నులు

## మృత్యువుకు, పునర్జన్మకు మధ్య కాలమెంత ?

వ్యక్తి : మాస్టరుగారూ! ఒక జీవిదేహం వదిలిన తరువాత మళ్ళీ దేహం ధరించేలోపున కాలపరిమితి సుమారు ఎంత ఉంటుంది? అది దేనిని బట్టి నిర్ణయ మవుతుంది ?

మాస్టరుగారు : ఒక జీవి దేహం వదిలిన తరువాత మళ్ళా దేహం ధరించే లోపున కాలపరిమితి అందరికీ ఒకే లాగ ఉండదు. ఆ జీవియొక్క పరిణామ స్థితిమీద, అప్పటి సంస్కారం మీద ఆధారపడి ఉంటుంది. దాన్ని అనుసరించిన కార్యక్రమం ఆ ముందు జన్మలో ఎలా అంతమైందో దాన్నిబట్టి ఉంటుంది. నిర్లిప్తత, మానసిక నిశ్చలత, వైరాగ్యం, నిత్య సంతోషం సిద్ధించిన వారికి అన్నికోశాలు పరిపూర్ణ మృత్యువును పొందు తాయి. ఆ కోశాలమధ్య జీవించిన పురుషుడు ఆకాశమైపోతాడు. అంటే ఇక పుట్టడు. ఇదే జన్మరాహిత్యం, లేక మోక్షం.

మృత్యువు అన్నికోశాలకి సంభవించక కొన్ని ప్రజ్ఞల పొరలు ఉండిపోయినవాళ్ళు ఎక్కువ మంది ఉంటారు. ఆ పొరలలో అంతకు ముందు అసంపూర్ణమైన కార్యక్రమం సంస్కార రూపంగా మిగిలి ఉంటుంది. దానిని పూర్తిచేయాలనే పట్టుదలకూడా సంస్కారంగా ఉంటుంది. అది ఆ కోశాలను పట్టిఉంచుతుంది. ఈ కోరిక బరువువలన మరల భౌతిక పదార్థం పై పునః ఆకర్షించబడటం జరుగుతుంది. క్రిందటి కార్యక్రమం ఎంత తొక్కిడిగా వదిలిపెట్టబడితే అంత తొందరగా మళ్ళీ శరీరంలోకి దిగు తారు. మనస్సుకి, ఇంద్రియాలకి, కోరికలు, రాగద్వేషాలు, ఆస్తిపాస్తులపై ఆశలు గట్టిగా ఉన్నవాళ్లు అంటే పశువుల్లా జీవించిన మనుషులు ఒక సంవ త్సరం దాటుతూ ఉండగా మళ్ళా తల్లి దండ్రుల్ని వెతుక్కునేందుకు సిద్ధ

పడతారు. అంతకుముందు పేచీకోరులుగా జీవించి ఉంటే ఆ కసితో తనకు వ్యతిరేకలక్షణంగల తల్లిదండ్రులకు బిడ్డలై పుడతారు. ఆ జన్మ శత్రుత్వాలతో పగసాధిస్తూ దేహం విడిచినవాళ్ళు తన స్వభావానికి గర్భ శత్రువులైన స్వభావాలు గల తల్లి దండ్రులకు పుడతారు. పుట్టిన మొదలు వాళ్ళని ఏడిపిస్తూ,వాళ్ళచేత తన్నులు, తిట్లు తింటూ పెరుగుతారు. ఇలాంటి వాళ్ళంతా సంవత్సరం కాగానే దిగివస్తారు. బహుశా ఇలాంటి వాళ్ళకోసమే కాబోలు తద్దినాలు సంవత్సరాంతాన అదే తిథి నక్షత్రాలనాడు పెద్దలచే నిర్ణయింపబడతాయి. కానీ వాడు ఆ బిడ్డలకే కొడుకుగా పుట్టాలని ఎక్కడాలేదు. ఇతరులతో మైత్రిని, సజ్జనత్వాన్ని సాధించుకొన్న వాళ్ళు తమ బిడ్డలకే బిడ్డలుగా పుట్టవచ్చు. అది కూడా ఆ బిడ్డలు సాధు శీలం గలవాళ్ళు, పరిశుభ్రమైన ప్రవర్తన గలవాళ్ళు అయితేనే జరుగుతుంది.

పరిస్థితులు, చుట్టరికాలు, ఆస్తిపాస్తులు మొదలైన వాటిని అంతగా పట్టించుకోని మధ్యమ వైరాగ్యం గల వాళ్లు పుట్టడానికి చాలా కాలం పడుతుంది. వారి నిర్లిప్తత ననుసరించి ఈ కాలపరిమితి ఐదువేల సంవత్సరాలు దాకా పొడిగింపబడవచ్చు.

ఇక మూడవ తరగతి — యోగసిద్ధులు, జితేంద్రియులు, శమదమాది గుణ సంపన్నులు, తమకోశములపై స్వామిత్వము సాధించినవారు కాలపరిమితికి కట్టుబడరు లోకశ్రేయస్సు ననుసరించి అవసరాన్నిబట్టి బుద్ధిపూర్వకంగా దిగి వస్తారు. వారే పరమగురువులు మొదలైనవారు. అవసరమైతే అట్టివారు దేహం విడిచిన ఇరవైనాలుగు గంటల తరువాత ఎప్పుడైనా గర్భస్థులు కావచ్చు. లేదా యుగాలతరువాతైనా దిగి రావచ్చు. 'జ్వాలాకూల్ మహర్షి ఒకే దేహంతో మూడు వేర్వేరు జీవితాలు జీవించాడు. మొదటి ప్రపంచ సంగ్రామంలో సైనికుడుగా భౌతికంగా పనిచేశాడు. అదే రోజులలో తీరుబడి వేళల హిమాలయాల్లోని కులూ లోయ దగ్గర ఒక గ్రామంలో

గృహస్థుగా ఉంటూ పాలేళ్ళతో వ్యవసాయం చేయించేవాడు.అతడేయితడని ఎవరికీ తెలియదు. రెండు వేర్వేరు పేర్లతో మెలిగాడు. గ్రామంలో వాళ్ళకి అతడి యుద్ధ జీవితం తెలియదు. యుద్ధంలో వాళ్ళకి, అతడు భారతీయుడనే తెలియదు. బెల్జియం వాస్తవ్యుడుగా చలామణీ అయ్యాడు. అదే జన్మలో ఇంగ్లండులోనూ, అమెరికాలోనూ ఉన్న 'యాలిస్. ఎ. బెయిలీ' అనే శిష్యురాలికి, ఆమె అనుయాయులకు దూరదృష్టి, దూరశ్రవణాలతో గ్రంథాలు డిక్టేట్ చేసి అచ్చువేయించాడు. ఆ శిష్యులకు మాత్రం తన మొదటి రెండు పేర్లు తెలియనీయక మూడవ పేరుతో వ్యవహరించాడు. ఆ పేరే జ్వాల్ కూల్. జ్వాల్ కూల్ పుస్తకాలు తెలిసిన వాళ్ళకి ఆ వ్యక్తిఎవరో తెలియదు. తన గ్రామంలో వాళ్ళకి,యుద్ధంలో వాళ్ళకి అతనికి జ్వాల్‌కూల్ అన్నపేరు ఉన్నట్లే తెలియదు. ఒక్క యాలిస్. ఎ. బెయిలీకి మాత్రం మూడు పేర్లు, వ్యక్తీ కూడా తెలుసు. బ్లావెట్‌స్కీకి రైతు జీవితంలో వ్యక్తి, జ్వాల్‌కూల్ అనేపేరు తెలుసు. చాలాసార్లు ఆమెకు అకస్మాత్తుగా రోడ్డుమీద కనబడి కుత్‌హూమీగారి ఉత్తరాలందించి పోయేవాడు.చూపించమని వేధించిన లెడ్ బీటర్‌కి కలలాంటి స్థితిలో మాత్రం దర్శనం యిచ్చాడు. అట్టివిచిత్ర వ్యక్తి 1925 ఆగస్టులో దేహం విడిచి 1926 లో మళ్ళీ దేహం ధరించాడు. ఇలాంటి వారికి కాలపరిమితి నిర్ణీతం కాదు. మిగిలిన వాళ్ళంతా పూర్వ కర్మను బట్టి ఎవరి పరిమితి వాళ్ళు ఏర్పరచుకుంటారు.

ఇక నాల్గవ తరగతి. తీవ్ర విరోధాల్లో హత్యలు చేయబడ్డ వాళ్ళు, ఆకస్మిక దుర్మరణాలు పొందినవాళ్ళు, భార్యా పిల్లల మీద అతి తీవ్ర మమకారాలు కలిగి రైలు ప్రమాదాలు మొదలైన పరిస్థితులలో ఇల్లు చేరకుండా దుర్మరణం పొందినవాళ్లు పూర్తిగా చావడం కష్టం. వాంఛల పటుబలంతో సూక్ష్మకోశాలన్నీ ప్రజ్ఞను పట్టి వదలవు. వాళ్ళు తమకు ఆపేక్ష ఉన్న స్థలానికి ఆకర్షింపబడి అక్కడ ఇరుక్కుపోతారు. ఇంటిలో అనుకూలమైన తావునో, చెట్టునో బావినో నివాస స్థలంగా ఏర్పరచుకొని ఉంటారు. ఇలా

కొన్ని వందల సంవత్సరా లుండవచ్చు. ఎవరైనా యోగశక్తిసంపన్ను లెంపకాయ కొట్టినట్లు ప్రక్రియ చేస్తేగాని వీళ్ళు పిశాచత్వంనుండి మేల్కొ ఆ కోశాలు విడిచి ఇవతలకు రాలేరు. ఈ లోపున దుర్బల మనస్కుల దే లను ఆవేశించి ఆ దేహాల ఆధారంతో తమ కోర్కెలు తీర్చుకుంట ఉంటారు. లేదా పాములు, తేళ్ళు, పక్షులు తమ ఉపాధులుగా స్వీకరిం శత్రుత్వం కలవారిని హింసపెడుతూ ఉంటారు. అలాంటి ఇళ్ళలోనే నవ లేనంత తరచుగా పాములు, తేళ్లు వస్తూ ఉంటాయి. ఆ పామును చంపి ఇంకొక పామును ఆవేశించి శత్రువు ఇంటిలోనికి తోలుకొని వస్తాయి వీళ్ళకి కూడా అతిదీర్ఘమైన కాలపరిమితి ఉంటుంది.

వ్యక్తి : సూక్ష్మమైన అంశాలను సులువుగా కావలసినంత వివరం చెప్పారు మీరు. ఈ విషయాలు మీరు చెపుతుంటే మీతో పాటు మేమ కూడా ఆయా లోకాలలో ఆయా సత్యాలను దర్శనం చేస్తున్నట్లుగా ఉంది మీ వాక్కులే కిరణాలై మాకా లోకాలను చూపిస్తున్నాయి. ఆ లోకా సన్నివేశాలతో మాకు సన్నిహితత్వాన్ని పెంచుతున్నాయి.

## అనుకున్న వారికి పుట్టగలమా ?

వ్యక్తి: దేహం ధరించబోయే జీవి తాననుకున్న తల్లి దండ్రులక పుట్టడం సాధ్యమౌతుందా మాస్టారూ ?

మాస్టరుగారు : మనస్సులో ద్వేషాలు, శత్రుత్వాలు, అకారణ దుర్జ నత్వం ఉన్నవాళ్ళకి ఏదీ తమ వశంలో ఉండదు. దేహంలో ఉండగానే వశంలో లేనపుడు, దేహంవిడిచిన తరువాత తల్లిదండ్రులను ఎన్నుకోవడం వశంలో ఎలా వుంటుంది? అలాకాక శాంత స్వభావులు, దీర్ఘ కోపాదుల లేనివారు, ఈర్ష్యాసూయలు లేనివారు, ఆపేక్షలుమాత్రం ఎక్కువగా ఉన్న వారు, తమకు ప్రీతి పాత్రుల గర్భాల్లో పుడతారు. అప్పుడు కూడా అక్క

వుల దేహాల్లో జీవిస్తారు. వాళ్ళ పెంపుడు కుక్కలు మొదలగు జన్మలెత్తి మాట్లాడుతూ ఉన్న నరులనుచూచి, అన్నీ గ్రహిస్తూ మాట్లాడలేక నరక బాధ అనుభవిస్తారు. ఒక్కొక్కప్పుడు అధ్యాత్మిక ప్రసంగాలు, భక్తి ప్రసంగాలు, భజనలు, పూజలు జరుగుతూ ఉన్నచోటుకి వచ్చిపడుతుని వింటూ ఉండే కుక్కలు, పిల్లులు అలాంటి జన్మలే. వాటిని కొట్టి తోలేస్తూ ఉంటారు. ఆ జీవులు చెప్పుకోలేక బాధపడుతూ జీవిస్తూ ఉంటారు. ఆహా రానికి కాకుండా వినోదానికి వేటాడినవాళ్ళు కూడా వేటాడబడే జంతువు లుగా పుడతారు. ఇలాంటి ప్రత్యేక సందర్భాల్లో తప్ప సామాన్యంగా నరులకు జంతుజన్మలు రావు.

వ్యక్తి : అయితే మనం పురాణాల్లో వినే శాపకథలు నిజమే నన్న మాట.

మాస్టరుగారు : ఓ! అక్షరాలా అక్కడ వాళ్ళ పాపం శాపంగా రూపొంది శిక్షననుభవింపచేస్తోందన్న మాట.

## పురుషుడు స్త్రీగా, స్త్రీ పురుషుడుగా పుట్టే అవకాశం ఉందా?

వ్యక్తి : మాస్టరుగారూ! ఒక జన్మలో పురుషుడుగా పుట్టినవాడు మరొక జన్మలో స్త్రీగాను, ఒక జన్మలో స్త్రీగా పుట్టిన జీవి తరువాత జన్మలో పురుషుడుగాను పుట్టడానికి అవకాశం ఉందా? ఇలాంటి తారుమారు సాధ్య మేనా?

మాస్టరుగారు : పురుషదేహం, స్త్రీ దేహం అనే భేదం కేవలం ఉత్పత్తి సౌకర్యానికి గాను ప్రకృతి ఏర్పాటు చేసినదేగాని జీవుడికి సంబం ధించినది కాదు. ఏ దేహంలోనైనా జీవుడు ఒక్కడే. కాని మానసిక సంస్కారాల ననుసరించి స్త్రీదేహంగాని,పురుషదేహంగాని సంక్రమిస్తుంది.

సగటున చెప్పాలంటే ఒక జన్మ స్త్రీ దేహం, తరువాత జన్మ పురుష దేహం రావడం ఎక్కువ పరిపాటి. కారణ మేమంటే స్త్రీ జన్మలో పురుషుణ్ణి ప్రేమించడం, పురుష జన్మలో స్త్రీని ప్రేమించడం సంస్కారంగా ఏర్పడి, దేహాంతంలో ఆ ప్రేమింపబడిన సంస్కారం ప్రకారం దేహం వస్తుంది. పురుషద్వేషం గల స్త్రీలకు, స్త్రీ ద్వేషం గల పురుషులకు దీనికి వ్యతిరేకంగా జరుగుతుంది. ఈ ద్వేషం తీవ్రతరమైతే మాత్రం పురుష లక్షణాలు గల స్త్రీ, స్త్రీ లక్షణాలు గల పురుషుడుగా పుడతారు. అంతే కాక ఆస్తిపాస్తులు, వ్యవహారాలు నడిపడం, ఇంట్లో అధికారం చెలాయించడం అలవాటయిన స్త్రీ, పురుష జన్మ ఎత్తుతుంది. అలాగే స్త్రీలోలుడైన దుర్బల మనస్కుడు స్త్రీ జన్మ ఎత్తుతాడు. అలాంటి జన్మలే అడంగిలేకిగా నున్న పురుషులు, మగరాయుళ్ళగా నున్న స్త్రీలు అవుతారు.

ఇక సాధు జనుల విషయంలో చెప్పాలంటే రక్షణ పోషణల బాధ్యతలు వహించినవాళ్ళు పురుషులుగాను, పిల్లల పెంపకం, ఇల్లు తీర్చుకొనడం, శ్రద్ధవహించిన వారు స్త్రీలుగాను పుడతారు. ఇక సిద్ధులు మాత్రం తమ కార్యక్రమానికి ఏ జన్మ అవసరమైతే ఆ శరీరం ధరిస్తారు.

వ్యక్తి : స్త్రీ పురుషులలో వీ రెక్కువ, వారు తక్కువ అని మనం ఎంచుకోవడమే గాని జీవి ఎప్పుడు ఏ శరీరాన్నైనా ధరించవచ్చునన్న మాట. ఈ సత్యం తెలిస్తే ఇక మానవులు ఒకళ్ళ నొకళ్ళు ఎంచుకోవడ మంటూ ఉండదు. స్త్రీల హక్కులని, పురుషుల పెత్తన మని కొట్టుకోవడం కూడా ఉండదు. చాలా బావుంది మాష్టారూ! మీలాంటివారు ఇలాంటి సత్యాలను విప్పి చెపుతుంటే లోకంలోని అర్థంలేని సమస్యలన్నీ ఇట్టే సర్దుకుంటాయి.

## దంపతులు మళ్ళీ దంపతులవుతారా?

వ్యక్తి : మాస్టరుగారూ! ఒక జన్మలో దంపతులైనవాళ్లు తరువాత జన్మలో కూడా దంపతులుగా కొనసాగే అవకాశం ఉంటుందా? మనవాళ్ల దాంపత్యం జన్మజన్మల అనుబంధం అంటూంటారు గదా! అది నిజమేనా?

మాస్టరుగారు : దాంపత్యం అనేది చాలామంది విషయంలో మానసిక కక్ష్యకు, ఆవేశ కక్ష్యకు అనగా కామ కక్ష్యకు ఎక్కువగా సంబంధించి వుంటుంది. ఈ కక్ష్యలకు ఒక జన్మలోనే నిరంతరత్వం ఉండదు గనుక ఆ దాంపత్యం ఆ జన్మతోనే సరి. ఆ జన్మలోనే విడిపోయిన వారెందరు లేరు? ఇలా ఎక్కువ మందిలో దాంపత్యం ఒక రైలుపెట్టెలో ప్రయాణీకుల స్నేహంలాగే అంతం అవుతుంది. దాంపత్యానికి కారణం కామమో, మానసిక పరిచయమో, ఆస్తిపాస్తుల సదుపాయమో, చాకిరీ మొదలగు సౌకర్యాలో అయినపుడు వ్యభిచార సంసారంలాగా ఏ జన్మ కాజన్మే.

అరుదుగా కొన్ని దాంపత్యాలలో ఆత్మ మైత్రి ఏర్పడుతుంది. ఈ మైత్రి కారణాలమీద ఆధారపడి వుండదు. ఉదాహరణకి వివాహానంతరం భార్యకు మశూచికంపోసి కోతి మొహంలాగ తయారైతే వారి స్థితికి కరగిపోయి తమ జన్మలో జాలి అంతా వారి కర్పించి ప్రాణప్రదంగా చూచుకొనే భర్తలుంటారు. అలాగే భర్తకు కుష్టు మొదలైన వ్యాధులు వస్తే పేరిమార్ద్రితతో వారికి సేవచేస్తూ ఉద్యోగం చేసికూడ భర్తను పోషించుకునే భార్య లుంటారు. అలాంటి వాళ్ళలో కొందరు ఆ లోపించిన సౌఖ్యాన్ని వారికి చేకూర్చాలని జీవితం ధారపోస్తారు. దాని పరిపూరణకై వాళ్ళు మళ్ళా దంపతులుగా పుడతారు. అప్పుడు కూడా అందరూ దంపతులుగా పుట్టనక్కరలేదు. అన్నా చెల్లెళ్ళుగానో, తల్లీ బిడ్డలుగానో పుట్టవచ్చు లేదా పాణమిత్రులు కావచ్చు. ఎలాంటి సంబంధం ఇద్దరికీ సదుపాయమో అలాంటి సంబంధంలో జన్మలెత్తవచ్చు. దాంపత్యం అనేది కామ ప్రధా

సంగా ఉన్న వారికి మాత్రమే అది ఒక ప్రత్యేక సంబంధం. కామం యాదృచ్ఛికం అయిన వారికి ప్రేమ పాత్రమైన ఏ సంబంధమైనా ఒక్కటే. కనుక ఎలాగైనా పుట్టవచ్చు.

వ్యక్తి : చాలా లోతులు చూపించారు మాస్టారూ! మీ విశ్లేషణ చాలా చక్కగా ఉంది. ఏం జరుగుతుందో చెపుతూనే ఎలా ఉంటే నిజమైన జీవితాన్ని అనుభవించగలమో కూడా మీరు మాకు సూచిస్తున్నారు. మీ సమాధానాలు మాకు సందేహాలను తీర్చటమే కాకుండా మమ్మల్ని సరైన మార్గంలో పడేటట్లు కూడా చేస్తున్నాయి.

మాస్టరుగారు : అడిగే వ్యక్తి ఏ దృష్టితో అడిగితే ఆ దృష్టికి తగిన సమాధానం వస్తుంది. నీవు మానవ జన్మకు పరిపూర్ణత సిద్ధించడం ఎలాగ అన్న మంచి ఆశయాన్ని దృష్టిలో పెట్టుకొని అడుగుతున్నావు గనుక నీకు వచ్చే సమాధానాలు కూడ అంత పరిపూర్ణంగాను ఉంటాయి. పాత్రను బట్టి జలం ఇమిడినట్లే పాత్రతను బట్టి సమాధానం లభిస్తుంది.

## ఏ కులంవారు ఆ కులంలోనే పుడతారా?

వ్యక్తి : మాస్టరుగారూ! ఒకసారి ఒక కులంలో పుట్టిన వ్యక్తి తరువాత జన్మలో అదే కులంలో పుడతాడా? ఈ కులాలకు, జన్మలకు ఏమైనా సంబంధం ఉన్నదా? కులవృత్తిని ఆచరించిన వాడూ, ఆచరించని వాడూ ఎలాంటి ఫలితాలను పొందుతారు?

మాస్టరుగారు : కులాలకి, వర్ణాలకి సంబంధంలేదు. కులాలు వృత్తిని బట్టి ఏర్పడిన తరాలు. కులవృత్తిని చెదరగొడితే సంఘానికి వృత్తి సాంకర్యం ఏర్పడుతుంది. అంటే ఎవడూ ఏ వృత్తినీ తిన్నగా చేసుకోలేని అన

మర్థత ఏర్పడుతుంది. ఈ జన్మలో అవలంబించిన వృత్తి కులవృత్తి అయితే సహజమైన ప్రావీణ్యం అబ్బుతుంది. అది సంస్కారంగా వచ్చే జన్మలో సంక్రమిస్తుంది. అంటే ప్రావీణ్యం సంక్రమిస్తుంది గాని అదే వృత్తి సంక్రమించ నక్కరలేదు. ఏ వృత్తి సంక్రమించినా పూర్వజన్మలోని ప్రావీణ్యంతో శోభిల్లుతుంది. కులవృత్తి చెదర గొట్టుకుని క్రొత్తగా మరి యొక వృత్తిని ఏర్పాటు చేసుకున్నవాడు ప్రావీణ్యంకోసం ప్రాకులాడటం జరుగుతుంది. ఈ ప్రాకులాట సంస్కారం వచ్చే జన్మలో పీకులాటగా పరిణమిస్తుంది. అలాంటి దుస్సంస్కారం వలన ఏ వృత్తిమీదా నిష్ఠ కుదరదు. గుమస్తాపనికో, ఉద్యోగానికో పనికివస్తాడు గాని ఉపయోగపడే పని చేయడానికి కావలసిన సమాధి (continuity) కుదరదు. దీనినిబట్టి తెలుసుకోవలసిన దేమిటంటే ఏ కులంలోవాడు ఆ కులంలోనే పుట్టడని, తన కుల వృత్తి నారాధించేవాడు వచ్చే జన్మలో వృత్తి ప్రావీణ్యం వహించి ఇహపర సౌఖ్యాలను గడించుకుంటాడని, ఉదాహరణకి పది సంవత్సరాలు వైద్య విద్య నిష్ఠతో అభ్యసించినవాడు ఆ తరువాత సంవత్సరాలలో ఏ క్రొత్త విద్యనైనా ప్రావీణ్యంతో గడిస్తాడు. అలాగే ఒక జన్మలో ఒక కులవృత్తిలో నిష్ఠ కుదిరిన వాడికి వచ్చే జన్మలో లభించే క్రొత్త కుల విద్యకి ఈ నిష్ఠ తోడై నిలుస్తుంది.

వ్యక్తి : తనకు ప్రకృతి ప్రసాదించిన కులవృత్తిని ఆరాధించినవాడు పరిణామ క్రమంలో పట్టాలు తప్పకుండా పయనించగలడన్నమాట.

## ఏ దేశంలోవారు ఆ దేశంలోనే పుడతారా ?

వ్యక్తి : మాస్టరుగారూ! ఒకసారి ఒక దేశంలో పుట్టినవాడు మళ్ళీ ఆ దేశంలోనే పుడతాడా! మరి ఏదేశంలోనైనా పుట్టడానికి అవకాశం ఉందా?

మాస్టరుగారు: దేశాల విభాగానికి, జన్మలకు ఏ విధమైన సంబంధం లేదు. దేశాల సరిహద్దులు, రాజకీయాలు, రాజ్యాంగాలు మొదలైనవి మానవ నిర్మిత విభాగాలకు సంబంధించినవి. అన్ని దేశాల వాళ్ళకి ఆహార నిద్రా భయాది ధర్మాలు ఒక్కటే. భారతీయ కామం, ఇంగ్లీషులో సంసారం చేయడం, హిందీలో నవ్వడం అనేవి ఎలా హాస్యాస్పదాలో అలాగే ఆ దేశంలో పుట్టడం, ఈ దేశంలో పుట్టడం కూడా. దేశ విభాగాల వంటివే జాతి విభాగాలుకూడా. ఇవికాక ప్రకృతిసిద్ధమైన జాతులవిభాగాలున్నాయి. అవే తెల్లజాతి, నల్లజాతి, నీగ్రోజాతి, మంగోలియా జాతి మొదలైన విభాగాలు, ఇవి స్వభావ భేదాలు కలిగి ఉంటాయి. తెల్లజాతి వాడి స్వభావం నల్ల జాతివాడి స్వభావం వేర్వేరుగా ఉంటాయని మన మెరుగుదుము.

ఈ భూగోళం మీద ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క జాతి పుడుతుంది. ఈ భేదం భూసార భేదాన్ని బట్టి శీతోష్ణ స్థితులనుబట్టి, అక్షాంశ రేఖాంశములనుబట్టి, ఆయా ప్రదేశాలకు ఇతర గ్రహాలతో గల సంబంధాన్ని బట్టి ఉంటుంది. చెట్లు, జంతువులలో కూడా ఈ భేదమున్నది. భారతదేశంలో తాటిచెట్లు, కొబ్బరిచెట్లు, మర్రిచెట్లు, రావిచెట్లు పెరగడం సహజం. చలిదేశాలలో ఐరోపా మొదలైన ఖండాలలో పైన్ చెట్లు, ఓక్ చెట్లు పెరగడం సహజం. అక్కడ వంకాయలు, బీరకాయలు, మిరపకాయలు, అరటికాయలు మొదలైనవి ఉండవు. గేదెలు, దున్నలు ఉండవు. ఆ దేశాల ఆవులు మన దేశాల పెద్దసైజు గొర్రెలలాగ ఉంటాయి. ఇలాంటి జాతి భేదమే నరుల్లో కూడా ఉన్నది. దీని వెనుక మరొక రహస్యం దాగి ఉన్నది. జంతువులలో నుండి పరిణామ దశలలో ఉత్తమ పరిణామం చెందే లోపున ఒక్కొక్క జాతిలో జన్మలెత్తుతాడు. ఒక్కొక్క జాతికి ఒక్కొక్క పరిణామస్థితి ఉండటమే దీనికి కారణం. ఒక్కొక్క జాతిలోని అపరిపూర్ణ లక్షణాలనుండి పరిపూర్ణతను ఆర్జించుకునే వరకు ఆ జాతిలో జన్మిస్తూ ఉంటాడు. అటుపైన కొంచెం ఎక్కువ పరిణామం గల

జాతిలోకి వస్తాడు. ఇలా అన్ని జాతులు తిరిగి వస్తేనేగాని నరుడు పరిపూర్ణత చెందడు. ఇంతలో శతాబ్దాల తరబడి ఒక్కొక్క గుంపు జంతువులు ఒక్కొక్క గుంపు నరులుగా ఒక జాతిలో పుట్టి అక్కడనుండిజాతినుండిజాతికి ప్రయాణం చేస్తారు. ఈగణాలను ఈజాతుల క్రమాలలో నడుపుకుంటూ వెళ్ళే అధినాథుడైన ఒక పరిపూర్ణనరుడుంటాడు. అతనికి ఈ భూమికి సంబంధించి నంతవరకు "మనువు" అని పూర్వులు పేరుపెట్టారు. అతని పని ఈ జాతుల నిచ్చెనమీద నరులను నడిపిస్తూ ఉండటమే అంతేకాక ఏ రెండు జాతులలోని ఉత్తమ గుణాలనైనా కలిపి కొత్త జాతులను కూడ అంట్లు గట్టి పరిణమింప జేస్తాడతడు. అతడు అలా సంకల్పించిన శతాబ్దాలలోనే ఎక్కువగా రెండుజాతుల వారు రాజకీయంగాగాని, వాణిజ్య పరంగాగాని కలుసుకొనడం, అంతర్జాతీయ వివాహాలు ముమ్మరంగా జరగడం సంభవిస్తుంది. ఈ పెద్ద ప్రణాళిక ననుసరించిన క్రమంలో మాత్రమే ఒక జాతివారు, ఇంకొక జాతిలో పుడుతూ ఉంటారు. ఈ ప్రక్రియకి దేశాల విభాగంతో గాని, రాజకీయమైన జాతుల విభాగంతోగాని ఏమీసంబంధంలేదు. అంతే కాదు. మన నమ్మకాలతో గాని, వివాహ నిబంధనలతో గాని, పూర్వాచార పరాయణతతో గాని ఎట్టి సంబంధము లేదు. ఆచారపరుడైన చర్చి క్రైస్తవుడుగా పుట్టి ఒకడు మిగిలిన వారిని పాపులని భావించడం అభ్యాసం చేసి, అదే సంస్కారంతో పట్టుదల గల హిందువుడుగా పుట్టి మిగిలిన వారిని అస్పృశ్యు లంటాడు. అలాగే మడి కట్టుకొని దూర దూరంగా బ్రతికిన ఆచారపు హిందువుడు ఆవేశపరుడైన మహమ్మదీయుడుగా పుట్టి మిగిలిన వాళ్ళని కాఫర్‌లు అని ద్వేషించి అస్పృశ్యులుగా భావిస్తాడు. సంస్కారాలు క్షీణం కాబోయే ముందు జన్మల లీలలు ఇలా వుంటాయి. అలాకాక ఏ జాతి వాళ్ళని, ఆ జాతిలోనే మళ్ళా మళ్ళా ప్రకృతి పుట్టనిస్తే ఏమౌతుందో తెలుసా! రోజూ అన్నం తింటూ ఆ పదార్థం ఏదీ దేహంనుండి బయటకు పోకూడదు అన్నవాడి గతి ఏమౌతుందో అంతే అవుతుంది. ఇంతకీ జన్మలను కల్పించటంవల్ల ప్రకృతి నరులకు ఉత్తమ గతిని ఉద్దే

శిస్తున్నదని మరచిపోరాదు. జనన మరణాలు దేహాలకి ఏర్పరచడంలో ప్రకృతి ఉద్దేశ్యం దేహియొక్క పురోగమనమే. దాని ననుసరించి ఎవడు ఎక్కడైనా పుట్టవచ్చు.

వ్యక్తి: మాస్టరుగారూ! ఈ మీ వివరణ మాకు విశ్వరూప సందర్శనాన్ని ప్రసాదించింది. సృష్టి పరిణామం, ఆ పరిణామ క్రమంలో జీవుల కొరకు అమర్చబడిన జాతుల నిచ్చెన, ఆ నిచ్చెన మీదుగా జీవులకు చేయూత నిస్తూ ముమ్ముందుకు నడిపిస్తున్న మహాత్ముడైన మనువు, అతని లీలలు స్పష్టంగా దర్శన మిచ్చాయి. మీరు నోరువిప్పినంత మాత్రాన మాకు ఇన్ని వ్యూహాలు దర్శనమిచ్చినట్లే, ఆనాడు యశోదకు కృష్ణుడు నోరు విప్పగానే భువన భాండాలు దర్శనమిచ్చి ఉంటాయి. యశోదకు అనుగ్రహించిన దర్శన మెలాంటిదో ఇప్పుడు మాకు అనుభవానికి వచ్చింది. మా జన్మ నిజంగా ధన్యమైంది.

## ఏసుప్రభువు పునర్జన్మ లేదన్నాడా ?

వ్యక్తి: మాస్టరుగారూ ! క్రైస్తవులు పునర్జన్మ నంగీకరించరుగదా! నిజంగా బైబిలుగాని,ఏసుప్రభువు గాని పునర్జన్మలేదని చెప్పడం జరిగిందా?

మాస్టరుగారు : క్రైస్తవ మతస్థులలో తెలియని వారికి పునర్జన్మ లేదేమో చెప్పలేము గాని, క్రీస్తు బోధలలో ఎక్కడా పునర్జన్మ లేనట్లుచెప్పబడలేదు. పునర్జన్మ సత్యం నరజాతి గ్రహించిన తరువాత చాలా వేల సంవత్సరాలకు ఏసుక్రీస్తు జన్మించాడు. తూర్పు దేశాలలో జన్మించి భరత భూమి యందు తపస్సు చేసిన ఏసుప్రభువు పునర్జన్మను గూర్చి విని ఉండడనటం హాస్యాస్పదం, మత క్రైస్తవులకు ప్రమాణ గ్రంథమైన హోలీ బైబిలులో పాత నిబంధన (Old Testment)కి క్రైస్తవ మతానికి ఏమీ సంబంధంలేదు. క్రీస్తు బోధలలో ఏ సహస్రాంశమో కొత్త నిబంధనగా

అతని శిష్యులచేత కూర్పు చేయబడి, వారి అనుయాయులచేత సవరింపబడి నది. సోమరులైన అతని శిష్యులు అతని బోధలలో ఎక్కువభాగము గ్రంథస్థము చేయక ఈ చెవిని విని, ఆ చెవిని విడవటం జరిగింది. ఉన్న బోధలలో అతడు పునర్జన్మ నమ్మినట్లే ఉంది. ఒకనాడు తన శిష్యుల కిలా బోధించాడు. "నరుడు తిరిగి జన్మించిననే గాని భగవంతుని సామ్రాజ్య మును దర్శింపలేడు."

ఏసుప్రభువు పుట్టు గ్రుడ్డివాడికి దృష్టి కలిగించిన సందర్భములో ఒక శిష్యుడిలా ప్రశ్నించాడు. "ప్రభూ! ఇతడు పూర్వం ఏమి చేసినందువల్ల ఇలా గ్రుడ్డివాడైనాడు" అని. దానిని బట్టి క్రీస్తు అనుయాయులకు కూడ పూర్వ జన్మ లున్నవని తెలుసు. చనిపోయిన వారంతా గోరీలలో బంధింప బడి పాప పుణ్య విచారణకై వేచి ఉంటారని, విచారణ నాడు దేవుని పిలు పుతో గోరీలు బ్రద్దలు కొట్టుకొని వచ్చి విచారణపొంది తగిన విధంగా శిక్షింప బడతారని ఏసు చెప్పిన బోధలోని అంతరార్థం కూడ దీనినే సూచిస్తున్నది. జీవులు మట్టితో చేయబడిన గోరీలవంటి దేహాలలో నిద్రావ స్థలో ఉంటారని, మృత్యు సమయాన దేవుని పిలుపుతో ఇవతలకు వస్తా రని, మరణానంతరం వారి పాపపుణ్యాలకు ఫలితంగా నరకం, స్వర్గం ఉంటాయని ఈ బోధలలోని అంతరార్థం. ఈ శతాబ్దంలో కూడ నిజమైన క్రైస్తవులు చాలామంది పునర్జన్మ సిద్ధాంతాన్ని వివరిస్తూ అనేక గ్రంథాలు వ్రాశారు. హెలీనా పెట్రోవా బ్లావెట్‌స్కీ, లెడ్ బీటరుయోగి, అనీబిసెంటు బెర్నార్డ్‌షా, హెచ్. జి. వెల్స్ అంతా పునర్జన్మని విశ్వసించటమే కాక అనేకుల పూర్వ జన్మల వృత్తాంతాలను గూర్చి వ్రాసినవారు కూడాను.

వ్యక్తి: సత్యము ఒకలా ఉండగా, జనంలో ప్రచారం మరియొకలా ఉన్నది. ప్రచారాలనుబట్టి మహానుభావుల, మహర్షుల బోధలు ఇవి అని నిర్ణయించడానికి వీలులేదు. ఒకప్పుడు మతస్థులు గమ్యం చేరడానికి మహాను

భావులు వేసిన సత్యదర్శనమనే మార్గమునుండి తప్పి పోవచ్చును. మరొక ప్పుడు తమ భయాలను, భ్రాంతులను, భ్రిమలను, నమ్మకాలుగా, ఆచారా లుగా మార్చుకొని మహర్షుల బోధలే ఇవి అని నమ్ముతూ దారితప్పి సత్య దర్శనమునకు బదులుగా తమ తమ స్వంత భ్రమలలో చిక్కుకొని పోవుట కూడా జరుగవచ్చు. ఇంకొక ప్రమాదం కూడా ఉన్నది. అవతార పురుషులు చేసిన పొడుపు కథల వంటి ఉపదేశాలకు, తోచిన అర్థాలు చెప్పుకొని అయోమయంలో పడిపోవచ్చు. ఇప్పుడు మీరు వివరించిన గోరీల కథను అర్థం చేసుకోవడంలో ఆ పనే జరిగింది కదా! మీ లాగ వివరించే వారు లభ్యపడక పోతే ఏ మతస్థుడికైనా తమ మతముయొక్క నిజస్వరూపం పూర్తిగా బోధ పడదు అనిపిస్తుంది.

## ఈ జన్మలో పుణ్యం వచ్చే జన్మలో అక్కరకు వస్తుందా?

వ్యక్తి : ఈ జన్మలో దాన ధర్మాలు చేస్తే, పుణ్యకార్యాలు నిర్వ హిస్తే వచ్చే జన్మలో వాటి ఫలితం అనుభవానికి వస్తుంది అంటారు. అది ఏ రూపంలో ఉంటుంది?

మాస్టరుగారు : దానధర్మాదులకు సంబంధించిన పుణ్యఫలం రెండు రకాలు : 1. ఆ దానాదుల వలన మనపై ఇతరులకు కలిగే సద్భావ ఫలము. 2. దానాదులు చేయుటవలన ఆ జీవికి కలిగే సంస్కార ఫలం. అందులో మొదటిది ఈ జన్మలోనే ఫలవంత మౌతుంది. ఒకడు అందరితో మంచిగా ఉంటే అందరూ అతనికి ఏ అవసరానికైనా తోడ్పడుతారు గదా! ఇక రెండవది సంస్కార ఫలం. ఇది రాబోయే జన్మలో తప్పకుండా ఫలిస్తుంది. అంటే సంతోషము, సుఖము, శాంతిగల చిత్తవృత్తి సంక్రమిస్తుంది. చేసిన పుణ్యం నిరంతరంగా చేయబడితే ఈ సంస్కార ఫలం కూడా ఈ

జన్మలోనే సిద్ధించి వచ్చే జన్మకు సంక్రమిస్తుంది. అలాగే చెడ్డ కర్మల ఫలితాలు కూడాను. ఆత్మ అనేది శనగపిండి లాంటిది. దానితో ఇతర వస్తు సంసర్గం వల్ల తియ్యగా ఉండే మైసూరుపాకం చేసుకోవచ్చు. దానితోనే కారంగా ఉండే పకోడీలు చేసుకోవచ్చు. అలాగే ఆత్మ చుట్టూ ఏర్పడే పొరలు బుద్ధిగా, మనస్సుగా, ఇంద్రియ ప్రవృత్తులుగా మంచినిగాని, చెడునిగాని అంటించుకోవచ్చు. అభ్యాసబలంతో దేన్ని అంటించుకుంటే దాని రుచి ఎక్కువ అవుతూ ఉంటుంది. అదే జీవిత సత్యంగా రూపొందుతుంది. అదే కర్మఫలంగా ఈ జన్మలోను, కర్మ సంస్కార ఫలంగా వచ్చే జన్మలోను సంక్రమిస్తుంది.

వ్యక్తి : అయితే మన మాచరించిన కర్మలకు ఫలాలు ఈ జన్మలో పొందితే ఆ కర్మల సంస్కారం వచ్చే జన్మలో పొందుతామన్న మాట. సంస్కారాన్ని బట్టేగదా జీవి ఇష్టా యిష్టాలు, జీవిత విధానం రూపుగట్టుకొంటున్నాయి. కాబట్టి పూర్వజన్మల ప్రభావం మంచిదైనా, చెడ్డదైనా మన మీద విశేషంగానే ఉంటుందన్న మాట.

## అంగవైకల్యాలకు పూర్వజన్మ పాపమే కారణమా?

వ్యక్తి : మాస్టరుగారూ! కొందరు పుట్టుకతోనే కుంటివాళ్లగానో, గుడ్డివాళ్ళగానో, గూనివాళ్ళగానో రకరకాల అంగవైకల్యాలతో పుడుతూ ఉంటారు. ఇలాంటి దుర్భరస్థితులకు పూర్వజన్మలలో వాళ్ళాచరించిన పాప కర్మలే కారణమని మనవాళ్ళు చెప్తుతూవుంటారు. ఈ అభిప్రాయం నిజమేనా? నిజానికి జరుగుతున్నదేమిటి?

మాస్టరుగారు : భౌతిక శరీరానికి ఉన్నరూపం భౌతికం కాదు. ఆ రూపానికి కావలసిన ఫొటో మనస్సు లోపలి కక్ష్యలలో ఒక కక్ష్యలో ఉంటుంది. ఆ ఉన్న రూపంలోకి నింపుకొనటం కోసం మాత్రమే భౌతిక

పదార్థం ఆహారాదుల నుండి ఏర్పడుతుంది. ఆ రూపం చెక్కుచెదరకుండా ఉన్నంత వరకు భౌతిక దేహం చెక్కుచెదరకుండా పుట్టి పెరుగుతుంది. అలా కాక ఒకడు తన శత్రువును కత్తి పెట్టి పొడిచినపుడు ఆ పోటు యొక్క వైఖరి తన మానసిక రూపంలో సంస్కారంగా నిలబడి పోతుంది. వచ్చే జన్మలో తన దేహం ఆ పోటుతో ఏర్పడుతుంది. పుట్టినప్పటి నుండి ఆ భాగంలో దౌర్బల్యం వుంటుంది, ఆ దౌర్బల్యం వైద్యాది ప్రక్రియలతో తీరదు. వైద్యం చాల వరకు భౌతికం, కొంత వరకు ప్రాణమయం, అరుదుగా మాత్రమే మనోమయం కనుక సంస్కారమయమైన ఆ కత్తిపోటు ప్రవేశంలో ఉన్న రోగాన్ని నివారణ చేయడం సాధ్యం కాదు. గుండెలలో పొడిచినవాడికి నివారణకు సాధ్యంకాని, గుండె పోటు రోగం వుంటుంది. చెయ్యి విరగ్గొడితే చేతికిరోగం, కాలు నరికితే కాలికి రోగం లేక వికలాంగత పుట్టుకతోనే సంక్రమిస్తాయి. వానికి కావలసిన కార్యానాకోసం సవాయి మొదలైన రోగాలున్న తల్లి గర్భం తనకు స్థానం అవుతుంది. సిఫిలిస్ వలన వికలాంగుడు, గుడ్డివాడు మొదలైన వారు పుడతారని మాత్రమే వైద్యశాస్త్రానికి తెలుసు. ఆ గర్భంలోనే ఎందుకు పుడతారన్నది పూర్వం చేసిన నేరం సంస్కారం. అలాగే దుర్బుద్ధి, మందబుద్ధి, మొదలైన విషయాలు కూడా. జడులకు, మంద బుద్ధులకు జీవనోపాధి పోగొడితే ఆ జడుని స్మరణ తనకు సంస్కారంగా సంక్రమించి జడుడై పుడతాడు. ఆహారానికి కాక ఇతర విషయాలకు జంతువులను వికలాంగులుగా చేసినా అంతే. చెట్లకు మాత్రం బాధ ప్రాణమయమే గానీ, మానసికం కాదు గనుక కలపకు, మంచాలు మొదలైన వాటికి చెట్లను నరికితే సంస్కారం అంటదు. ఊరికే హత్యా బుద్ధితో చెట్టును నరికినా వికలాంగత వస్తుంది. హత్యా సంకల్ప సంస్కారమే దీనికి కారణం. జంతువులకు బాధ పడేందుకు మనసున్నది గనుక హంతకుని స్మరణ సంస్కారం ఉంటుంది. మానవునకు ఊహాబలం కూడా ఉన్నది గనుక నరహింస వలన కలిగే స్మరణ, సంస్కారం మరీ ఎక్కువ ఈ తర తమ భేదాలతోనే వికలాంగతలు మొదలైనవి వర్తిస్తాయి.

వ్యక్తి : మాస్టరుగారూ! హోమియో విధానంలో మానసికమైన దుర్లక్షణాలెన్నో సర్దుకుంటాయని, మనిషి మొత్తంలోనే కావలసిన మార్పు వచ్చి జీవితం చక్కబడుతుందని అంటారు గదా! మరి పూర్వజన్మ వలన కలిగిన సంస్కారమయమైన ఘోర వ్యాధుల నుండి హోమియో విధానం మనిషికి విముక్తిని ప్రసాదించ లేదా! అది ప్రసాదించ గలిగితే అప్పుడా జీవి పూర్వ జన్మలో ఆచరించిన పాప ఫలితాలనుండి బయట పడవచ్చు గదా!

మాస్టరుగారు : అలోపతి విధానంలో నివారణ కాని మహా వ్యాధులు హోమియో వైద్యంలో నివారణ మవటం అనుభవ సిద్ధం. కారణమేమంటే అలోపతీ వైద్యం పునాదులలోనే భౌతిక శరీర నిర్మాణానికి తప్ప ప్రాణ మయ మనో మయాదులకు తావులేదు. పెద్ద వ్యాధులు ప్రాణమయ మనో మయ కోశాదులలో పుట్టి భౌతిక శరీరం మీద వ్యక్తమవుతాయి. హోమియో వైద్యం కేవలం మనోమయ కోశాలను శోధనచేసి వదిలి పెడుతుంది. దానితో అన్నమయ కోశం తిన్నగా సర్దుకుంటుంది. అంత మాత్రాన అన్ని వ్యాధులు హోమియోపతీకి లొంగుతాయనడం చాదస్తం. పుట్టుకతో గుడ్డివాడో, కుంటి వాడో ఉంటే హోమియో మాత్రం ఏం చేస్తుంది? అలాగే గుండెకాయ వంకరగా పుట్టినవాళ్ళు ఉంటారు. వాళ్ళు గుండెజబ్బుతో సున్నితంగా బ్రతుకుతూ ఆ జబ్బుతోనే చనిపోతారు. కొంద రికి కొంత వయస్సు దాటేటప్పటికి దృష్టి క్రమంగా పోతుంది. మరికొందరికి పితృపితామహక్రమంలో ఒక వయస్సు దాటేసరికి బ్రహ్మచెముడు వస్తుంది. హోమియోపతి డాక్టరు అలాంటివాళ్ళకి ప్రదక్షిణం చేసి దణ్ణం పెట్టడం తప్ప చేయగలిగిందేమీ లేదు. హోమియోపతీకి తగ్గని కొన్ని మహా వ్యాధులు ఆయుర్వేదంలో తగ్గుతాయి. సర్వవ్యాధులకి మానసిక దుర్విపాకం (Psora) కారణమని హోమియో శాస్త్రం చెపుతుంది. దాని నివారణ కూడా చేస్తుంది. కానీ మరల సోరా సోకకుండా ఉండే విధానం హోమియోలో లేదు. ఏ వైద్య సిద్ధాంతం లోనూ వ్యాధులు రాకుండా కాపాడే విధానం

లేదు. వచ్చిన వ్యాధిని నయం చేయడం వేరు, ఆరోగ్యంగా బ్రతకడం వేరు ఆరోగ్యంగా బ్రతకడానికి కావలసింది ఆహారంగాని ఔషధం కాదు. ఆహారం జరగాలంటే ధర్మాత్ముల సత్సాంగత్య మొక్కటే ఔషధం. దాన్ని భవరోగ భేషజం అన్నారు. భవరోగం పూర్వ జన్మ దుస్సంస్కారాలవల్ల వస్తుంది. దానిని నివారించుకొనడానికి వృద్ధోపసేవ అవసరం.

ఇక పూర్వజన్మ సంస్కారాలు అన్నమయ, ప్రాణమయ, మనోమయాల ద్వారా వ్యక్తమవుతాయి గాని అక్కడ పుట్టవు. సంస్కారాలుండేవి జీవుడులోనూ, వ్యక్తమయ్యేవి దేహంపైన, ఈ సంస్కారాలు ఆయా వ్యక్తుల స్వభావాలుగా ఉంటాయి. ఆ స్వభావాలకి మందులుండవు. ఈ మానసిక లక్షణాలు గల వాడికి ఈ మందు పనిచేస్తుంది. అని కనిపెట్టగల హోమియో సిద్ధాంతులు కూడ "నాకే జబ్బు లేదు. నాకుమందెందుకు" అనే వాడికి మానసిక లక్షణానికి మందు వేయలేరుకదా! ఇలాంటి లక్షణా పూర్వ సంస్కారాలు. అజీర్ణవ్యాధితో బాధపడుతూ ఉండే పాండురోగి లివర్ చెడిపోతుంది. అలాంటి వాళ్ళలో చాలామంది కారాలు,ఉల్లిపాయలు మషాళాలు తింటేవ్యాధిఎక్కువవుతుంది.తినకుండా ఉండలేరు. నువ్వుపత్యం చెబితే నీదగ్గర మందుపుచ్చుకోరు.చెప్పని వాడిదగ్గరకూడాప్రాణంమీదకువచ్చినపుడుమందుపుచ్చుకొని కొంచెం తగ్గగానే మానేస్తూఉంటారు.ఇలాంటిమానసిక లక్షణాలు ఏ హోమియోపతీ మందుకి తగ్గుతాయి? ఇలాంటి లక్షణాలే పూర్వ దుష్కర్మ ఫలితాలు కనుక ఇవి ఘోర కర్మఫలితాలుగా సంస్కారాలై పుట్రెకు పట్టి ఉంటే ఏ వైద్యమూ అక్కరకు రాదన్నది ముమ్మాటికి సత్యము. అలాంటి వ్యాధులకి కూడా అధర్వణవేదంలో చక్కని ప్రక్రియలున్నాయి. ఆచరిస్తే ఆ దుష్కర్మ సంస్కారాలు తొలగిపోయన్నది నూటికి నూరుపాళ్లు సత్యం. కాని "ఆచరిస్తే"అన్నచో వైద్యులు ఓడిపోక తప్పదు. వాడు ఆచరించడు కదా! ఘోరదుష్కర్మ

ఫలితం ఇలా ఉంటుంది. ఉదాహరణకు పూర్వ జన్మలో ఒకడు ఇంకొకడి పేదరికాన్ని అవకాశంగా తీసుకుని తక్కువ అన్నం పెట్టి, ఎక్కువ పని చేయిస్తాడు. ఇలా పన్నెండు సంవత్సరాలు చేయించాడనుకోండి. ఈజన్మలో ఐశ్వర్యంఉండి అజీర్ణవ్యాధితో బాధపడుతూ ఉంటాడు. అన్నంతింటేచస్తావు, గంజి త్రాగుతూ ఉండు" అని మేలుకోరి చెపుతాడు డాక్టరు. దీన్నే జ్యోతిష్కుడు తన భాషలో నీకు ద్వితియంలో శని నీచలో ఉన్నాడు. వాడిని కుజుడు చూస్తున్నాడు. నీకు అజీర్ణ వ్యాధి ఉంటుంది. తిన్నది అరగదు. శని దశలో కుజాంతరందాటే దాకా ఇంతే" అంటాడు. అప్పటికి పండ్రెండేండ్ల లెక్క సరిపోతుంది. తన జబ్బు తగ్గించే వైద్యవిధానం మీద అప్పటికి గాని నమ్మకం కుదరదు. అప్పుడు విరక్తి పుట్టి అన్నం మానేసి గంజి తాగుతాడు, వ్యాధి నయమవుతుంది. ఆ పన్నెండేళ్ళ లోపున వాడికి మీరు చేయగల వైద్య మేమిటి? నచ్చని వాడికి ఎలా నచ్చ చెబుతారు. కనుకనే కర్మఫలానికి వైద్య శాస్త్రం పనికిరాదు.

వ్యక్తి : మాస్టరుగారూ ! అలాంటప్పుడు ఏ మహానుభావుడైనా అనుగ్రహిస్తే ఆ జీవికి కర్మఫల సంస్కారాల నుండి విమోచనం లభించడానికి అవకాశం ఉందంటారా ?

మాస్టరుగారు : తప్పకుండా! అతీతమైన దివ్యశక్తి సంపన్నత గల మహానుభావుడు ఎవడైనా తన ఆత్మశక్తితో అనుగ్రహిస్తే ఈ దుష్కర్మ వాసన రహితం కాగలదు. దానికీ, వైద్య శాస్త్రానికీ సంబంధం లేదు.

వ్యక్తి : ఆ అనుగ్రహం వేలాదిమందిపై వర్షించడం, వాళ్ళపూర్వ సంస్కారాల నుండి విముక్తిపొంది స్థిమితపడటం మేమునిత్యం చూస్తూనే ఉన్నాం కదా !

## ఆర్థిక అసమానతలకు పూర్వజన్మ కారణమా ?

వ్యక్తి : మాస్టరుగారూ ! లోకంలో ఉన్నవాళ్ళని, లేని వాళ్ళని చూస్తున్నాం. స్వర్గ సౌఖ్యాలనుభవిస్తున్న వాళ్ళని, కూటికి కూడా నోచుకోని

వాళ్ళని చూస్తున్నాం. ఈ తరతమ భేదాలకు వారు పూర్వజన్మలో ఆచరించిన పాపపుణ్యాలే కారణమని మనవాళ్ళు అంటూ వుంటారు, ఈ నమ్మకం నిజమేనా? ఆర్థికమైన అసమానతలకు పూర్వజన్మల పాపపుణ్యాలే కారణమంటారా ?

మాస్టరుగారు: ఆర్థికములైన ఎక్కువ తక్కువలు జన్మ కారణాలుగా ఉండటానికి ధనంతో అతడు వ్యవహరించిన వైఖరియొక్క సంస్కారమే కారణం గాని, పాపపుణ్యాలు కావు. పాపపుణ్యాలు సంస్కారాలుగా, వచ్చే జన్మలో కలిగించేది దుఃఖాన్ని, సుఖాన్ని మాత్రమేగాని నిర్ధనత్వాన్ని, సంపదని కాదు. ధనానికి, సుఖానికి సంబంధం ఎలా లేదో, నిర్ధనత్వానికి, దుఃఖానికి కూడ అలాగే సంబంధం లేదు. లక్షలు ఉండి, దిగుళ్ళతో ఏడ్చే వాళ్ళు, భార్యాభర్తలు మాట్లాడుకోని వాళ్ళు, తండ్రీ కొడుకులు ద్వేషించుకునే వాళ్ళ ఉన్నారు. ఏరోజు తిండికి ఆరోజు పని చేసి సంపాదించి ధైర్యంతో, సంతోషంతో, నిత్య తృప్తితో బ్రతికే వాళ్ల ఉన్నారు. గంజి తాగి గడిపిన పూటకూడా సీతారాములు లాగ జీవించే దంపతులున్నారు.గోచీ పెట్టుకొని ఆకులలములు భోంచేస్తూ దేనినీ లెక్క చేయకుండా జీవించే వాళ్లూ ఉన్నారు. కనుక సుఖదుఃఖాలకి, ఆస్తి, అంతస్తులకి సంబంధం లేదు. పూర్వజన్మలో పుణ్య కర్మలు సుఖాన్నిస్తాయి గాని ఆస్తి నివ్వవు. అలాగే పాప కర్మలు దుఃఖాన్నిస్తాయి గాని నిర్ధనత్వాన్ని కలిగించవు. ఇంకొకడికి పెట్టకుండా సుఖా అనుభవించే ధనికుడు తినడానికి నోచుకోని అజీర్ణ వ్యాధులతో పుడతాడు గాని, నిర్ధనుడుగా పుట్టనక్కరలేదు. నిరంతర దానాలు చేసినవాడికి భోజనాది సౌకర్యాలు అప్రయత్నంగా సమకూరుతాయి గాని ధనికుడు కానక్కరలేదు. ఇక సంపద, నిర్ధనత్వము దేనివల్ల కలుగుతాయి? అనే ప్రశ్నకి నేర్పరితనం వల్ల మాత్రమే కలుగుతాయి అని సమాధానం. ఆ నేర్పరితనం సత్కర్మ సంస్కారంతో కూడినదైతే సంపద నార్జించే సామర్థ్యం వస్తుంది. దుష్కర్మ సంస్కారంతో కూడినదైతే అన్యాయంగా సంపద నార్జించే సామర్థ్యం వస్తుంది. అలాగే

జూదము, పానము, వ్యభిచారము మొదలైన మార్గాలలో దుర్వ్యయము చేసిన వాడికి కలిగే సంస్కారం ఈ జన్మలో దారిద్ర్యాన్ని కలిగిస్తుంది. కనుకనే నిత్య దరిద్రుడికి నిరంతర ధనసహాయం చేసినా దగ్ధం చేసుకుంటాడే గాని అనుభవించలేడు. అప్పులు యిచ్చి వడ్డీల కాశించి తిరిగి రాబట్టుకోకుండా చనిపోయినవాడు ఆ సంస్కారం వల్ల కలిగిన గర్వాత్రంతో అప్పులు చేస్తూ జీవిస్తాడు. వాడి అప్పులు తీర్చినా మళ్ళీ చేస్తానే ఉంటాడు. అప్పులు తీసుకుని అశక్తతతో కాక, దుర్బుద్ధితో ఎగ్గొట్టినవాడు ఆసంస్కారంలో వడ్డీల కాశించి అప్పులిచ్చి దెబ్బతింటాడు. ఈ ఆస్తి పాస్తుల లోకాలకి, సుఖానుభవానికి ఏ విధమైన సంబంధమూ లేదు. డబ్బు విషయంలో నిస్సహాయులను భయపెట్టి లౌక్యంతో జీవించిన వాడు ధనాన్ని విశేషంగా కూడబెట్టే నేర్పరితనంతో పుట్టి ఆ కూడ బెట్టిన దాన్ని గూర్చి జీవితమంతా భయంతో గడగడలాడుతూ జీవిస్తాడు.

వ్యక్తి : ధనం నేర్పరితనం వల్ల మాత్రమే సమకూరుతుంది అన్నారు మీరు. ఆ నేర్పరితనాన్ని మీరు కొంత వివరిస్తే మాకు ఉపయోగకరంగా ఉంటుంది.

మాస్టరుగారు : నిరాఘాటంగా అన్నోదకాలు దానం చెయ్యడం అబ్బిన వాడికి ఆ వస్తు సేకరణ చేసే నేర్పరితనం అబ్బుతుంది. అందులో ెంత భాగమే ధనం సంపాదించడంలో నేర్పరితనం. భయంలేకుండాదానికి ఖర్చుపెట్టేవాడు భయం లేకుండా న్యాయమార్గాన ధనాన్ని ఆకర్షించడం నేర్చుకుంటాడు. ఈ నేర్పరి తనం వచ్చే జన్మలో ధనవంతుణ్ణి చేస్తుంది.

అలాకాక ఎవడికీ,ఏమీ ఖర్చు పెట్టకుండా ధనం కూడబెట్టే లక్షణం గలవాడికి ధనం లొంగుతుంది గాని, సుఖపడటం తెలియదు. దానధర్మాలు పేరు కోసమో, తన వర్గాన్ని పెంచుకోవడం కోసమో చేసేవాడికి ఈ నేర్పరితనం

పోతుంది. కనుక అలాంటి వాళ్ళు దానాలు చేసి చివరకు నిర్ధనులై చచ్చి పోతారు. వాడికి మిగిలే సంస్కారంతో వచ్చేజన్మలో బుర్ర పనిచేస్తుంది. తత్ఫలితగా ఎంత ప్రయత్నించినా చిల్లిగవ్వ చేతికిరాదు. ఎవరైనా వాడికి ధన సహాయం చేయడానికి సంకల్పించినా చేయలేకపోతారు. గట్టిగా ప్రయత్నిస్తే తాను కూడా ఇరుకున పడతాడు. నీవు కొందరికి సహాయం చేద్దామనుకునే సరికి అప్రయత్నంగానే చేతికి ధనం వస్తుంది. మరి కొందరికి చేద్దామనుకునేసరికి నీకు రావలసింది ఖిగిసిపోతుంది. నీ సంకల్పం ఆ యిద్దరి విషయంలో ఒకటేమైనా వాళ్ళ పూర్వకర్మ ననుసరించి యిలాంటి తేడాలు వస్తూవుంటాయి.

వ్యక్తి : మాస్టరుగారూ ! ఇలాంటి తేడాలతో బాధ పడుతున్న వాళ్ళు కూడా మహానుభావుల సన్నిధికి చేరి వారికి మనస్సును సమర్పణ చేసుకుంటే ఆ దుస్సంస్కారాలన్నీ తొలగిపోతాయిగదా !

మాస్టరుగారు : తప్పకుండా తొలగిపోతాయి. ఇలా తొలగి పోవడాన్నే భృక్తరహితం అన్నారు సి. వి. వి. గారు.

## E. పూర్వజన్మల స్మృతులు

### పూర్వజన్మలు గుర్తుకొస్తాయా ?

వ్యక్తి : కొంతమందికి పూర్వజన్మలు గుర్తు వచ్చినట్లు వింటూ ఉంటాం. అలాంటి నిదర్శనాలు వార్తా పత్రికల్లో కూడ కనబడుతూ ఉంటాయి. ఇక కథల్లో, సినిమాల్లో విశేషమైన ప్రచారం ఉన్నది. నిజంగా పూర్వజన్మలు గుర్తుకొస్తా యంటారా ? వస్తే ఎలాంటి స్థితిలో గుర్తుకు వస్తాయి ?

మాస్టరుగారు : ఈ పూర్వజన్మ జ్ఞానం విషయం పాకుడు బండలాగ సూక్ష్మమైన పొరపాట్లతో కూడి ఉన్నది. శాస్త్రీయ వర్గీకరణం చేయడానికి ప్రయత్నించిన వారంతా జారి పడుతూనే ఉంటారు. తరగతులుగా విభజించు కుంటేనే గాని వీటి బండారం బయటపడదు.

1. సిద్ధులైన పరమగురువులు శతాబ్దాల తరబడి చేయవలసిన లోక శ్రేయస్సు, ప్రణాళికలకు అలవాటు పడతారు గనుక వారి పూర్వాపర జన్మల జ్ఞానం చత్వారం లేకుండా వుంటుంది. నిద్రపోయి లేచినవాడు నిన్నటి పని ఎలా పూర్తి చేసుకుంటాడో ఈ గురువులు పూర్వజన్మ ప్రణాళికను అలా పూర్తి చేస్తూ ఉంటారు.

2. సిద్ధుల స్థితి కలుగబోయే ముందు సృష్టి పరిణామం కారణంగా మొదటి కొన్ని జన్మలలో చెదురు మదురుగా పూర్వ జన్మల సంబంధాలు, పేర్లు, ఊళ్ళు స్ఫురించేవాళ్ళు కొందరుంటారు. ముఖ్యంగా భార్యా భర్తల మధ్యగాని, తల్లీ బిడ్డల మధ్యగాని ప్రేమ తీరకుండా అకాల మరణాలు సంభవించినపుడు ఆ తరువాత జన్మలో కొంత పూర్వజన్మ జ్ఞానం పీచులాగ రేగుతుంది.

3. యోగసాధన భక్తిజ్ఞాన వైరాగ్యాది ఆధ్యాత్మిక సాధనలు సక్రమంగా నడుస్తూ మధ్యలో చనిపోయినప్పుడు కూడ పూర్వజన్మ జ్ఞానం కలుగుతుంది. దానిపైన వారికి స్వామిత్వం ఉండదు. కలిగినన్నాళ్లు కలుగవచ్చు. తరువాత పోనూవచ్చు.

4. కొన్ని మానసిక వ్యాధులు, అక్రమ, అశాస్త్రీయ యోగసాధనలు కారణంగా నిద్రలో సూక్ష్మదేహం అనేక ప్రదేశాలకు పర్యటనం చేసి వస్తూ ఉంటుంది. అప్పుడు కనిపించిన అజ్ఞాత నగరాలూ, ప్రదేశాలూ, ఇళ్ళూ వాకిళ్ళూ, వ్యక్తులూ, కుటుంబాలూ వాళ్ళతో నిద్రావస్థలో జరిగిన సంభాషణలు, మెలకువ వచ్చేసరికి జ్ఞప్తి ఉండవు. కొంతకాలం తరువాత జ్ఞప్తికి వస్తాయి. అవి తమ పూర్వజన్మలకు సంబంధించినవి అని భ్రమపడటం జరుగుతుంది. తీరా పరిశోధకులు పోయి చూసి వస్తే అన్నీ సరిపోతాయి. కనుక పూర్వజన్మ జ్ఞానమేనని వారు కూడా అధికారరీత్యా సర్టిఫికెట్టు ఇవ్వవచ్చు. ఉదాహరణకు ఈ శతాబ్దంలోనే జరిగిన శాంతిదేవి పూర్వజన్మ కథ మొదలైనవి

5. మనస్సులోని పొరలలో ఒక పొరకి దూరదృష్టి దూరశ్రవణం ఉన్నది. అది ఒక్కొక్కప్పుడు కొందరిలో తాత్కాలికంగా కదులుతుంది. అప్పుడు ఏవో అజ్ఞాతకుటుంబాల పేర్లు, వాళ్ళపై తరాలవారి పేర్లు, వాళ్ళ ఇళ్ళలోని వ్యవహారాలు మనస్సుకి తగుల్తాయి. అదంతా తమ పూర్వజన్మ వాతావరణమని భ్రమపడవచ్చు, పరిశోధకులు కూడా అంగీకరించవచ్చు.

ఇన్ని వికల్పాలతోనూ కలగలుపుగా ఉత్సాహపూరితములైన పామర మనస్సులు విద్యావంతములైనా కూడా ఈ మొత్తాన్ని పూర్వజన్మ జ్ఞానంగా పరిగణనం చేసుకొని సత్యాన్ని గ్రహించినట్లు సంతోషపడతాయి. వీటి పరపోతలు తెలిసిన ప్రజ్ఞ కలవారికి మాత్రమే నిజమైన పూర్వజన్మ జ్ఞానం, దాని ప్రయోజనం తెలుస్తాయి.

వ్యక్తి : మాస్టరుగారూ! దర్శనానుభవాలతో మీరు చేసిన ఈపూర్వ జన్మస్మృతులు వర్గీకరణం, వివరణం అపూర్వంగా ఉన్నాయి. సహజం గానూ ఉన్నాయి. ఈ విభజనకు అనుగుణంగా సరైన ఉదాహరణలను వివ రంగా చేరిస్తే పూర్వజన్మ స్మృతులను గూర్చి ప్రామాణికమైన దివ్య గ్రంథం తయారవుతుంది. మీ ఆశీస్సులతో తగినవారు ఈ పనికి పూను కుంటారు అనుకుంటాను.

మాస్టరుగారు : అవును టైం వచ్చినపుడు ఈ గ్రంథం తప్పకుండా దిగివస్తుంది. నీలాగే ఎవరో కూర్చొని ఆ గ్రంథాన్ని తయారు చేస్తారు.

## గర్భస్థ శిశువుకు పూర్వజన్మల స్మృతి ఉంటుందా ?

వ్యక్తి : మాస్టరుగారూ! గర్భస్థుడైన జీవుడికి తన కంతవరకూ జరిగిన జన్మలన్నీ గుర్తుకొస్తాయని అప్పుడతను చేసిన తప్పులకు బాధ పడుతూ చేయవలసిన పనులను గూర్చి ఊహిస్తూ ఉంటాడని అంటూ ఉంటారు. ఇది ఎంతవరకూ నిజం ? నిజానికి అప్పుడు జరిగేదేమిటి?

మాస్టరుగారు : గర్భస్థుడైన జీవికి అంతకుముందు జరిగిన జన్మలన్నీ గుర్తుంటాయి. అంటే పేర్ల జాబితాలు, చుట్టాల మొగాలు, వాళ్ళతో జరిగిన లావాదేవీలు గుర్తు ఉంటాయని అర్థం కాదు. కుండలు చేసేవాడికి చేస్తూ ఉండగా బ్రద్దలయిపోయిన కుండలన్నీ సంఖ్యతోసహా గుర్తుండ నక్కర లేదు. మనము చుట్టాలు, స్నేహితులు, పూర్వజన్మలలోనివి అన్నీ కలిపి ఈ బ్రద్దలైపోయిన కుండల్లాంటివి. గుర్తుండటం అంటే కుండలు బ్రద్దలయినాయని గుర్తుండటం మాత్రమే.

ఇక్కడ నుండి రైలెక్కి మద్రాసు పోతూ ఉన్నవారికి దారిలో ఊళ్లన్నీ గుర్తుంటాయి. రైలు దిగిన వెనుక తన పనులలో పడతాడు గనుక

ఈ ప్రయాణం దారి గుర్తుండదు. మళ్ళా మద్రాసులో రైలెక్కినప్పటి నుండి దిగేలోపున అదేదారి, అవే ఊళ్ళు వ్యుత్క్రమంగా(Rverse Order) గుర్తుంటాయి. అంటే అన్ని స్టేషన్ల పేర్లు ఖట్టీ అని అర్థం కాదు. ప్రయాణంలో పొరపాట్లు జరుగకుండా ఉండడానికి కావలసినంత వరకు మాత్రమే గుర్తుంటుంది. దారిలో ఎక్కడ కాఫీ, టిఫిన్ తీసుకోవాలి, స్నానం చేయాలి, భోజనం చేయాలి మొదలైనవి గుర్తుంటాయి. మధ్య స్టేషన్లలో మన వాళ్ళు ఎవరైనా వస్తారని ఏర్పాటుంటే వాళ్ళు గుర్తుంటారు. అలాగే గర్భస్థుడైన జీవుడికి తానెక్కడ నుండి గర్భంలో ప్రవేశించిందీ ఇటుపైన ఎక్కడెక్కడకు వెళ్ళవలసి ఉంటుందీ అన్నీ గుర్తుంటాయి. మరొక విషయం! రైలులో కూర్చున్నంతసేపు దిగిన తరువాత చేయవలసిన కార్యక్రమాన్ని గూర్చి చక్కని అభిప్రాయం ఏర్పాటు చేసుకోవచ్చు. కాని చాలా మంది దిగిన తరువాత పరిసరాల ప్రభావం వల్ల ఆ కార్యక్రమాన్ని మర్చిపోతారు. లొల్లి చేసుకుంటారు. మళ్ళీ రైల్లో ఎక్కాక ఆ పని చేయటానికి వీలుపడలేదు. వాడ్ని కలుసుకోలేక పోయాను అని గుర్తుకువస్తాయి. అలాగే సంసార బద్ధులైన జీవులకు జన్మంతా మర్చిపోయిన అంశాలను గూర్చిన జ్ఞానం మళ్ళా గర్భస్థుడైనాక గుర్తుకువస్తుంది. ఉదాహరణకి ఒక స్నేహితుడి పెళ్ళికి వాడితో కూడ ఉండి సహాయం చేయడానికి మద్రాసు బయలుదేరిన వాడికి ఆ ఊళ్ళో దిగంగానే అనుకోకుండా ఒక సినిమాస్టార్‌తో పరిచయం అవుతుందనుకో. నూతన కార్యక్రమం ఏర్పడి చివరికి అతికష్టం మీద పెళ్ళి ముహూర్తం వేళకు మాత్రం హాజరై తిరిగి వస్తాడనుకో. తిరుగు ప్రయాణంలో రైలు ఎక్కాక నెమరువేసుకుంటే వచ్చిన పని సక్రమంగా నెరవేర్చలేదని తెలుస్తుంది. అలాగే గర్భస్థుడైన వెంటనే అంతకుముందు జన్మల విషయంలో తాను ఎలా ప్రవర్తించ లేకపోయాడో ఇటుపైన ఎలా సక్రమంగా ఉండాలో తెలుస్తుంది.

## దేహాన్ని విడిచేముందు పూర్వజన్మలు గుర్తుకొస్తాయా ?

వ్యక్తి : మాస్టరుగారూ! జీవి శరీరాన్ని వదలబోతూ ఉండగా అతనికి అసలు తాను వచ్చినపని అది ఎంతవరకు చేయగలిగినదీ, ఎంతవరకూ చేయలేక పోయినదీ బోధపడడానికి అవకాశం ఉన్నదా?

మాస్టరుగారు : కొందరికి శరీరం వదలబోతూ ఉన్న కొన్ని నిముషాల లోనో, గంటలలోనో తన జన్మల పౌర్వాపర్యం గోచరిస్తుంది. అది ఎట్లాంటిదంటే కొన్ని గంటలలో ప్రయాణం చేయబోతున్నామని నిర్ణయించుకొన్నప్పుడు వెళ్ళే పనికి కావలిసిన వస్తువులు సర్దుకోవడం, అడ్రసులు, టెలిఫోను నంబర్లు తీసుకోవడం మొదలైన సన్నాహం వంటిది. చివరి క్షణాల్లో ఇంకా మిగిలి ఉంటే త్వర త్వరగా అన్నీ గుర్తుచేసుకొని సర్దుకుంటాం, అలాంటిదే ఇది. ఈ జ్ఞానం నిశ్చల మనస్సులకు మాత్రమే కలుగుతుంది. తక్కిన వాళ్ళకు కలుగదు. కంగారు పడేవాడు ప్రయాణానికి ముందు చేసుకోవలసిన సర్దుబాట్లు మర్చిపోవడం, గజిబిజి చేసుకొనడం జరుగుతుంది. అలాగే చచ్చిపోవడానికి కంగారుపడే వాళ్ళందరూ భార్యనూ, పిల్లలనూ పిలిపించు కొనడానికీ, అప్పులు వసూలు చేయించుకొనడానికి తంటాలు పడతారేగాని, నిశ్చలత్వాన్ని పొందలేరు. వారికి చివరి క్షణాల్లో ఈ సర్వ జన్మల జ్ఞానం కలగడం సంభవం కాదు.

## దేహం విడిచిన తరువాత గుర్తుకొచ్చే అవకాశం ఉందా?

వ్యక్తి : మాస్టరుగారూ! దేహం విడిచిన తరువాత జీవి తనకు మిగిలిన స్మృతుల సంస్కారాల వల్ల ముందు నరకం, తరువాత స్వర్గం అనుభవిస్తాడని చెప్పారు మీరు. ఆ రెండూ అయిపోయిన తర్వాత మళ్లీ తనకు తగిన తల్లి తండ్రుల దగ్గరకు ఆకర్షించబడే లోపున అంతవరకూ అతను

ఎత్తిన జన్మలు, ఆ జన్మలలో అతను నడిచిన విధానం, ఆ విధానంలోని తప్పొప్పులు, ప్రస్తుత కర్తవ్యం పూర్తిగా బోధపడే అవకాశం ఏదైనా ఉన్నదా?

మాస్టరుగారు : గర్భస్థుడు కాబోయే ముందు సంస్కారబలంతో ఆ గర్భంవైపుకు లాగబడటమే గానీ తెలిసేదీ, సర్దుకునేదీ ఏదీ ఉండదు. తెలియటంగానీ, సవరించుకోవడం గానీ, పురోగతికి అడుగులు వేయటం గాని శరీరంలో ఉండగా మాత్రమే సాధ్యం. దేహము, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు మొదలైన పనిముట్లుండగా మాత్రమే జీవితం చక్కపెట్టుకోవడం ఉంటుంది. ఇల్లు, అడ్రసు, పోస్టు, టెలీఫోను మధ్య ఉన్నవాడికి కార్యక్రమాలు ఉంటాయి గాని ఎడారిలోనో, ఏట్లోనో నడిపించుకొని పోబడే వాడికి ఏ కార్యక్రమాలు సాధ్యపడతాయి? సమస్త సామర్థ్యాలతో కూడిన దేహం జీవికి చక్కని విద్యాలయం. ఒక క్లాసులో చదువుకొనడం, పరీక్షలు వ్రాయడం, పై క్లాసుకు అర్హత సంపాదించడం, కాలేజీ పనిచేసే రోజులలో సాధ్యపడుతుంది గాని, వేసంగి శెలవల్లో కాదు. శెలవలకు ముందు ఏ కక్ష్యలో కాలేజీని వదలిపెడతాడో ఆ తరువాత కక్ష్య ప్రారంభం మళ్ళా శెలవలు ఆఖరయిన రోజునే. అలాగే దేహం విడిచాక దేహం పొందే లోపల తెలియటం సాధనలో పురోగమించడం ఏమీ ఉండవు. తెలియటానికి తలకాయ లేక హృదయం మొదలైన ఉపాధు లుండాలి. టైం చూచుకోవడం గడియారం ఉన్నప్పుడే. రేడియో ప్రోగ్రాములు వినడం రేడియో పెట్టె ఉన్నప్పుడే. అలాగే తెలుసుకొనడం, నిర్ణయించడం తలకాయ ఉన్నప్పుడే గాని వదిలాక కాదు. ఈ పవిత్రమైన కార్యక్రమం కోసమే దేహాలు అనే ఉపాధులు ఏర్పడింది. 'శరీర మాద్యంఖలు ధర్మ సాధనం.'

ఇది తెలియక కొంత మంది ఈ పాపిష్టి జన్మ ఎందుకని దేహం వదిలితే దేవుని దగ్గరకు వెడతామని భావించే వాళ్ళున్నారు. "ఆ శ్రీమన్నా

రాయణమూర్తి ఎంత తొందరగా తీసుకుపోతే అంత మంచిది" అని జీవిత మంతా గొంతుక కూర్చుని వేచియుండే అభాగ్యులున్నారు. దేహం విడిచాక పై లోకంలో సర్వజ్ఞత్వం ఉంటుందని భ్రమపడే వాళ్ళున్నారు. అలాంటి వాళ్లలో కొంత మంది దేహం విడిచిన వాళ్ళని మనస్సుతో పిలిచి ఫౌంటెన్ పెన్ లో బిగించి సందేశాలు చెప్పించుకునే వాళ్ళున్నారు. తమకు తెలియని శాస్త్ర సత్యాలను గురించి చచ్చినవాళ్ళను ప్రశ్నించి పెన్ను, పేపరు పుచ్చుకొని డిక్టేషన్ కోసం ఎదురు జూసే వాళ్ళూ ఉన్నారు. ఏ చనిపోయిన వాడికైనా చనిపోక ముందు ఏమి తెలుసో చనిపోయాక అంతకంటే ఎక్కువ తెలియదు. మహానుభావులు, సర్వజ్ఞులు చనిపోయినా, వారికన్నీ తెలిసినా మనం పిలిస్తే ఫౌంటెన్ పెన్‌లోకో, సీసాలోనికో, మన మీదికో వచ్చే అవసరం వాళ్ల కేమీ లేదు. ఇక పోతే తీవ్రమైన కోరికలతో చచ్చిన పిశాచ జీవులు మాత్రం ఎవడి దేహంలో దూరుదామా అని వేచి యుంటారు. ఆవాహన చేస్తే వచ్చేది ఈ తరగతి వాళ్ళ మాత్రమే. ఈ సంగతి తెలియక స్పిరిట్ రైటింగ్ అభ్యాసం చేసేవాళ్ళు కాళిదాసునో, షేక్స్పియర్ నో ఇంకా చాలకపోతే ఆంజనేయస్వామినో పిలుస్తూ ఉంటారు. ఇదిగో వస్తున్నానని అదే పేరుతో ఎవడో పిశాచం దిగి వస్తాడు. ఈ పిశాచ జీవులలో వంచన బుద్ధి తప్పకుండా ఉంటుంది, వాడికి తోచిన పిచ్చి సమాధానాలు చెప్పి నేను ఫలానా మహాపురుషుణ్ణి అని చెపుతాడు. ఇలా పదిసార్లు పిలవగా, పిలవగా పిలిచినవాడి బుర్రలోకి ఆ పిశాచాలకు రహదారి ఏర్పడుతుంది. వాళ్ళు మెల్లగా చోటుచేసుకొని ఆ పిలిచినవాడి స్వబుద్ధికి మాంద్యం కల్పించి తమ తీరని కోరికలు వాడి దేహం ద్వారా తీర్చుకుంటూ ఉంటారు. కాలక్రమాన శరీర మానసారోగ్యాలు హరించి, ప్రాణశక్తిని పీల్చి అతనిని పిప్పి చేస్తారు. నైతిక బలం కూడా తగ్గి అతడు అబద్ధాల రాతలు కూడ వ్రాస్తూ వారెవరో దిగివచ్చి చెప్పారు అంటూ ఉంటాడు.

వ్యక్తి : మీరు చెప్పింది నిజమే మాష్టారూ! నేనలా స్పిరిట్ రైటింగ్ వ్రాసేవాళ్ళని, వ్రాయించే వాళ్ళనీ చూశాను. పాపం చాలామంది కుర్రాళ్లు ఈ విధానంలో ఏవో దేవతలు పలుకుతారని తమ కలల్లో మహానుభావులు పలుకుతారని, తమకు సందేశాలు ఇస్తూ ఉంటారనీ, సందేహాలు తీరుస్తూ ఉంటారనీ ఆకర్షింపబడుతూ ఉంటారు. క్రమంగా నీరసించిపోతూ కూడా ఉంటారు. అవి అలా ఉండగా మానవుడికి పురోగతి దేహంలో ఉండగా మాత్రమే సాధ్యమని మీరు చెపుతుంటే నిజమేనని తెలుస్తుంది. లేకపోతే ప్రకృతి ఇంత కథ ఎందుకు ఏర్పాటు చేస్తుంది. ఈ సత్యాన్ని తెలుసుకో లేక చాలామంది దేహాన్ని నిర్లక్ష్యం చేయడమో, తాము చేసిన పాప ఫలితంగా భావించడమో, బంధ కారణమని భ్రమపడటమో చేస్తూ శరీరాన్ని నిరసిస్తూ నిందిస్తూ జీవితాన్ని వ్యర్థం చేసుకుంటూ ఉంటారు. సైకిల్ తొక్కటం రానివాడు తొక్కపోయి పడి సైకిల్‌ను తిట్టినట్లు ఈ శరీరాన్ని ఉపయోగించు కోవడం చేతకాక నిందిస్తూ ఉంటారు. దేవుని సృష్టిని నిందించేవాడు దేవుడ్ని ఎలా చేరగలడో నాకు బోధపడదు.

## కుండలిని దగ్గర జన్మలు రికార్డు అయి ఉంటాయా?

వ్యక్తి : మాస్టరుగారూ! ఇంతవరకు మనం ఎత్తిన జన్మలన్నీ మనలో కుండలిని దగ్గర రికార్డు చేయబడి ఉంటాయని కుండలిని ప్రబోధం జరిగినప్పుడు క్రమంగా అవి విచ్చుకొని తెలుస్తాయని అంటూ ఉంటారు. దీని కథ ఏమిటి?

మాస్టరుగారు : కుండలిని అంటే చుట్ట చుట్టుకొని యున్నది అని అర్థం. మనం చదువుకున్న వేల పేజీల పుస్తకాల విజ్ఞాన మంతా మన బుర్రలో ఎలా ఇమిడి ఉంటోంది? చుట్ట చుట్టిన పేపులాగ ఉంటుంది. మళ్ళీ

వాడుకోవాలంటే చుట్టనుండి లాగితేనేగాని బయటకిరాదు. అలాగే మన ప్రజ్ఞ అనే దీపం ఉన్న ఇల్లే ఈ దేహం. మన ఇంట్లో ఎప్ప ఎప్పటి నుండో అమర్చుకున్న వస్తువులన్నీ వేటి స్థానంలో అవి సర్దబడి ఉంటాయి. వాటిని ప్రజ్ఞ బయటకు లాగితే గాని వాడుకొనడం సాధ్యం కాదు. నిత్య దిన చర్యకు కావలసిన కొద్ది వస్తువులు మాత్రమే స్మృతి పథంలో ఉండటం, ఇంట్లో సర్దిన మిగిలిన వస్తువులన్నీ స్మృతికి దూరంగా ఉండటం సహజం. కాని ఒక సమర్థుడైన ఆఫీసరు ఆఫీసులో అన్ని బీరువాలలో ఉన్న ఫైళ్ళు అతని స్మృతి పథంలో ఉంటాయి. ఏది కావలసినా క్షణంలో తీసి కావలసిన కాగితం గుర్తిస్తాడు. అదే విధంగా శక్తితో జోడించిన ప్రజ్ఞ పని చేస్తుంది. శక్తి ఒకచోట ప్రజ్ఞ ఒకచోట పనిచేయడం ఇంద్రియ లోలుర విషయంలో తప్పదు. వారిలో శక్తి పట్టుదలలో ఉంటుంది. ప్రజ్ఞ ఇంద్రియాలలో మనస్సులో ఉంటుంది. ఏదో ఆలోచిస్తూ దురదబెట్టి గోక్కుంటూ ఉన్నవాడికి ప్రజ్ఞ ఆలోచనలో కొంత శక్తిని వినియోగిస్తూ ఉండగా మరికొంత శక్తి వేరుగా గోక్కుంటానికి వినియోగిస్తూ ఉంటుంది. అతనిలోని శక్తి రెండు చిల్లుల గ్లాసుల్లో పోసిన నీరు లాగ తగ్గుదలలో ఉంటుంది. ఒక చిల్లు ఉంటేనే ధారలో శక్తి తగ్గుతుంది. ఇంకా ఎక్కువ చిల్లులతో జల్లెడలాగ ఉంటే శక్తి వ్యాకీర్ణమై పోతుంది. అలాగే ప్రజ్ఞ అనేక తాపత్రయాలలో వుంటే శక్తి ఖర్చవటమేగాని పని జరగటమనే ప్రసక్తి ఉండదు. అలాంటి వ్యక్తిలో ఉన్న శక్తిని చాలావరకు ప్రకృతి జీవ కణాల్లో దాచి ఉంచి కొంచెం కొంచెంగా మాత్రమే మనస్సులోకి వదల్తూ ఉంటుంది. దుర్వ్యయం చేసే కుర్రవాడిని మాయచేసి చిల్లర డబ్బులు మాత్రం ఇచ్చి అసలు డబ్బులు ఎక్కడ దాచిందో తెలియనీయని తల్లిలాగ ప్రకృతి ఈ సంసార బద్ధుల విషయంలో క్రమంగా నీతి, నియమాలు, అభ్యాసం అబ్బుతున్న వాడికి ఈ శక్తిని ఉన్ముఖంగా వదలడం

మొదలు పెడుతుంది పరికృతి. ఆ వదలడం చుట్టచుట్టిన దారపు కండె విప్పటంలాగ ఉంటుంది. ఈ దారపు కండెల లాంటి శక్తి కేంద్రాలు వెన్నె ముకలో ఉన్నాయి. వాటినే షట్చక్రాలు అంటారు. తాపత్రయాలలో బాధ పడే వ్యక్తిలో శక్తి దాగి ఉండే చోటు మూలాధారం. దీనికి ఈ దేహాన్ని ప్రాణంతో బిగించి ముడివేసే లక్షణం ఉన్నది. దేహం లోని భౌతిక పదా ర్థాల పేర్పు మూలాధారం దగ్గర ప్రాణంతో ముడివేయబడి ఉంటుంది. కనుకనే మాట్లాడే ప్రయత్నం ఇక్కడ ప్రారంభమౌతుంది. నాదానికి ముందు మన మాట ఇక్కడ బిందువుగా ఉంటుంది. మాట్లాడటంలో విద్యుత్ప్రసారం రూపంలో అది మిగిలిన చక్రాలలోనికి ప్రసరించి కంఠం దాకా ఉచ్చారణగా, శ్వాసగా పరిసారమవుతూ[శ్వాస అంటే పీల్చబడే గాలి కాదు. పీల్చి విడిచే శక్తి] కంఠంలో శబ్ద తరంగాలుగా ఆకాశంలోని విద్యు త్తును రేపి మనస్సులో అభిప్రాయాలుగా రూపొంది వాక్యంగా వెలువడు తుంది. ఈ లోపున షట్చక్రాలలో ఉన్న అక్షరాల పరిజ్ఞలను పైపు కొట్టి నట్లు కదిలిస్తుంది. దానితో కావలసిన అక్షరాలు వాక్యంగా పలుకుతాయి. ఈ కారణం వల్లనే ఇదంతా సరస్వతీ చతుర్ముఖుల లోకం అన్నారు. ఈ మొత్తం ప్రసారం జరుగుతూ ఉన్నశక్తి మాట్లాడకముందు చుట్ట చుట్టు కొన్న పేవులాగ మూలాధారంలో నిద్రిస్తూ ఉంటుంది. ఈ ప్రసారాల దారి ఊర్ధ్వ లోకాలు. ఇవి కొత ఇంకొక జీవుడికి శరీరాన్ని ఉచ్చరించే దారి కూడ ఈ మూలాధారం నుండే బయలు దేరుతుంది. దానినే కామ సంభోగం అంటారు. ఇవి అధో లోకాలు. ఇవి రెండూ దేవయానం, పితృయానం అనబడతాయి. ఈ రెండింటిని వాడుకో వలసిన జీవుడు పట్టి పరిజ్ఞ, అష్టాంగ యోగ సాధనతో వాడుకొనడం నేర్చుకుంటాడు. అప్పుడు శక్తి, పరిజ్ఞ ఒక్కటిగా పని చేస్తాయి. అన్ని దీపాలు వెలుగుతూ వున్న ఇంట్లో దీపాలే మనుష్యులుగా పని చేస్తే ఎలా వుంటుందో అలాగే ఇంట్లో వున్న అన్ని వస్తువులు సమకాలికంగా గుర్తు వుంటాయి. అలాంటి స్థితిలో ఒక్క పూర్వజన్మ విషయం మాత్రమే గుర్తుండటం పెద్ద విశేషం కాదు.

వ్యక్తి : పూర్వజన్మల పుణ్యమా అని కుండలిని స్వరూపం చక్కగా బోధపడింది మాస్టారూ. యోగసాధన, దాని పరమావధి అన్నీ ఈ కొద్ది సేపట్లోనే మీ మాటలలో మాకు దర్శనమిచ్చాయి. ఇది గుర్తుంటే చాలు పూర్వ జన్మ గుర్తున్నా లేక పోయినా పర్వాలేదు.

## నాడీ గ్రంథాల కథ

వ్యక్తి : మాస్టరుగారూ! నాడీ గ్రంథాలనే విచిత్రమైన గ్రంథాలుంటాయట కదా! వాటిలో మన పూర్వ జన్మ విశేషాలు, ఈ జన్మలో విశేషాలు వ్రాయబడి వుంటాయట గదా! అందరి జన్మల పూర్వ జన్మల విశేషాలను దర్శించటం వాళ్ళకెలా సాధ్యమయిందంటారు. అసలా గ్రంథాలను గూర్చిన సత్యాసత్యాలేమిటి?

మాస్టరుగారు : లోకంలో ఎంత విలువైన విషయం బయట పడుతుందో అన్ని నకలు విషయాలు కూడ అక్కడే బయటపడతాయి, అలాంటిదే ఈ నాడీ గ్రంథాల గ్రంథం. పగలు రాత్రి తెలిసిన మనకు రేపు కూడా పగలు రాత్రి వుంటాయని తెలుస్తుంది శనివారం తరువాత ఆదివారం అని తెలుస్తుంది. రాబోయే సంవత్సరంలో ఎండాకాలం, వానాకాలం, చలికాలం ఉన్నాయని తెలుస్తుంది. ఇవి మనకి తెలిసినట్లే ద్రష్టలకు (అంటే మనకన్న కొంచెం ఎక్కువ చూడగలిగే వారికి) యుగాలు యుగధర్మాలు తెలుస్తాయి. అలాగే జనన మరణాలు, జన్మలు, వాటి కార్యక్రమాలు తెలుస్తాయి. ఒక్కొక్క జీవుని కార్యక్రమం కాక జీవుల కార్యక్రమాలు తెలుస్తాయి. కొందరికి ఇంట్లో విషయాలు, కొందరికి ఊళ్ళో విషయాలు, కొందరికి దేశంలో విషయాలు, కొందరికి భూగోళ ఖగోళ పరిభ్రమణం తెలియడంలో ఉన్న తరతమ భేధాల వంటివే ఇవి. దేశంలో విషయాలు తెలియడానికి దిన పత్రిక ఎలాంటిదో జీవుల విషయాలు తెలియడానికి జాతక పత్రిక అలాంటిది. దానితో కొందరికి వ్యక్తుల జన్మ ఫలితాలు తెలిస్తే మరికొందరికి ఆ వ్యక్తుల గుంపులు దిగివచ్చే కథలు తెలుస్తాయి. ఇవే నాడీ జాతకాలు. ఏ శతాబ్దంలోనైనా ఒక ప్రదేశంలో అక్షాంశ,

రేఖాంశాల మీద ఆధారపడి అక్కడ జీవించే జీవులు దిగివస్తారు. వారి జీవిత చరిత్రలు, పేర్ల అర్థాలు మొదలైనవన్నీ గ్రహగతుల ననుసరించి తెలుస్తాయి. వీని గ్రంథస్థ రూపాలే నాడీ గ్రంథాలు. ఇందులో అందరి జీవితాలుండటం సత్యంకాదు. కొంత కాలపరిమితిలో దిగివచ్చే కొన్నివందల జీవుల చరిత్రను కొందరు గుణించి గ్రంథస్థం చేస్తారు. మళ్ళా కొన్ని వందల సంవత్సరాల తరువాత ఇంచుమించుగా అదే క్రమంలో అవే జీవిత ఘట్టాలతో, అవే పేర్లతో, అవే వంశవృక్ష నిర్మాణాలతో మరొక గుంపు జీవులు దిగివస్తారు. వారికి కూడా వెనుక వ్రాసిన గ్రంథాలు పనికి వస్తాయి. ఇక్కడ ఒక రహస్యం వున్నది. ఏ శాస్త్రం రానివారు కొందరు చేరి ఒక ప్రదేశంలో ఒకటి రెండు శతాబ్దాలలో వున్న కుటుంబాల క్రమాలను తీసుకొని జన్మాంతర డైరీ వ్రాసి పెట్టిపోతే కొన్నివందల సంవత్సరాల తరువాత ఇంకొక గుంపు జీవులకు, ఆ డైరీ నాడీ గ్రంథం అవుతుంది. ఉదాహరణకి "రామయ్య భార్య జానకమ్మ. వాళ్ళకి యిద్దరు కొడుకులు. రామయ్యకి పదహారో సంవత్సరంలో వివాహం" అని జరిగినది జరిగినట్లు గ్రంథస్థం చేస్తే మళ్ళా అది ఇంకొక కుటుంబానికి నాడీ గ్రంథం అవుతుంది. అలాగే రామయ్య మిత్రుడి డైరీ వ్రాస్తే అదీ పనికి వస్తుంది. దీనితో అనుకున్నంత జ్యోతిశ్శాస్త్ర ప్రమేయం అక్కరలేదు. కాకపోతే శ్రమపడి వ్రాసిన వాళ్ల కాలానికి అది పనికిరాదు. ఒకరైతు తన సంవత్సర డైరీలో పొలం పనులన్నీ వ్రాస్తే అది స్థూలంగా పనికివస్తుంది. అలాగా జన్మల డైరీలు వ్రాస్తే సూక్ష్మంగా కూడా పనికి వస్తాయి. అది వ్రాసిన వారు ఆ వ్యక్తి జాతక చక్రం, హస్త రేఖలు కూడా వ్రాస్తారు. తరువాత వారు అది చూచుకొని ఈ జాతకాన్ని బట్టి, ఈ హస్త రేఖలను బట్టి ఇన్ని వివరాలు ఎలా వ్రాశాడా అని ఆశ్చర్యపోతారు.

మన కాలంలోనే మన పేరుతో ఎంతమందో ఉంటారు. వాళ్ళలో మనకు వివాహమయిన వయస్సులోనే వివాహమయినవాళ్ళు కొందరుంటారు.

మనభార్య పేరుగల భార్య గలవాళ్లు అందులో కొద్దిమంది ఉంటారు. ఇలా ఒకటి రెండు రాష్ట్రాలలో మన పేరుతో గలవాళ్ళని ఎల్లెడపట్టి డైరీలు వ్రాస్తే కొంచెం ఇంచుమించుగా మన జీవిత ఘట్టాలతో సరి పోలిన జీవితాల వాళ్ళు చాలామంది దొరుకుతారు. ఆ యిద్దరి జాతకాలు ఒకటిగానే ఉండవచ్చు. లేదా ఇద్దరి చేతులో కొన్ని ప్రత్యేక రేఖలు[ముఖ్యంగా వేలిముద్రలు]సామ్యంతో ఉండవచ్చు. ఇలాంటి జాతకాలని వర్గీకరణం చేసిఒక క్రమంలో వ్రాస్తారు నాడీ గ్రంథ కర్తలు. అందులో మనకు పూర్తిగా సరిపోయినదాకా ఓపిక పట్టి జాతకాన్ని వెతుక్కోకపోతే ఫలితాలు సరిపోవు. తన జాతకమే అనుకొని భ్రమపడి ఇంకొకడి జాతకాన్ని వ్రాయించి తెచ్చుకొని కొందరు బాధ పడతారు. ఉదాహరణకు ఈ దిగువ నిచ్చే మూడు డైరీలు చూడండి.

1. ప్రకాశరావు అనే వాడికి భార్య సుబ్బమ్మ, సంతాన బాధను గూర్చి అతడు ఈ జాతకం చూచుకొనడానికి వస్తాడు.

2. సూర్యప్రకాశరావు భార్య రామసుబ్బమ్మ. వాళ్ళకి సంతానం కలిగి నష్టమైంది. వారు సంతాన వివరాలకోసం వస్తారు.

3. కోటి సూర్య ప్రకాశరావు భార్య వెంకట సుబ్బమ్మ. వారికి కొడుకు పుట్టి చనిపోయాడు. తరువాత కూతురు పుట్టి చనిపోయింది. తరువాత సంతానం ఉన్నదేమో తెలుసుకునేందుకు వస్తారు.

ఈ మూడు జాతకాలు పక్కపక్కనే వ్రాసి ఉంటాయి. ఇలాంటి గుంపు 30, 40 జాతకాలు కూడా ఉండవచ్చు. ఒక్కొక్కప్పుడు "వెలుగు అనే అర్థంగల పేరుగల వాళ్ళు" అని గ్రంథం ప్రారంభం అవుతుంది. వాడి పేరు కాంతయ్య కావచ్చు. దానిని చూసి ప్రకాశరావు తనదేనని వ్రాయించుకుంటాడు. పై ఉదాహరణంలో మూడవవాడు మొదటి జాతకాన్ని తనదిగా భావించి వ్రాయించుకొనవచ్చు. వీరి నలుగురికి దాదాపు 30 సంవ

త్సరాల వయస్సు దాకా స్థూలంగా సన్నివేశాలు ఒకేలాగు ఒకే వయస్సులో జరుగుతాయి. ఆ పైన ఎవరి దారి వాడిది. 30 సంవత్సరాలలోపున వ్రాయించుకొనేవాడు ఈ నాల్గింటిలో ఏదో ఒకటి తనది అని పట్టుకు పోవచ్చు. తరువాత ఫలితాలు సరిపోలేదని ఏడుస్తాడు. జాగ్రత్తగా ఓపికతో వెతికించుకుంటే ఆజన్మాంతం ఫలితాలు సరిపోతాయి అనడానికి కీర్తిశేషులు విస్సా అప్పారావు గారు ఉదాహరణ.

ఇక అబద్ధాల నాడీ గ్రంథాల విషయం. కొందరు మోసగాళ్ళు ఒక నాడీ గ్రంథం దగ్గర పెట్టుకొని, అందులో ఉన్న వాటికి నప్పించి మీ రడిగిన విషయాలన్నీ వ్రాసివ్వగలరు. మరి కొందరు సంభాషణలో మీ పేర్లు, విషయాలు, జన్మదినం రాబట్టుకొని మీ జాతకం వెతకడానికి వారంరోజులు టైం తీసుకుని మీరు వచ్చేసరికి సొంత కవిత్వం వ్రాసి ఉంచుతారు. శుభ లేఖలపైన అడ్రసులు వ్రాసినట్లు. మరికొందరు కర్ణపిశాచి మొదలైన క్షుద్ర శక్తులతో మీ మనస్సు నుండి మీ గత జీవితమంతా పేర్లతోసహా రాబట్టి గ్రంథాలు నింపి ఇస్తారు. మరికొందరు ఆ శ్రమ కూడా అక్కర లేకుండా మమ్మల్నే బైండు పుస్తకం, తెల్ల కాగితాలు తెచ్చుకోమని ఒక అరవ తాళపత్ర గ్రంథం తెరచి అందులో చూస్తూ జీవితాన్ని కీర్తించి మీకే డిక్టేట్ చేస్తారు. తిరుజ్ఞాన సంబంధ నాయనార్ అనే నాడీ గ్రంథవేత్త కంబ రామాయణం తాళపత్ర గ్రంథం ముందు పెట్టుకొని కర్ణపిశాచితో ఎంతో మంది జాతకాలు వాల్యూములు నింపారు. ఒక్కొక్కడి జాతకం పాడుతూ ఇలా కూనిరాగం తీసేవాడు. "పార్వతి తన బిడ్డయైన గణపతితో చెబు తున్నది. వత్సా! నీ తొండము స్పర్శగలిగిన ఈ భక్తుడు ఫలితాలు చెప్పించు కొంటూ ఉండగా పైన వాయు విమానం వెడుతుంది." అయిదు నిమిషా లలో విమానం వెళ్ళేది. దీనికి నాడీ గ్రంథం అక్కరలేదు. విమానాల టైం తెలిస్తే చాలు. సినిమా తారలు, డబ్బు బలిసిన వ్యాపారస్తులు వచ్చి

నపుడు ఇలా చదివేవాడు. "వత్సా గణేశా! ఈ జాతకుని 46 వ సంవత్స రంలో భార్య గర్భవ్యాధితో మరణిస్తుంది" గణపతి తల్లి ని ఇలా ప్రశ్ని స్తాడు. "జగన్మాతా! నా భక్తుడికి ఆపద తీరడానికి మార్గం లేదా!" పార్వతి ఇలా చెబుతుంది "లేకేమి నాయనా! ఇతడు పూర్వజన్మలో ఒక ఆడలేడి గర్భంలో బాణం కొట్టి చంపాడు. దాని మగలేడి విలపిస్తూ యితన్ని శపిం చింది. ఈ భక్తుడు మూడు తులాల బంగారంతో లేడి విగ్రహం చేయించి యథోక్తంగా పూజించి ఈ గ్రంథం చదివిన ఋషికి దానంచేసి వస్త్రాలం కారాలతో సత్కరించి ప్రదక్షిణ నమస్కారాలు చేసి ఆశీస్సులు తీసుకుంటే ఈ ఆపద సంభవించదు.

ఇలాంటి వింతలెన్నో! నాడీ గ్రంథాల పేరుతో పవిత్రమైన శాస్త్ర సంప్రదాయానికి ఇలా తాటాకులు కట్టి అప్రతిష్ఠ తెచ్చిన భరతమాత పుత్రులు కూడా ఉన్నారు. తస్మాత్ జాగ్రత్త!

కోరి నాడి గ్రంథాలు తయారుచేయించి వ్రాయించుకునే మహా మహులు కూడ ఉన్నారు. కొందరు గురువుల శిష్యులు తమ గురువుగారి నాడీ గ్రంథాన్ని చక్కని సంస్కృత కవిత్వంలో రచన చేయించి ప్రచారం చేస్తున్నారు. అందులో ఆ గురువు పూర్వ కల్పాలలో దత్తాత్రేయుడని, అగస్త్య మహర్షియని, నందీశ్వరుడని ఈ జన్మలో మిగిలిన మధాంధులైన గురువుల గర్వం అణచి ధర్మ సంస్థాపన చేయటానికి వచ్చారని (ఇంకొక గురువు నాడిలో ఈ గురువు మధాంధుడని ఉంటుంది.) ఆ గురువు శిష్య పరంపర వాళ్ళ నాడీ జాతకాలు కూడ గురువు జాతకంతో పాటు తుట్టెలాగ బయటకు కదిలి వస్తాయి. ముఖ్యంగా ఈ నాడీ గ్రంథం వ్రాయించిన గ్రంథ సాంగుడు ఉత్తమ శిష్య పుంగవుడని, పూర్వ జన్మలో భరద్వాజు డని మిగిలిన శిష్యులెవ్వరూ ఆ గురుపుజ్యోతిని ఇతనిలాగ చూడగలవారు కారని ఉంటుంది. మరి కలియుగం గదా! ఇలాంటివి తప్పవు. ఒక్కొక్క ప్పుడు పార్వతి, గణపతి, కుమారస్వామి కాకభుశుండుడు పూర్వయుగాల్లో

వ్రాసి యుంచిన ఈ శ్లోకాల్లో వ్యాకరణ దోషాలు కుప్పతిప్పలు, పైగా "వ్యాపార ద్దన మత్తయ్యా" మొదలగు ప్రయోగాలు, అందులో వాణిజ్యం అనడానికి వ్యాపారం అని పొరపాటున వ్రాయడం కూడ ఉంటాయి.

వ్యక్తి: నాడీ గ్రంథాల గ్రంథం చాలా చిత్రంగా వుంది మాస్టారూ! నాడీ గ్రంథాల నిర్మాణాన్ని గూర్చి మీరు చెప్పిన అంశాలు ఎంత ఆశ్చర్యాన్ని కల్గించాయో నకిలీ నాడులను గూర్చి మీరు చెప్పిన విశేషాలు అంత నవ్వును పుట్టించాయి. వినేవాళ్ళ వ్యామోహాన్ని చెప్పేవాళ్ళు సొమ్ము చేసుకుంటున్నారు. ఈ సత్యాలు సామాన్యులకు ఎంత తెలిస్తే అంత మంచిది.



# F. చేతబడులు - దిగదుడుపులు

## చేతబడు లున్నాయా ?

వ్యక్తి : మాస్టరుగారూ ! ఎవరికైనా దీర్ఘకాలం ఒంట్లో బాగుండక పోతే వాళ్ళ బంధువులు ఎవరైనా గిట్టని వాళ్ళు చేతబడి చేశారనో, చిల్లంగి పెట్టారనో అనుమానిస్తూ ఉంటారు. ఎవరైనా అనుకోకుండా పోయినా, వాళ్ళ వాళ్ళకు ఈ అనుమానం వస్తూ ఉంటుంది. నిజంగా చేతబడులు ఉంటాయా? ఉంటే అవి ఎవరిమీద చేస్తే వారి మీద పనిచేసి హానిని కలిగిస్తాయా ?

మాస్టరుగారు : చేతబడి అనేది తప్పకుండా పనిచేస్తుంది. కాని అందరి మీదా పనిచేయదు. ఎవరికైనా దుర్మరణం పొందడం పూర్వకర్మ ఫలితమే గనుక అలాంటివాడి మీద మాత్రం పనిచేస్తుంది. ఒక్కొక్కడు పుర్రెను చూపిస్తే దడుసుకుంటాడు. ఒక్కొక్కడి వాకిట్లో ఎముకలు పేర్చి పెడితే వాడికి భయం వేసి జ్వరం వస్తుంది. అలాగే ఒక బొమ్మను తయారు చేసి ఒకడి పేర ఆ బొమ్మకు మేకు దింపితే వాడి శరీరంలో ఆ భాగానికి జబ్బుపుట్టి మరణిస్తాడు. ఇలాంటి వాటి మీద భయాలు, అనుమానాలు ఉన్న వాడికి ఇలాంటి ప్రక్రియలు సోకి పనిచేస్తాయి. పూర్వ జన్మలో ఎవరికైనా ప్రాణ భీతి కలిగిస్తే ఈ జన్మలో భయాలతో, అనుమానాలతో బ్రతికే మన స్తత్వం అబ్బుతుంది. అలాంటి వాళ్ళమీద మాత్రం చేతబడులు తప్పక పనిచేస్తాయి. కనుకనే కొన్ని కుటుంబాలలో వ్యక్తులు ఎప్పుడూ తమకు ఎవరో ఏదో అపకారం చేశారని నమ్ముతూ ఉంటారు. అలా కాక అమాయకులుగా ఏదీ పట్టించుకోకుండా, నిర్భీతిగా బ్రతికే వాళ్ళమీద ఏమీ పని చేయవు. ఎదుటి వాడిలో అపకార బుద్ధి ఉన్నదని శంకించడం దుష్కర్మ కనుక అలాంటి సందేహాలు ఉన్నవాళ్ళ మీద పనిచేస్తాయి. అది వాళ్ళ

దుష్కర్మ ఫలితమే. అచంచలమైన భక్తితో దైవానికి సమర్పణగా తమ జీవితాన్ని భావించి జీవించే వాళ్ళ మీద ఏవీ పనిచేయవు. వాళ్ళకి కష్టాలు వచ్చినపుడు కూడ ఇంకొకరిమీద అనుమానపడటం ఉండదు. గనుక వారి మీద అవి పనిచేయవు. అలాగే మృత్యుభీతిలేని వాళ్ళ మీద పనిచేయవు. ముఖ్యంగా యుద్ధంలో పోరాటం చేసే వాళ్ళ మీదా పనిచేయవు. అందుకనే చేతబడిచేసి చంపుతామని బెదిరించే వాళ్ళెవరూ వాళ్ళని ఏమీ చెయ్యలేరు. పాకిస్తాన్ యుద్ధంలో ఈ చేతబడి మొనగాళ్ళు పాకిస్తాన్ సైన్యాలమీద చేతబడి ఎందుకు చేయలేదు. అక్కడ ఈ పప్పు ఉడకవు. ఏదో ఒక కక్కుర్తి ఉంటేగాని భీతి ఉండదు- భీతి ఉన్నవాడిమీద గాని చేతబడి పనిచేయదు.

వ్యక్తి : అయితే భయపడని వాళ్ళని, నిజమైన భక్తి గల వాళ్ళని, మృత్యుభీతి లేని వాళ్ళని చేతబడులు ఏమీ చేయలేవన్న మాట. భయపడే వాళ్ళలో కూడ వాడు బ్రతకాలా, పోవాలా అన్నది నిర్ణయించేది వాడిపూర్వ కర్మే గాని చేతబడి కాదన్న మాట. చేతబడి చేసినా, చేశారని వాడు భయ పడినా బ్రతికే యోగం ఉంటే ఆ చేతబడిని తిప్పికొట్టేవాడు ఏదో ఒక రూపంలో దొరుకుతాడన్న మాట నిజమే. చేతబడి చేసేవాడు అవతలివ్యక్తి జీవితాన్ని ఇలా జరగాలని నిర్ణయించలేడు గదా! నిర్ణయం మన యోగాన్ని బట్టి ఉంటుంది. కనుక చేతబడులు, గీతబడులు అనే ఊహలు, అపోహలు మాని మన మానాన మనం బ్రతికితే ఏ గోలా ఉండదు. అంతేనా మాస్టారూ !

మాస్టరుగారు : ఉన్న విషయం ఇంతేనోయ్! మన జీవితానికి మనం కర్తలం గాని, మరొకడు ఎప్పుడూ కర్తగాలేడు. మనకు జరిగే మంచో, చెడో మన సంస్కారాన్ని బట్టి, ప్రవర్తనను బట్టి జరుగుతుంది. ఈ సత్యాన్ని గమనించిన వాడు తననుతాను దిద్దుకుంటాడు కాని ఇతరుల మీద పడి ఏడవడు. ఇతరుల మీద పడి ఏడవటమనే స్వభావం మనలోలేన ప్పుడు ఎవరు ఏమిచేసినా, ఏమిచేయించినా మనకు ఊదేది ఏమీ లేదు. అలా

కాక ఇతరుల మీద పడి ఏడవటమనే స్వభావం మనలో ఉన్నప్పుడుఅవతల వ్యక్తి ఏమీ చేయకపోయినా చేశాడనే అనుమానంతో మనం మంచం ఎక్కవచ్చు. అలా మంచం ఎక్కిన వాళ్ళు, మరణించిన వాళ్ళూ చాలా మంది ఉన్నారు.

## దిగ దుడుపుల కథ

వ్యక్తి: కొందరు కోయవాళ్ళు "నీ వెక్కడో దాటకూడని నీళ్ళు దాటావు. అప్పటినుండి నీ కథ అడ్డం తిరిగింది." అని భయపెడుతూ ఉంటారు. నిజంగా ఎర్రనీళ్ళు, దిగ దుడుపుల నీళ్ళు దాటితే, ఆ కీడుదాటిన వాళ్ళను పట్టుకుంటుందా? అసలీ దిగ దుడుపుల కథ ఏమిటి ? ఎందుకు దిగ దుడుస్తారు? అవి దాటిన వాళ్ళని ఎందుకు ఇబ్బంది పెడతాయి? ఈ దిగ దుడుపులు అవసరమా? ఇవి శాస్త్రీయమైనవేనా? లేక మూఢ నమ్మకాలా?

మాస్టరుగారు: దిగదుడుపులు, ఎర్రనీళ్ళు, దిష్టి తీసిన వస్తువులు తొక్కినా, దాటినా పీడలు, అనారోగ్యాలు చుట్టుకుంటాయని ఒక ప్రతీతి ఉన్నది. ఇందులో కొంత నిజం వున్నది. కొంత మనోదౌర్బల్యంవున్నది. దిష్టి, దిగదుడుపు మొదలైన విధానాలు, ప్రాచీన శాస్త్రీయ వైద్య విధానాల్లో ఒకభాగం. ప్రాచీన జాతుల వైద్య శాస్త్రం, నవీన వైద్యశాస్త్రంకన్నా చాలా విస్తృతమైనది, శాస్త్రీయమైనది అనే సత్యం ఏ డాక్టరూ కాదనడానికి వీలు లేదు. కాదనడానికి ముందు ఈ దిగువ అంశాలను ఋజువు చేయవలసిన బాధ్యత వున్నది.

1. ప్రాచీన భారతీయ, ఈజిప్టు, చాల్డియా, మెక్సికో, ఆఫ్రికా జాతుల వైద్య శాస్త్రాలలో ద్రవ్యమయమైన శరీరానికే కాక ప్రాణమయ, మనోమయ, సంస్కారమయ శరీరాలకు కూడా వైద్యవిధానం వున్నది. నవీన వైద్య శాస్త్రం ముఖ్యంగా అల్లోపతీ ద్రవ్యమయ శరీరాన్ని దాటి ఏమీ ఎరుగదు.

2. మానవుడు దేహం కాదని, దేహానికి చేసే రిపేరు మానవుణ్ణి ఆరోగ్యవంతుణ్ణి చేయడానికి చాలదని ప్రాచీనుల సిద్ధాంతం. అనారోగ్యా లకు కారణాలు మానవుడి ఇష్టాయిష్టాలలో, అలవాట్లలో ఉంటాయి కానీ శరీరాల్లో వుండవు. ఇష్టాయిష్టాలకి వైద్యం వుంటుందని కూడ అల్లోపతీకి తెలియదు.

3. స్థూల శరీరం వేరే ఒక శరీరం కాదని, సూక్ష్మశరీర నిర్మాణం మీద ఆధారపడి, నీళ్ళమీద మంచుగడ్డలాగ తేలుతూ వుంటుందని, సూక్ష్మ శరీర నిర్మాణంలో వచ్చిన ప్రతి మార్పు స్థూల శరీరం మీద వ్యాధిగా కను పిస్తుందని అల్లోపతీకి తెలియదు. నీళ్లల్లో సిరాకలిపి మంచుగడ్డ కట్టిస్తే ఆ మంచుగడ్డకున్న సిరారంగు నీళ్ళతో కడిగితేపోదు. అలాగే ఔషధాలతో భౌతిక శరీరాన్ని కడిగితే వ్యాధిబాధలు తాత్కాలికంగా పోవచ్చుగాని వ్యాధులు పోవు. మళ్ళీ వస్తూనే వుంటాయి.

4. పరిసర ప్రాంతాలకి, వాతావరణానికి ప్రభావితమయ్యే లక్షణం స్థూల శరీరం కన్నా సూక్ష్మ శరీరానికి ఎక్కువ వుంది. గోటితో గుచ్చితే ఆ గిచ్చు మాయమయ్యే లోపున కొన్ని గంటలు నిలవ ఉండటం తరువాత క్రమంగా మాయమవడం సూక్ష్మ శరీరంలో కలిగే మార్పులేగాని స్థూల శరీరానివి కావు. సూక్ష్మ శరీరం వెళ్ళిపోయిన శవాన్ని గిచ్చితే ఆ గిచ్చు మాయమవ్వకుండా అలాగే వుంటుంది. బ్రతికివున్న దేహానికి బ్లేడు తెగితే మళ్ళా చెక్కుకట్టుకు రావడం సూక్ష్మశరీరంలో జరిగే వైద్యం. ఈ సూక్ష్మ శరీరం ప్రాణమయము, మనోమయము అని ప్రాచీన శాస్త్రం చెబుతుంది. దిష్టి తగలడం, దెయ్యం పట్టడం, సూక్ష్మ శరీరానికే. కనుకనే అవలింతలు, ఒళ్ళు విరుపులు వస్తాయి. దానికి వైద్యమే దిష్టిమంత్రం, భూత వైద్యం, [భూతవైద్యం పేరుతో అనేక మూర్ఖ, మోటుపద్ధతులు అమలులోఉన్నాయి. వాటిని మనం లెక్కలోకి తీసుకోవడం లేదు.] దైవభావనతో మిళితమైన సూక్ష్మ శరీరం ఆరోగ్య తరంగాలను వెదజల్లుతుంది. ఆ తరంగాలు స్పర

ద్వారా, చూపుద్వారా, సంభాషణ ద్వారా, నీటిద్వారా, కొన్ని చెట్లు కాల్చిన బూడిద ద్వారా ఇంకొకరికి సంక్రమించి ఆరోగ్యవంతుణ్ణి చేస్తాయి. తీర్థం ఇవ్వడం, విభూతి పెట్టడం అంటే ఇదే. ఈ సూక్ష్మ శరీర వైద్య విధానం అమోఘమైనది. అలాగే ఎర్రనీళ్ళు, ఎండుమిరప కాయలు, ఉప్పు కూడా ప్రసారణ ద్రవ్యాలుగా వాడవచ్చు. కొబ్బరికాయ, నిమ్మకాయ కూడా వాడ వచ్చు. వీటినే దిగదుడుపు వస్తువులు అంటారు. వీటితో చేసే ప్రక్రియని దిష్టి తీయడం అంటారు. సంప్రదాయ సిద్ధమైన కుటుంబాలలో నేటికి ఈ పద్ధతి అన్ని దేశాలలోనూ వుంది. ఫ్రెంచిదేశంలో ముసలమ్మలు బిందెలో మిరియాలు, మిరపకాయలు, ఉప్పు ఎర్రగా మాడ్చి దిష్టి తీసి పళ్ళెంలో నీళ్ళుపోసి ఆ నీళ్ళమీద ఆ బిందెను బోర్లిస్తారు. వేడిగా వున్న బిందెలో గాలి తక్కువ అవటం చేత బిందె మూతితో పళ్ళెంలోని నీళ్ళను ఎగ పీలుస్తుంది. అది పీల్చే లోపున ఒళ్ళు నొప్పులు, ఆవలింతలు తగ్గుతాయి.

ఇక ఇందులోని మూఢ విశ్వాస భాగ మేమిటంటే దిష్టి మంత్రం పెడుతున్నవాడు ఆ దృష్టి దోషాన్ని తనలోకి తీసుకుంటున్నానని. దానితో వాడి సంకల్ప శక్తి వల్ల ఆ దృష్టి దోషం తనకు సోకి మంత్రం పెడు తున్నంత సేపు ఆవలింతలు వస్తాయి. కొందరు వైద్యులుకూడా రోగిలోని రోగాన్ని తాను తీసుకుంటున్నానని భ్రమపడే వాళ్ళున్నారు. దానితో నానా రోగాలు సంక్రమిస్తాయి. ఈ లక్షణం యోగులు, గురువులు అనబడేవాళ్ళల్లో కూడా కొందరికి ఉంది. ఎవడి చుట్టూ ఉన్న ఆకాశం, సూర్యరశ్మి, ప్రాణ వాయువు వాడి రోగాలను నయం చేయడం ఈ వైద్యంలోని శాస్త్రీయ విధా నం. అలాకాక వైద్యుడు తన సంకల్పశక్తితో ఆ రోగాలను ఎగ పీల్చడం అంధ విశ్వాసం. అలాగే దిగదుడిచిన వస్తువులను తొక్కినా, దాటినా ఆ పీడలు సంక్రమిస్తాయని నమ్మడం కూడా! నమ్మకం ఉన్నవాళ్ళకి తప్ప కుండా సంక్రమిస్తాయి. ఇది నమ్మకంలోని బలంవల్లనే కాని, దిగదుడుపుల లోని దోషం వల్లకాదు. ఈ మూఢనమ్మకాన్ని ఆధారంగా చేసుకుని నీ.వేదో

వాటావని భయపెట్టి తాయత్తులు మొదలైన వాటితో ధనార్జన చేసే వాళ్లున్నారు. వైద్యుడు తన బావమరిదిచేత మెడికల్ షాపు పెట్టించి ఆ షాపులోని మందులన్నీ రోగికి వ్రాసిచ్చినట్లే ఇది కూడా మోసపు వృత్తి.

## తాయత్తుల మహిమ

వ్యక్తి : అయితే మాస్టరుగారూ! తాయత్తుల మొదలయిన వాటికి నిజంగా శక్తి వుంటుందా? ఈ తాయత్తులను గూర్చి రకరకాల కథలు చెబుతూ ఉంటారు. కొందరు కోయదొరలు పగలు తాయత్తులిస్తే అవి కట్టుకున్న స్త్రీలు రాత్రివాళ్ళ దగ్గరకు ఆకర్షింప బడతారని మొదలైన వెన్నో విశేషాలు చెపుతూ ఉంటారు. ఇంతకీ వీటి కథేమిటి?

మాస్టరుగారు : తాయత్తులు, మూలికలు సూక్ష్మ శరీరం మీద ప్రభావం కలగజేస్తా యనడంలో సందేహమేమీలేదు. పూర్వ వైద్య విధానంలో "మణి మంత్రౌషధ సిద్ధులు" అని ఉండేవాళ్లు. మణి అంటే ఖనిజాలతో చేయబడిన లోహాది వస్తువులని అర్థం. ఇక మంత్రవైద్యం, బీజాక్షరాలు, వేద మంత్రాలు, సంభాషణ, సంగీతాల ద్వారా జరిగే వైద్యం. ఓషధులంటే చెట్లు. కొన్ని చెట్ల స్పర్శవల్ల సూక్ష్మ శరీరం ప్రభావితమౌతుంది. మణులలో అయస్కాంతం, ఓషధులలో తెల్ల జిల్లేడు, తులసి, రావిచెట్టు ముఖ్యమైనవి. అలాగే రాగి, పంచ లోహం ముఖ్యమైనవి. ఈ మధ్య అమెరికా వాళ్లు నమ్మారని నాగరికులు కూడా చేతికి రాగి కడియం వేయించుకుంటున్నారు. కాలికి వీరభద్రుడి కడియమని ఉంది. దాన్ని అమెరికా వాళ్ళింకా నమ్మలేదు గనుక బానిస బుద్ధులైన భారతీయులు ఇంకా వేసుకోవడం లేదు.

ఇవి కాక మరికొన్ని ఖనిజాలు, వృక్షాలు దుష్టంగాకూడా వాడవచ్చు. ఉదాహరణకి ఉమ్మెత్తాకు ఇంట్లో హోమం చేస్తే చేయబడిన ఇంట్లో అంద

రికీ నిద్రలో దెయ్యాలు కనిపిస్తాయి. దీనినే ఉన్మత్తభైరవీ తంత్రం అంటారు. మళయాళ దేశంలో దీన్ని ఎక్కువగా వాడేవారు. అలాగే పిల్లి మీసాలు, కుక్కతోక వెంట్రుకలు కత్తిరించి కలిపి ఇంట్లో హోమం చేస్తే ఆ ఇంట్లో ఏ యిద్దరికీ పొత్తుకుదరదు. దీనికి మంత్రాలు అక్కర్లేదు. ఎవరైనా చేసి ఫలితం చూడవచ్చు. ఏ జంతువునైనా చంపి దానినోట్లో ఆముదపు గింజలు పెట్టి పాతిపెడితే చెట్టు మొలుస్తుంది. ఆ చెట్టుకి పండిన ఆముదపు గింజ నోటిలో పెట్టుకుని పదిమంది మధ్యకుపోయి ఆ జంతువు పేరు తలచి అరిస్తే కొన్ని క్షణాలసేపు ఆ అరుస్తున్న వాడికి ఆ జంతువుల తలఉన్నట్లు ఇతరులకు కనిపిస్తుంది. ఇవన్నీ మనోమయ శరీరంలో వికారాలు పుట్టించడం. కోడిపెంట ధూపం వేస్తే ఎదుటివాడికి బుర్ర పనిచేయదు. అంతలో వాడు చెప్పినట్లుచేస్తాడు. అలాచేసి డబ్బులు కాజేసే భూత వైద్యులున్నారు. ఇలాగే కొన్ని ప్రక్రియలతో దూరంనుండి సూక్ష్మశరీరాన్ని ఆకర్షించవచ్చు. (Astral attraction) నిద్రలో ఇలా ఆకర్షిస్తే వాళ్లు తెలియకుండా లేచి వెళ్ళిపోతారు. అంటే భౌతిక శరీరాన్నికూడా తీసుకునే వెళ్ళిపోతారు. ఇలా చేయడానికి కొందరు మూలికలు వాడతారు. తాయిత్తుగా ఇచ్చి ఆకర్షిస్తారు. కొంతరు గర్భిణీ స్త్రీ గర్భంలో ఉన్న పిండాన్ని తెంపి తీసివేసి దాంట్లో వున్న సూక్ష్మ శరీరాన్ని ప్రయోగించి ఇతరులను ఆకర్షిస్తారు. ఇవన్నీ శాస్త్రీయ పద్ధతులకు దుర్వినియోగాలు, డాక్టర్లలో కొందరు దుష్టులు ఆపరేషన్ కోసం మత్తు మందిచ్చి అందమైన స్త్రీని చెరిచిన కేసులున్నాయి. అక్కర్లేకపోయినా ఆపరేషన్లు చేసి డబ్బులుగుంజే డాక్టర్లున్నారు గదా! ఇవన్నీ శాస్త్రద్రోహానికి ఉదాహరణలు. ఇవన్నీ లొంగిన వారిపైననే పని చేస్తాయి. మంచి చెడ్డల వివేకం కలవాళ్లు, దైవభావనతెలిసినవాళ్లు అలాంటి భూతవైద్యాలకి, ఇలాంటి డాక్టర్లకి లొంగరు గనుక వారిమీద అవి పని చేయవు.

## నరుని దృష్టికి నల్ల రాయి...

వ్యక్తి : మాస్టరుగారూ! నరుడి దృష్టికి నల్లరాయి కూడా పగులు తుందంటారు కొందరు. నిజంగానే కొంత కొంతమంది చూపులవల్ల చెట్లు మాడిపోతూ ఉండటం, జంతువులు దెబ్బతింటూ ఉండటం, చక్కగా వున్న మనుష్యులకు ఆ రోగ్యాలు దెబ్బతింటూ ఉండటం జరుగుతూ ఉంటుం దని చెప్పుకుంటూ ఉంటారు, నేను ప్రత్యక్షంగా కొన్ని సన్నివేశాలు చూశాను కూడా. మా ఇంటి పక్కన మేడ దిగుతూ మాకు తెలిసిన ఒకా యన మా దొడ్డివైపు చూచి గెలవేసిన అరటి చెట్టును చూపిస్తూ చాలా బాగుందిరా ఆ చెట్టు అన్నాడు, పక్కవాడితో. అతనింకా పూర్తిగా మెట్లు దిగనేలేదు. అరటి చెట్టు ఫెళ ఫెళ మని విరిగి నేల కూలింది. నా ఆశ్చ ర్యానికి అంతులేదు. ఈ దృష్టిదోషం ఆ వ్యక్తులకు ఎలా ఏర్పడుతుంది? తమ దృష్టికి ఆ దోషం ఉన్నదని తెలియని వాళ్ళకూడా వున్నారు. ఈ దుస్థితినుండి బయట పడాలంటే ఆ వ్యక్తి ఏం చేయాల్సి వుంటుంది?

మాస్టరుగారు: నరుడి దృష్టికి నల్లరాళ్ళకూడా పగలుతాయని చెప్పిన మాటలో అతిశయోక్తి ఉన్నా సత్యంగూడావుంది నల్లరాళ్ళు సామాన్యంగా పగలవు గాని నరులమీద, జంతువులమీద దృష్టిదోషం బలంగా సోకడం ప్రత్యక్షంగా చూస్తాం. ఆవుకి పాలు పితుకుతున్న శబ్దం విని ఒకాయన అది మంచి ఆవు అనుకున్నాడు. మరునాటినుండి ఆ ఆవుకి పొదుగు పుండ్లు పడి నెత్తురు వచ్చింది. నిమ్మకాయలు మా దొడ్లో కాసినాయని ఇస్తే ఒకమె బాగున్నాయనుకొంది. రోజులమీద ఆ నిమ్మచెట్టు ఎండి చనిపోయింది. ఇది మానసిక శరీరం (మనోమయకోశం) లో ఉన్న ఒక దుష్టప్రకృతి. కొందరికి ఆశీర్వాద బలం ఉన్నట్లే ఈ దృష్టి దోషం కూడా కొందరికి వుంటుంది. ఇది పుట్టుకతో వస్తుంది. ఇది ఉన్నట్లు కూడా వాళ్ళకి తెలియక

పోవచ్చు. నిత్యపూజ, వేదాధ్యయనం, జప హోమ తపస్సులు ఆచరిస్తే ఇదిపోతుంది. ఈదోషం అందరిమీద పనిచేయదు. సుకుమార శరీరులు, తేలికగా అలసి పోయేవాళ్ల భయాందోళనలు కలవారు ఎక్కువగా దీనితో ప్రభావితు లౌతారు. వాళ్ళుకూడా నిత్యం దైవధ్యానం చేస్తే ఈ ప్రభావం పని చేయదు. ముఖ్యంగా అనుమానాలు, ఎదుటి వాణ్ణి శంకించడం, దెయ్యాలను, భూతాలను గూర్చి ఎక్కువగా ఆలోచించడం కలవారి మీద ఇవి ఎక్కువగా పనిచేస్తాయి. అంతేకాదు. వారి ఇంట్లో, ప్రాంగణంలో తిరిగే జంతువులపైన, పెరిగే చెట్లపైన కూడా ఈ దృష్టి దోషాలు, చేతబడులు ఎప్పటికప్పుడు పనిచేస్తూ ఉంటాయి. నమ్మని వాళ్ళమీద, వాళ్ళ చెట్లమీద, జంతువుల మీద పని చేయవు.

ఈ నమ్మకపోవటంలో రెండు రకాలుంది. భయపడి నమ్మకపోయే వాళ్ళు కొందరు (ఎక్కువగా నమ్ముతూ నమ్మకూడదు అనుకునే వాళ్ళు) సమస్తంలో దైవమే ఉన్నాడనితెలిసి వీటిని నమ్మక పోయేవాళ్ళు కొందరు ఉంటూ ఉంటారు. అందులో మొదటి తరగతి వాళ్ళమీద ఇవి ఎక్కువగా పనిచేస్తాయి. అంటే బాహాటంగా నమ్మి అనుమాన పడే వాళ్ల మీదకన్నా ఎక్కువబలంగా పనిచేస్తాయి. ఇక రెండవ తరగతి వాళ్ళమీద అంటే నిజమైన దైవ భావన గల వాళ్లమీద ఏవీ పని చేయవు.

వ్యక్తి : నిర్మలంగా నిశ్చింతంగాఉండటం, నిరంతర దైవభావనలో ఉండటం మానవుడికి అభ్యాసమైతే ఈ చేతబడులు, దిగ దుడుపులు, తాయత్తులు, తంకర్లు, దృష్టిదోషాలు ఇవేవీ పని చేయవన్నమాట. అందుకే మన వాళ్ల ప్రతి ఇంట్లో తప్పని సరిగా పూజామందిరమని, దేవుడికి దీపారాధన చేసుకోవడమని, సద్గ్రంథ పఠనమని, సంకీర్తన చేసుకోవట మని

ఏర్పాటు చేసుకుంటూ వచ్చారు. అడుగడుగునా దైవ భావన కలిగేటందుకు అనుగుణంగా జీవితాన్ని మలచుకుంటూ వచ్చారు ఈ సంప్రదాయమే మనకు శ్రీరామరక్ష! అంతేనా మాస్టారూ!

మాస్టరుగారు : అంతేనోయ్! మనసు పెట్టి ఆచరించిన కొలదీ మన వాళ్ళు ఏర్పాటుచేసిన సంప్రదాయం ఎంత దివ్యమైనదో అనుభవానికి వస్తుంది. ఆ దివ్య జీవనానికి అలవాటు పడినవాడు మరొకడికి దేవుడి తరఫున అభయం పడతాడుగాని తాను భయపడడు.



# G. మందులు - వశీకరణం

## వశపరచుకునే మందులు

వ్యక్తి : మాస్టరుగారూ! కొంతమంది స్త్రీలు పురుషులకు మందులు పెట్టి తమ వశంలో ఉంచుకుంటూ ఉంటారని వింటూ వుంటాం. కొన్ని సందర్భాల్లో భార్యలు భర్తలను తమ వశంలో ఉంచుకొని ఈ మందుల ద్వారా తమ గుప్పెట్లో పెట్టుకొని మిగిలిన బంధువులకు కాకుండా చేస్తూ ఉంటారని కూడ వినికిడి. అలాంటప్పుడు వాటిని కక్కించే వాళ్ళుంటారని, వాళ్ళు ఎన్నాళ్ళనాటి మందునైనా కక్కించగలరని చెప్పుకుంటూ ఉంటారు. నిజానికి ఇలాంటి మందు లున్నాయా? వీటి కథేమిటి?

మాస్టరుగారు : అపేక్షలు పోయేందుకు, మనస్సు విరిగి పోయే టందుకు మందులు పెట్టటం, అవి పనిచేయటం నిజం. మనస్సుని పనిచేయ కుండా వికాసం తగ్గించే ద్రవ్యాలని ఈ ప్రక్రియల్లో వాడతారు. ఉదా హరణకి ఒక స్త్రీ తన గోరు తీసి చూర్ణంచేసి పురుషుడికి ఆహారంలో కలిపి ఇస్తే ఆ పురుషు డామెకు లొంగుతాడు. ఇలా పురుషుడు చేసినా స్త్రీ లొంగు తుంది. మలాన్ని ఎండబెట్టి ఆహారంలో కలిపి ఇచ్చినా ఇలా జరుగుతుంది. స్త్రీరజస్సు పురుషుడికి, పురుషుని శుక్రం స్త్రీకి ఇలాగే పనిచేస్తాయి ఇలాంటి వెన్నో ప్రక్రియలు కొన్ని తంత్ర గ్రంథాల్లో చూడవచ్చు. ఫలితాలు ప్రత్య క్షాలు. కానీ ఆనాటి నుండి వారి ఆరోగ్యం నశించి క్రమంగా కృశించి పోతారు. కొందరు జడులై పోవడం కూడ కద్దు. కొన్ని తెలుగు జిల్లాలలో వైధవ్యం పొందిన స్త్రీలు ఒక విషపదార్థాన్ని [పేరుచెప్పడం మాకిష్టంలేదు] ఆవగింజలా చేసి ఆవాలతో కలిపి ఉప్మా మొదలైన వాటిలో పోపువేసి పెడతారు. మూడు మాసాల్లో అన్న హితవులేక ఆ పురుషుడు చచ్చి పోతాడు. ఇలా ఎంతమంది పురుషుల్ని చంపితే అంత ఆయుర్దాయం వచ్చే

జన్మలో భర్తకి పెరుగుతుందని వారి నమ్మకం. ఇవి భౌతిక విషాలు. కనుక జాగ్రత్త వహించడం అవసరం. కేవల దైవభావన ఇక్కడ రక్షించదు.

ఇక ఈ తిన్న మందులకు పరిహారం శాస్త్రీయమైన ఔషధ సేవన మొక్కటే. ఉదాహరణకి హోమియోపతిలో "నక్స్‌వామికా" IM (Nux vomica IM) రెండు మూడు డోసులు రెండు మూడు నెలల్లో వాడితే ఇలాంటివన్నీ రహితమౌతాయి. ఇదీ కాక కక్కించడం అనే పద్ధతి ఒకటి ఉంది. అది వట్టి బూటకం. తిన్నది కడుపులో నిలవ ఉంటుందా? ఆరునెలల క్రిందట పెట్టిన మందు కక్కితే పడిపోతుంది అనడంకన్న మూర్ఖత ఇంకొకటి లేదు. తిన్నది ఏదైనా జీర్ణం కావడానికి కొన్ని గంటలు చాలు కాక పొతే దీనికొక ప్రయోజనం ఉంది. మూర్ఖులకి సంశయ రహితం చేయడానికి సైకలాజికల్ ట్రీట్‌మెంట్ కింద ఈ మూర్ఖపద్ధతి పనికి వస్తుంది. ఎవరో తనకు మందు పెట్టారని ఊరికే అనుమానపడే వాళ్ళకి ఈ కక్కించడమే రాజ వైద్యం, భూతవైద్యం. దీన్ని అడ్డు పెట్టుకొని డబ్బు సంపాదించేవాళ్ళు శవాలమీద గుడ్డలు ఎత్తుకుపోయే వాళ్ళ వంటివారు.

వ్యక్తి : మందులు ఉన్న మాట నిజం, కక్కించటం అనే మాట అబద్ధం అన్న మాట. మందులు పెట్టడం వల్ల వ్యక్తులు కృశించి, నశించిపోతారని తెలిసికూడా పెట్టేవాళ్లు అమాయకులైనా అయి ఉండాలి, అన్నిటికీ తెగించిన వాళ్ళయినా అయి వుండాలి.

### వశీకరణ ఉంగరాలు

వ్యక్తి : మాస్టరుగారూ ! స్త్రీలను వశీకరణం చేసుకోవడం కోసం ఉంగరాలు ఉన్నాయని, అవి పెట్టుకుంటే కోరినవారు వశమౌతారని పత్రికలలో కూడ ప్రకటనలు కనబడుతూ ఉంటాయి. ఈ మరి ఉంగరాల కథేమిటి?

మాస్టరుగారు : వశీకరణానికి ఉంగరాలు, తాయత్తులు అమ్మటం పద్ధతి ఒకటి ఉన్నది. పత్రికలలో కూడ ప్రకటనలు చూస్తూ వుంటాం. వశీకరణం కావాలి అనే బుద్ధి గలవాడు దుర్బల హృదయుడని వేరే చెప్పనక్కరలేదు. ఆరోగ్య వంతుడైన వాడికి భార్య వశీకరణం చాలు. మిగిలినది చిత్త కుక్క వంటి ప్రవర్తన. అలాంటి వాళ్ళకి అలాంటి స్త్రీలే లొంగుతారనడంలో అసహజత ఏమీలేదు. వానికి తాయత్తు అక్కరలేదు. ఉభయ పక్షాలకి వ్యభిచార బుద్ధి ఉండటం చాలు. అది లేనిచోట తాయత్తులు కట్టుకున్నా, ఉంగరాలు పెట్టుకున్నా తన్నులు తినడం తప్పదు. ఇక ఈ తాయత్తులు. ఉంగరాలు అమ్మేవాళ్ళ విషయం ఏమిటంటే కొనేవాళ్ళున్నప్పుడు అమ్మేవా డమ్ముకుంటే తప్పేముంది? పూర్వం "చాడీలు చెప్పేవారికి శిక్ష ఏమిటి" అని అక్బరు ప్రశ్నిస్తే "వినేవాళ్ళ చెవిలో దబ్బనాలు పెట్టి పొడవటం" అని బీర్బల్ చెప్పాడుట. అలాంటిదే ఇదీను.



# H. పూనకాలు - ఆవేశాలు

## పూనకాల నిజస్వరూపం?

వ్యక్తి : మాస్టరుగారూ ! కొందరికి తరచుగా పూనకాలు వస్తూ వుంటాయి. ఉత్సవాలలో, జాతర్లలో పూనకాలు వచ్చి ఊగిపోయే వాళ్ళని చూస్తూ వుంటాం. దేవుళ్ళు, దేవతలు వాళ్ళ నావేశించి మాట్లాడుతూ ఉంటారని అందరూ వాళ్ళ దగ్గరకు చేరుకుంటారు. నిజంగా వాళ్ళని దేవుళ్ళు, దేవతలు ఆవేశిస్తారంటారా? ఒకవేళ ఆవేశించినా ఆ హంగామా అంతా దేవుళ్ళు చేసేదంటే నమ్మశక్యం కాకుండా వుంది. ఈ పూనకాల నిజస్వరూపం ఏమిటంటారు?

మాస్టరుగారు : భక్తి ఒక్కొక్క కక్ష్యలో ఒక్కొక్క రకంగా పని చేస్తుంది. ఎక్కువ మంది భక్తిపరులుగా వుంటారు. ఆవేశం సామాన్యంగా సూక్ష్మమలాలతో అపరిశుద్ధమైన సూక్ష్మ శరీరంలో వ్యక్త మౌతూ వుంటుంది. అప్పుడు అలాంటి ఆవేశానికి పశుబలం ఎక్కువ అవుతుంది. అంటే కామ క్రోధాలకు, రాగ ద్వేషాలకు ఏ బలం వుంటుందో, అలాంటి వారి భక్తి భావానికి అదే బలం వుంటుంది. వారికి పూనకాలు వస్తూవుంటాయి. ధర్మా ధర్మాలను గురించి వారికి ఉన్న అభిప్రాయాలు, ఇంకా వ్యక్తం కాకుండా సుప్త చైతన్యంలో ఉన్న ఇష్టాయిష్టాలు ఈ ఆవేశంలో కొట్టుకొని వస్తుంటాయి. వీరి భక్తి శ్రావణ భాద్రపదాల వరదల్లో నది నీరులాగ రజస్సుతో కలిసి ఎర్రబురదలాగ వుంటుంది. వారికి అప్పుడప్పుడే అంటే కొద్ది జన్మల క్రిందటే భక్తి భావం ఉదయించి వుంటుంది. అది క్షాళనం కలిగించటానికి వారిలోని ఇష్టా యిష్టాలను తిరిపెట్టినట్లు కదిలిస్తూ వుంటుంది. తొక్కిపెట్టబడిన వారి ఉద్దేశ్యాలు గన్నె కడిగిపోసినట్లు భళ్లున బయటకు వస్తూవుంటాయి. వాటికి తా మారాధించే నరసింహుడి రూపమో, వీరాంజ

నేయుడి రూపమో, వేంకటేశ్వరుడి రూపమో ముద్రింపబడి వుంటుంది అపవిత్ర భావాలమీద కూడ అదృష్టవశాన దైవరూపం ముద్రింపబడ టంలో ఆశ్చర్యంలేదు. బంకమట్టి మీద వినాయకుడి బొమ్మ అచ్చు పడు తున్నది గదా! బలమైన రాగ ద్వేషాలమీద ఇష్ట దైవతం పేరు ముద్రింప బడుతుంది. ఇవే పూనకాలు, భక్తి భావం కొన్ని జన్మల్లో సూక్ష్మ శరీరాన్ని పవిత్రం చేస్తుంది. అటుపైన ఈ పూనకాలేమీ వుండవు. శరదృతువులోని నదిలాగా నిర్మలతత్వం నిశ్చలంగా మిగులుతుంది. అపరిశుద్ధత్వం భక్తి చేత కదలింప బడినపుడు పరిశుద్ధి ప్రారంభమౌతుందిగాని మోక్షధర్మం సిద్ధించదు. వీనినే వివరిస్తూ రామానుజాచార్యుల వారు "అతి సంతోషశ్చ మోక్ష విరోధః" అని వివరించారు. పరిశుద్ధి చెందిన వారిలో కూడ ఆవేశం వుంటుంది కానీ అది భవ్యావేశం. తిక్కనగారు దీనిని భవ్యకవితా వేశంగా మలచుకొన్నారు. వ్యాస మహర్షిని భారతం వ్రాయడానికి ప్రోత్స హించింది ఈ భవ్యావేశమే. భక్తిలో ఆవేశమే లేకపోతే పరమాత్మతో సంయోగాపేక్షవుండదు. అంటే నిర్మల దివ్యశృంగారం సిద్ధించదు.

భక్తి జీవుడికి చక్కెరలాంటిది. చక్కెర పరిశుద్ధమైన నీటిలో వేసినా, మైదుకాలువ నీరు తెచ్చి అందులో వేసినా, నిమ్మకాయరసంలో వేసినా తియ్యదనాన్ని కలిగించక మానదు. తన పని తాను చేస్తుంది. కాని ఉన్న సరుకునుబట్టి తుక తుక ఉడకటమో, దుర్వాసనతోడి మాధుర్యాను భవం వెల్లుబకటమో జరుగుతుంది. అదే పూనకం. నిర్మల జలాల్లో చక్కెరకలిపినట్లు వర్తిస్తుంది మహానుభావులలో భక్తి. వారిలోని ఆవేశం మధుర సంగీతాన్ని, కవిత్వాన్ని, నర్తన కీర్తన కౌశల పారవశ్యాదుల్ని కలిగిస్తుంది. పూనకంలో ఉండే పర్యుత్సుకత్వం, నిర్మలత్వంలో ఉండదు.

పూనుతున్నారని చెపుతూన్న దేవతలందరు మంచివాళ్ళే. ఆంజనేయస్వామి రామదూతగా పనిచేశాడు కాని ఎవరికీ పూనకాలంటూ తోకమెలి పెట్టలేదు. అలాగే నరసింహ స్వామి ప్రహ్లాదుణ్ణి రక్షించాడు. పూనే లక్షణం ఆ దేవతల్లో వుండదు. ఈ భక్తులే దేవతలను పూనుతారు. ఈ రంకెలు, కేకలు వీళ్ల లోని కామక్రోధాదులేగాని దేవతలు కాదు. చూచే వాళ్ళు తన్నకుండా భయపడడానికి ఇలా దేవతల పేర్లు చెల్లుతుంటాయి.

వ్యక్తి : పూనకం స్వరూపాన్ని సులువుగా విప్పి చెప్పారు మీరు. మీరు చెపుతూ ఉంటే ఆ పూనకం వచ్చిన వ్యక్తి ప్రాణమయ, మనోమయ కోశాలలో జరుగుతున్న విశేషాలు, విచిత్రాలు చక్కగా స్పష్టంగా దర్శనమిచ్చాయి. మహర్షులు త్రిలోకజ్ఞులన్నప్పుడు ఈ మనోమయ, ప్రాణమయ, భౌతిక లోకాలపారము తెలిసినవారన్న దర్శనం నా కిప్పుడు కలుగుతోంది. ఈ త్రిలోకాలలోను సమానంగా చరించగల వారు తప్ప ఇలాంటి సూక్ష్మ విషయాలను ఇంత సున్నితంగా సమగ్రంగా వివరించలేరు.

## ప్రశ్నలు చెప్పే దేవుళ్ళు

వ్యక్తి : మాస్టరుగారూ! ఒక చిత్రమైన సంశయం. కొంత మంది భక్తులను గూర్చి కొన్ని విశేషాలు వింటూవుంటాం. వాళ్ల వారాని కొక రోజు భక్తుల ప్రశ్నలకు జవాబులిస్తూ ఉంటారని, ఆ వారం నాడు వాళ్ల ఇష్ట దేవత వారి నావేశించి మనకావలసిన విషయాలన్నీ చెపుతూ ఉంటుందని, ప్రశ్నలడగ దల్చిన వాళ్ళు ఆ వారంనాడు వెళ్ళాలని చెప్పుకుంటూ ఉంటారు. ఇక ఆ వారం నాడు తండోపతండాలుగా భక్తులు చేరుతూ ఉంటారు. క్యూలో నిలబడి వరుసగా వెళ్ళి తమ ప్రశ్నలను ఏకరువు పెడుతూంటే ఆ దేవుడో, దేవతో బదులు చెపుతూ వుంటారు. ఈ కథలలోని సత్య మేమిటి? నిజంగా ఆ వారంనాడు ఆ దేవుడు ఆ భక్తుడ్ని ఆవేశించి పలుకు తాడంటారా?

మాస్టరుగారు : దేవతలకి, వారాలకి ఉన్న సంబంధం భక్తులు మాట్లాడి పెట్టిందే. మనస్సుకి అభ్యాసబలం వల్ల ఆ వారాలు ప్రాధాన్యం వహిస్తాయి. వేంకటేశ్వరస్వామి శుక్రవారం నాడు పనిచేయలేడా? ఆంజ నేయులు మంగళవారం నాడు తప్ప మరో రోజున సముద్రం దాటలేడా? ఈ దేవతల ఇండ్లలో భక్తులు ఏర్పాటు చేసుకున్న వారాలివి.

ఇక ప్రశ్నలు చెప్పటానికి, భవిష్యత్తును, అదృష్టాన్ని వివరించ డానికి ఆ దేవతల కేం కర్మ పట్టింది? మనస్సులో నమ్మి ఏది అభ్యాసం చేస్తే దాంట్లోనే భగవంతుని అంతర్యామిత్వం ఉంటుంది. ప్రశ్నలూ, భవి ష్యత్తూ చెప్పే సామర్థ్యం, భక్తిభావంతో ఆత్మవిశ్వాసాన్ని పుంజుకుని ఒంటికాలిమీద లేస్తుంది. అలాంటి మొండిధైర్యానికి భక్తిభావమే అక్క ర్లేదు. మద్యం కైపులు. ఒక్కొక్క చిల్లర జ్యోతిష్కుడూ, థాట్ రీడింగ్ (Thought reading) వాడూ, బుద్ధి వేశాక ధారాళంగా చెబుతారు. ఆ బుద్ధిని కూడ కొందరు దేవుడి పేరుతో పుచ్చుకోవడానికి కాళీ ఉపాసన అంటారు. అదీ బుద్ధి ఖాళీ అయిందాకా పనిచేస్తుంది. తీరా ఈ వెంకటేశ్వర స్వామి, ఆంజనేయులు, కాళికాదేవి చెప్పే ప్రశ్నలు కూడా కొన్ని తప్పి పోతూ ఉంటాయి. ధారాళంగా నోటికి ఏది వస్తే అది చెప్పేసినా నూటికి యాభై పాళ్ళు జరుగుతాయిగదా! గనుక ఆ దేవుళ్ళ ప్రశ్నలు చెప్పుకునే దుకాణాలు పెట్టుకుంటారనడంలో ఆవేశం ఎంత ఉందో అసత్యం అంత ఉంది. తిరుపతి దాకాపోయి సమక్షంలో మొక్కుకునే కోరికల్లోనే కొన్ని తప్పిపోతూ ఉంటాయి. దీని అర్థం ఏమిటి? భక్తికి, ఆ కోరికలకు సంబం ధం లేదనీ, భగవంతుడి డ్యూటీలు అవి కావనీ అర్థం. కాకపోతే నిస్స హాయ దుర్బల హృదయులకి ధైర్యం చెప్పటానికి ఈ పద్ధతులు పకికి వస్తాయి. కాని ఈ దుకాణాలు పెట్టేవాళ్లల్లో ధైర్యం ధారపోసే వారికన్నా ధనం ఆకర్షించే వారే ఎక్కువ. బాధతో ఉన్న వాడిదగ్గర పదిరూపాయలు

పుచ్చుకొని మత్య పెట్టి మరింత నిస్సహాయుణ్ణి చేయటమే ఎక్కువ జరుగుతుంది. నిజమైన భక్తులు, ఉపాసకులు వీటికి చాలా దూరంగా ఉంటారు.

## సోదిలో సత్యం

వ్యక్తి: మాష్టరుగారూ! మరి సోది చెప్పేవాళ్ళుంటారు కదా! వాళ్ళ సోది చెప్పేటప్పుడు, అడిగేవాళ్ళ పోయిన బంధువులు గాని, ఇష్టదేవతలు గాని వచ్చి పలుకుతూ ఉంటారు గదా! అప్పుడు జరుగుతున్న దేమిటి?

మాష్టరుగారు : సోదిలోను, ఒక్కొక్కప్పుడు పూనకాల్లోనూ అనేక రహస్య విషయాలు బయట పడుతూ ఉంటాయి. సోది చెప్పే వాళ్ళల్లో రెండు రకాల వాళ్ళుంటారు. కొందరు దేవతలను ఆవాహన చేస్తారు. కొందరు పోయిన వాళ్ళను ఆవాహన చేస్తారు. దేవతలను ఆవాహన చేసినప్పుడు వాళ్ళలోని అమాయిక ప్రకృతే దేవతా రూపం ధరించి పలుకుతుంది. ఆత్మ సమర్పణ చేసుకున్న ముముక్షువులకు తప్ప మిగిలిన వాళ్ళందరికీ ఇష్ట దేవత రూపంలో ఉపాసకులే అంతర్యామిత్వం వహిస్తారు. ముముక్షువులలో దేవుడే జీవుడుగా ఉంటాడు. మిగిలిన ఉపాసకులలో జీవుడే దేవుడి పాత్రధారిగా ఉంటాడు. అతడు గుప్తవస్తుజ్ఞానం కలిగి ఉంటాడు. ఈ జ్ఞానం ప్రతివారిలోనూ దాగి ఉంటుంది. అభ్యాసంలో అమాయిక ప్రకృతి కలిసి ఉంటే చక్కగా వ్యక్తమౌతుంది. కనుకనే సోది చెప్పేవాళ్ళనోట గుప్తవస్తు జ్ఞానం పలుకుతుంది. ఒక్కొక్కప్పుడు సన్నిహిత భవిష్యత్తు కూడ చాల అరుదుగా పలుకుతుంది. గుప్తవస్తు జ్ఞానం ఎంత సులభమో భవిష్యత్తు తెలియటం అంత దుర్లభం. అందుకనే జరిగిన వన్నీ చాలామంది చెపుతారు. అవి మీ మనస్సులోనే ఎక్కడో స్మరణలుగా దాగి ఉంటాయి కనుక వారికి సులభంగా అందుతాయి. భవిష్యత్తు ఎక్కడా దాగి ఉండక పోవడమే కాక తయారయి కూడా ఉండదు కనుక ఎవరికీ అందదు. మనోగతంలో కార్యక్రమం రూపంలో, అల్లంత దూరంలో ఉన్న భవిష్యత్తును మాత్రం అంది పుచ్చుకుని చెప్పవచ్చు.

ఇక చనిపోయిన వాళ్ళని ఆవాహన చేసేవాళ్ళ సంగతి చూద్దాం. ఆ చనిపోయిన వాళ్ళు ఈ సోది మనిషి వస్తుందని ఎదురుచూస్తూ ఏ దూలానికో పట్టుకుని వ్రేళ్ళాడుతూ ఉండటం సాధ్యమా? వాళ్ల దోవన వాళ్ళు వాళ్ళ కర్మను బట్టి జనన మరణాల చక్రంలోకి వెళ్లిపోతారు. ఇక మిగిలేదీ ఆ పోయిన వాళ్ళని గూర్చి ఈ బంధువులకున్న ఆవేశాత్మక స్మృతులు. వాటిని అందిపుచ్చుకుని చెప్పటం జరుగుతుంది. కొన్నిరోజుల క్రితం చనిపోయిన వాళ్ల మాత్రం ఒక్కొక్కప్పుడు ఆవేశిస్తూ ఉంటారు. వాళ్ళకి కూడా తెలిసేది గుప్తజ్ఞానమే గాని భవిష్యత్తు కాదు. బ్రతికి ఉన్నప్పుడు వాళ్ళకెంత తెలుసో చనిపోయిన తరువాత కూడా అంతే. కాకపోతే ఉన్న విషయాలని పెట్టెలలోకి, భోషాణాలలోకి, మనస్సులలోకి దూరి అందించగలరు.

వ్యక్తి : సోది స్వరూపం చాలా బాగుంది మాష్టారూ! అమాయికమైన మానసికప్రకృతి గల సోది వాళ్ళనుండి సరైన సోది వస్తూ ఉంటుందన్న మాట. వాళ్ళకి గుప్తపస్తు జ్ఞానం బాగా అబ్బుతుందన్న మాట. మామూలుగా కూడా అమాయికంగా ఉన్న వ్యక్తులకి ఇలాంటి అంశాలు తట్టుతూ ఉండడం అనుభవంలోని విషయమే. మలిన పడని అమాయికత్వానికి ఈ శక్తులు సహజంగా, త్వరగా అబ్బుతాయన్నమాట.



# 1. నిత్యపూజలో సంశయాలు

## దేవి నెత్తి అడుస్తుందా?

వ్యక్తి: ఏదైనా మంత్రోపాసన, పూజ ముఖ్యంగా దేవీపూజ చేసే టప్పుడు ఆచారం సరిగా సాగకపోయినా, మధ్యలో నిలిపివేసినా ఆ దేవి నెత్తి అడుస్తుంది. అని నమ్మేవాళ్ళు కనబడుతూ వుంటారు. అలా చేసి జీవితంలో దెబ్బతిన్నామని చెప్పేవాళ్లు కూడా వున్నారు. నిజంగా అలా జరుగుతుందంటారా? దేవి నెత్తి అడుస్తుందంటారా?

మాస్టరుగారు: దేవీపూజ చేస్తే ఆచారం సాగకపోతే నెత్తి అడుస్తుందని కొందరు నమ్ముతున్నారు. అలాగే ఆంజనేయస్వామి పూజ కూడ. భగవంతుడు దయామయుడని, మన అజ్ఞానాన్ని, ఆపదలను తొలగిస్తాడని వేదశాస్త్ర పురాణాలు చెబుతున్నాయి. అనుభవంలో కూడా కాళిదాసు, రామకృష్ణ పరమహంస మొదలైనవాళ్ళు అమ్మవారిని ఆరాధించి యుగ పురుషులుగా మిగిలిపోయారు. వారినెత్తి వారున్నంతకాలం సుఖంగా వున్నది. అలాగే ఆంజనేయ భక్తుడు తులసీదాసు మొదలైనవాళ్ళ సంగతి కూడా. నెత్తి అడచేవాడు దైవం ఎలా అవుతాడు? కాకపోతే కొన్ని మంత్రజపాలు తంత్రాలు చేసేవాళ్లు పిచ్చివాళ్ళైపోవటం చూస్తున్నాం. అది చేసే వాడి దుర్బుద్ధి ఫలితమే కాని మంత్రానికి, ఆ దేవికీ సంబంధించినది కాదు. వశీకరణం మొదలైన దుర్బుద్ధితో మంత్రోపాసనలు చేస్తే వాళ్ళ దుర్బుద్ధివల్ల మనస్సు చెదరి పెడదారిని పడుతుంది. సకామంగా చేసినా మంచి కోరికతో చేస్తే అభివృద్ధే కలుగుతుంది. ఇంతకన్న సత్యం లేదు.

## విగ్రహాలు పెట్టుకుంటే?

వ్యక్తి: సామాన్యంగా మన ఇళ్ళల్లో ఒక నమ్మకం వున్నది: ఫటాలు పెట్టుకొని పూజ చేసుకొంటే ఫరవాలేదని, సంసార పక్షంగా

వుంటుందని విగ్రహాలు పెట్టుకునేటట్లయితే నియమం, నిష్ఠ చాలా వుండా లని, లేకపోతే లాభంలేదని మనవాళ్ళల్లో చాలామంది నమ్మకం. సత్యం ఏమిటంటారు ?

మాస్టరుగారు: దీనిలో ఏ మాత్రం సత్యం లేదు. భక్తివుంటే అన్నీ వుంటాయి. నిష్ఠ నియమాలు ఆచారకాండ శుచికోసం ఏర్పడ్డాయి. మూర్ఖులకు అవే భయకారణాలుగా వుంటాయి. శుచికోసం మానవుడు కల్పించుకున్నవి ఆచారాలు. భక్తి మానవుడు కల్పించుకున్నది కాదు. మనస్సుకి దైవం ప్రసాదించేది. కనుకనే కావాలని ఆచారాలు నేర్చుకోవచ్చు గాని కావాలన్నప్పుడు భక్తి రాదు. భక్తితో విగ్రహాన్ని గాని, పటాన్ని గాని ఎలా ఆరాధించుకున్నా తప్పులేదు.

వ్యక్తి: చాలా బాగుంది మాస్టారూ! ఆచారాలకు, భక్తికి మీరు చేసిన విశ్లేషణ. నిజమే మానవుడు కావాలని ఆచారవంతుడు కావచ్చు గాని భక్తుడు కావడం మాత్రం భగవదనుగ్రహం వల్ల మాత్రమే జరుగుతుంది. మీరీ సత్యం చెప్పాక చాలా నిదర్శనాలు మనస్సులో మెదులుతున్నాయి. ఆచారవంతుల్లో చాలామంది ఆచారానికిచ్చిన ప్రాధాన్యం భక్తికి, భగవంతుడికి ఇవ్వరేమిటా అని నాకు తరచు కోపం వస్తూండేది. ఇప్పుడు తెలిసింది భక్తి మనం నేర్చుకుంటే వచ్చేది కాదని. పైవాడి అనుగ్రహ విశేషమని - ఇకపై ఎవరిని చూసినా నాకు కోపంరాదు. చూశారా! మీతో సంభాషణలో క్షణంలో నాలో ఎంతమార్పు వచ్చిందో.

## శివలింగం ఇంట్లో ఉంటే ?

వ్యక్తి: మాస్టరుగారూ! చిన్న ధర్మ సందేహం. శివలింగాన్ని ఇంట్లో పెట్టుకోవడానికి చాలామంది ఇష్టపడరేమండీ? సాలగ్రామ దానం

తీసుకోవడానికి కూడా చాలామంది భయపడటం చూశాను. ఎందుకండీ శివు డంటే ప్రత్యేకంగా అంత భయం?

మాస్టరుగారు: మిగిలిన దైవ విగ్రహాలెంతో శివలింగం కూడా అంతే. దాని విషయంలో ప్రత్యేకంగా భయం వున్నదంటే శివుణ్ణి చూచి భయపడుతున్నారన్న మాట. భయం వుండటం శివద్రోహం అవుతుంది గాని శివభక్తి కాదు. తండ్రిని చూచి భయపడేవాడు పితృభక్తుడు కాగలడా! ఎప్పుడో ఒకప్పుడు వాడు తండ్రికి ద్రోహం తలపెడతాడు. శివలింగం శివ స్వరూపమని నిజంగా నమ్మేవాడికి శివుడంటే మంగళకరుడని తెలుస్తుంది. వాడికి శివలింగాన్ని ఇంట్లో ఉంచుకొనడానికి భయపడే గతి పట్టదు.

వ్యక్తి: చాలాబాగుంది మాస్టారూ! చాలామంది మనసుల్ని తినేస్తున్న అనుమానాల్ని, భయాన్ని మీరిట్టే తీసేసారు. నిజమే. తండ్రంటే భయపడే వాడే శివుడంటే భయపడతాడు.

## నైవేద్యాల తారతమ్యాలు

వ్యక్తి: మాస్టరుగారూ! చాలామందిలో మరో నమ్మకం వుంది. పూజామందిరంలో దేవుడి ఫొటోలు మాత్రమే ఉంటే స్నానం చేసి పంచ దార నైవేద్యం పెట్టుకున్నా సరిపోతుందని, విగ్రహాలు గనుక వుంటే తప్పనిసరిగా మహానైవేద్యం పెట్టి తీరాలని అంటూ వుంటారు. మరి దీని సంగతేమిటి?

మాస్టరుగారు: నైవేద్యం పటానికి పెట్టినా, విగ్రహానికి పెట్టినా తినేది భక్తుడే. దేవుడు ఇచ్చేవాడే గానీ, పుచ్చుకునేవాడు కాదు. అలాంటి ప్పుడు పటంలో దేవుడు పంచదారని, విగ్రహంలో దేవుడు మృష్టాన్న భోజనాన్ని కోరతాడనటంలో సత్యంలేదు.

## మంత్ర జపాలు-వేద మంత్రాలు

వ్యక్తి: మాస్టరుగారూ! మంత్రం సక్రమంగా జపంచేయకపోయినా, వేదమంత్రాలను స్వరం లేకుండా ఉచ్చరించినా మంచిది కాదంటారు. ఇది నిజమేనంటారా?

మాస్టరుగారు: మంత్రం సక్రమంగా జపం చేయకపోతే చిక్కులున్న మాట నిజమే. జపం చేసే విధానం తెలియనిదే ఏ మంత్రమూ చేయరాదు. జపం అంటే మంత్రాన్ని స్పీడుగా పఠించటం అనుకుంటే ప్రమాదం. దానివల్ల బుర్ర తిరగడం. నరాలు వేడెక్కడం, మనస్సుకి పట్టుదల, అలసట కలగటం సంభవిస్తుంది. ఒక్కొక్కప్పుడు తలకు పక్షవాతం కూడా రావచ్చు. ఈ దోషం మనస్సుని కేంద్రీకరించడం వల్ల వస్తుంది గాని, మంత్రం వల్ల కాదు. అలా కాకుండా ప్రశాంతంగా మంత్రాక్షరాలను ఉచ్చరిస్తూ మధురమైన సంగీత మార్గాన భావన చేస్తే మంత్రసిద్ధి తప్పకుండా కలుగుతుంది.

ఇక వేదమంత్రాల సంగతి స్వరం లేకుండా పఠిస్తే కొంప మునిగేదేమీ లేదు. కాకపోతే ఫలితం మాత్రం వుండదు. ఆ మంత్రాల్లోని సాహిత్యంతో సరిపెట్టుకోడం జరుగుతుంది. మాక్సుముల్లర్ మొదలైన వారికి ఎంత అర్థమైనాయో వీళ్ళకీ అంతే అర్థమవుతాయి. వేదం సంగీత ప్రధానం గనుక స్వరం ప్రధానం. నాదంలో లీనం కావటానికి ఈ సంగీతం దాని ద్వారా అనుభూతి లోకాలలో వున్న అనుభవాలు ప్రసన్నమౌతాయి. అవే దేవతలుగా పనిచేస్తాయి. ఒక త్యాగరాజ కృతి గాని, జయదేవుని అష్టపది గాని సాహిత్యంలో చదువుకుంటే ఏమొస్తుంది? అందులోని అర్థాలు చెప్పవచ్చు. "శాంతములేక సౌఖ్యమూలేదు" అనే త్యాగరాజకృతి చదువుకుంటే శాంతమూ రాదు, సౌఖ్యమూరాదు. అర్థంమాత్రం తెలుస్తుంది. అదే కృతిని

గానం చేస్తే శాంతము, సౌఖ్యము కలుగుతాయి. ఇలాంటివే వేదమంత్రాలు కూడ. ఒక నాటకం చదువుతూ వుంటే తెలిసే దానికి, మంచి నటులు నటిస్తున్నప్పుడు చూస్తే ఏ తేడా ఉన్నదో అదే తేడా వేదమంత్రాలు స్వరం లేకుండా చదువుకొని అర్థం చెప్పుకోడానికి, స్వరంతో గానంచేస్తూయజ్ఞాలు మొదలైన వాటిలో ప్రయోగం చేయడానికి మధ్య ఉన్నది. మొదటి పద్ధతిలో అర్థం తెలుస్తుంది. రెండవ పద్ధతిలో వేదం అబ్బుతుంది. ఇలాంటి గ్రంథాలు అర్థం కోసం వ్రాయబడినవి కావు. అర్థంకూడా అనుభవానికి మనస్సుని మథించడానికి ఒక సాధనంగా మాత్రమే వాడబడి ఉంటుంది. అంతేకాని స్వరం లేకుండా చదివితే అనర్థం ఏమీ జరుగదు.

వ్యక్తి : చాలా చక్కగా ప్రస్ఫుటంగా బోధపడింది మాస్టారూ! జపంగాని, వేదపఠనం గాని సంగీత ప్రధానంగా ఉండి నాదంలో మనలను నిలిపేదిగా ఉండాలన్నమాట.

## జపమాల అవసరమా ?

వ్యక్తి : మాస్టరుగారూ! జపానికి జపమాల అవసరమా? కొందరు తులసి పూసల మాలనో, రుద్రాక్షమాలనో ఏరి కోరి ఏర్పాటు చేసుకుంటూ ఉంటారు. వీటిని ఉపయోగించటం వలన ప్రత్యేక ప్రయోజనం ఏమైనా ఉన్నదా ?

మాస్టరుగారు: జపానికి, జపమాలకి చుక్కెదురు. ఏ మంత్రాన్నైనా చేస్తూ జపమాల త్రిప్పితే సిద్ధించేది మంత్ర సంఖ్య ఒక్కటే గాని మంత్ర దేవతకాదు. లెక్కెట్టుకుంటూ మంత్రం చేసే వాడికి లెక్కఒక్కటే దక్కుడు. ప్రత్యక్ష మయ్యేది జపమాలలోని పెద్దపూసతప్ప మంత్ర దేవత కాదు. 108 కన్న ఎక్కువ మార్లు మంత్రం చేస్తే దండగ అనుకునే వాడికి జపం వల్ల ఏమీ ప్రయోజనం లేదు. ఇక తులసి పూసలు, రుద్రాక్షలు మనం జపంచేస్తున్నట్లు మనకు, ఇతరులకు తెలియటానికి పనికివస్తాయి. ఇవన్నీ కలియుగ ఆడంబరాలేగాని భక్తిసాధనాలు కావు.

## జింక చర్మం ఆవశ్యకమా ?

వ్యక్తి : మాస్టరుగారూ! జపం చేసుకోవడానికి కూర్చునేందుకుగాను కొందరు జింక చర్మాన్ని వాడుతూ ఉంటారు. కొందరా చర్మాల కోసం జపాన్ని వాయిదా వేసి మరీ ప్రయత్నిస్తూ ఉంటారు. నిజానికి జపానికివి అవసరమా ?

మాస్టరుగారు : చెలాజిన కుశోత్తరంగా జపానికి కూర్చోమని కృష్ణుడు చెప్పాడు. కాని స్థిత ప్రజ్ఞుడికి ఇందులో ఒక 'కాభాష' ఉన్నది. సాధకుడి చర్మమే అజినం, కట్టిన వస్త్రమే చేలం, దేహం మీది కేశాలే కుశాలు. కాకపోతే నదుపాయంగా వుండటానికి మడత పెట్టిన వస్త్రంగాని, దర్భల చాపగాని, జింక చర్మం గాని వాడుకోడం బాహ్య లక్షం. అందులో ఏదో ఒకటి చాలు. మూడూ అక్కర్లేదు. "చేలాజిన కుశోత్తరం" అన్న సమాసంలో ఒక దాని మీద ఒకటి వేసుకుని కూర్చోమని అర్థం చెప్పు కొనడం గ్రంథకర్త ఉద్దేశం కాదేమో ననిపిస్తుంది. చేలోత్తరంగానో, కుశోత్తరంగానో కూర్చోవచ్చునని ఇందలి భావం. మరొక విషయం. ఈ బాహ్య సాధనాలు తప్పనిసరిగా వుండాలని లేదు. తపోనిష్ఠకు పూనుకున్న వాళ్ళు చాలామంది స్థండిల భూమిపై సాధన చేసినట్లు భారత భాగవతాది గ్రంథాలు చెబుతున్నాయి. ఇవి తప్పనిసరి అయినట్లైయితే ఎవడు జపం ప్రారంభించాలన్నా ముందు ఒక జింకను చంపాలి. అది అన్యాయం. మన జపానికి జింకను చంపడం ఎందుకు? జింక చస్తే దాని కుటుంబానికి తీరని నష్టం. మనం జపం ప్రారంభించక పోతే లోకాని కేమీ నష్టంలేదు. కనుక జపం కావలసినవాడు సాధుమార్గంలో పోవటం నేర్చుకోవాలి.పూర్వకాలంలో కొందరు చనిపోయిన జింకల చర్మం మాత్రం తీసుకునేవారు. అప్పుడు తప్పు లేదు.

వ్యక్తి : చాలా సంశయాలు తీరాయి మాష్టారూ! కొంత మంది వట్టి నేల మీద కూర్చుని జపం చేసుకుంటే ఆ వచ్చే శక్తంతా భూమిలోకి పోతుందని భ్రమపడేవాళ్ళని కూడా చూశాను. మీరు చెప్పారుగదా! వట్టినేల మీద కూర్చుని తపోనిష్ఠలో నిలిచి సిద్ధి పొందినవాళ్ళెందరో భారత భాగ

వతాలలో కనపడతారని. దేవుడిమీద దృష్టి ఉంటే ఉన్నవేవో చాలు. ఆ దృష్టి తగ్గినపుడు లేనివేమిటో, కావలసిన వేమిటో గుర్తుకొస్తూ ఉంటాయి. చేలాజిన కుశోత్తరం అన్నదానికి మీరు చెప్పిన అర్థం ఉన్నదే, అదిచాలా బాగున్నది. మనం జపం చేసుకోవటానికి మన శరీరమే మనకి వేదిక అని చెప్పారు మీరు.

## ఏ దిక్కుకు తిరిగి ప్రార్థన చేయాలి?

వ్యక్తి : మాస్టరుగారూ! ఫలానా దిక్కువైపుకే తిరిగి జపాలు పూజలు చేసుకోవాలనే నియమం ఏదైనా ఉన్నదా? చాలామంది తూర్పు దిక్కు మంచి దంటారు. కొందరు ఉత్తరదిక్కైనా ఫరవాలేదంటారు. పడమర దక్షిణాల విషయం సామాన్యంగా ఒప్పుకోరు. ఈ దిక్కుల కథేమిటి ?

మాస్టరుగారు : జప తపాదులు భక్తి భావన కోసమైనపుడు అంతర్యామి అన్ని దిక్కులలోను ఉన్నాడు. ఏ దిక్కుకు తిరిగి కూర్చున్నా సాధన జరుగుతుంది. కాని భూమి మీద ఉన్న జీవులు అహోరాత్రాలకు బద్ధులు గనుక సూర్యోదయ సూర్యాస్తమయాలు అందరినీ ప్రభావితం చేస్తాయి. వాటి ధర్మాలను అనుసరించి తూర్పువైపు తిరిగి కూర్చోవటం ఎక్కువ అనుకూలం. అలాగే ఉత్తర దక్షిణ ధ్రువాలు అందరి వెన్నెముకల లోను చైతన్య వేగాన్ని పుట్టిస్తున్నాయి. కనుక వాటి ధర్మాల ననుసరించి ఉత్తర దిక్కుగా తిరిగి కూర్చోవటం కూడా దైవ భావనకు అనుకూలం. అది కాక ఆరోగ్యం కోరినవారు దక్షిణ దిక్కుగాను, విఘ్ననాశం కోరినవారు పశ్చిమ దిక్కుగాను తిరిగి సాధన చేయటం కూడ అనుకూలం. ఏది కావలసిన వారు ఆ దిక్కుగా తిరిగి సాధన చేయాలి. కేవలం భక్తి భావన, బ్రహ్మ వర్చస్సు, విద్యాభివృద్ధి కోరినవారు ఉత్తరంగానో, తూర్పుగానో తిరిగి కూర్చోవాలి.

వ్యక్తి : ఇంతకూ చెడ్డ దిక్కు అంటూ ఏదీ లేదన్న మాట. మన స్వభావాన్ని బట్టి, అవశ్యకతను బట్టి దిక్కును ఎంచుకోవచ్చు నన్నమాట. సర్వ సామాన్యంగా తూర్పు, ఉత్తరం సర్వజీవులకు అనుకూలం అన్న మాట. అంతేనా మాస్టారూ !

మాస్టరుగారు : అంతే! అంతే!

## పడక గదిలో దేవుని పటాలు పెట్టవచ్చా ?

వ్యక్తి : మాస్టరుగారూ ! మరో సందేహం అడుగుతాను. పడక గదిలో దేవుడి పటాలుగాని, కేలండర్లు గాని వుండటానికి వొప్పుకోరు. కొంత మంది. అలా ఉండటం తప్పా !

మాస్టరుగారు : దేవుడి పటాలు లేని గదిలో దేవుడుండడనుకుంటే ఈ సందేహం వస్తుంది. పడక గదిలో మనం రహస్యంగా చేసే పనులను దేవుడు చూడడని, అందులోనూ దీపం ఆర్పేస్తే ఏమీ కనపడదని భావించే వారికి దేవుడే అనవసరం. కాబట్టి పడకగదిలో పటం ఉన్నా, లేకపోయినా దేవ డున్నాడు. పటం పెట్టుకొన్నందువల్ల మంచిదేగాని చెడ్డ ఏమీ లేదు. పటం మనకి దేవుడు జ్ఞాపకానికి రావడానికే గాని దేవుడు రావడానికికాదు. వాడక్కడ లేకపోతేగా వేరే రావడానికి. స్మరణ కుపకరిస్తుంది గనుక పటం ఉండటం మంచిది !



# శిష్యులతో మాస్టరుగారు

## A. వివిధ కేంద్రాలవారు

### మీ ఊరు రావడం మీ చేతుల్లోనే ఉంది

వ్యక్తి: మాస్టరుగారూ! మీరు మా మీద శీతకన్ను వేశారు. అటు పక్కకి వస్తూ కూడ మా ఊరు రావటంలేదు. ఇంక లాభంలేదు. ఫలానప్పుడు వస్తానని మీచేత అనిపించుకుని వెడదామనే వచ్చా నీ సారి.

మాస్టరుగారు: అనడానికేమిటి అంటాను. కానీ రావడంమాత్రం నా చేతుల్లో లేదు.

వ్యక్తి: మరి?

మాస్టరుగారు: మీ చేతుల్లో ఉంది.

వ్యక్తి: అదేమిటి మాస్టారూ! మాలో ప్రతిఒక్కరు మీరు రావాలని మనస్పూర్తిగా కోరుకుంటున్నాము కదా!

మాస్టరుగారు: అక్కడే వచ్చింది ఇబ్బంది. ఎవడికి వాడు కోరుకుంటున్నాడు గాని, అందరూ కలసి కోరుకోవటమనేది మీ కింకా చేతకాలేదు. పదిహేనేళ్ళు అయినా పనికివచ్చే పని ఒక్కటీ మీవల్ల జరగలేదు.

వ్యక్తి: అదికాదు మాస్టారూ! నా సంగతి మీకు తెలుసుగదా! నా మటుకు నేను శక్తివంచన లేకుండా మీ మార్గంలో పనిచేస్తూనే ఉన్నాను కదా!

మాస్టరుగారు: మీతో వచ్చిన బాధ ఇదే. అందరూ తెలివిగలవాళ్ళయితే వచ్చే యిబ్బందులు ఇలాగే వుంటాయి. అందుకే అన్నాను ఆంధ్రులు పొడిఅన్నం మెతుకులు వంటి వారని. పదిహేనేళ్ళ బట్టి ప్రయత్నిస్తున్నా మిమ్మల్ని కలిపి నడపడం నాకు చేతనయిందా! ప్రతిసారి మీరే గెలుస్తు

న్నారు. నేనే ఓడిపోతున్నాను. నీలాగే ప్రతివాడు రావడం, ఇలాగే నా కాలాన్ని తినడం, మళ్ళీవెళ్ళి యథాపూర్వంగానే నడుచుకోవడం, ఎవడికి వాడు మిగతావాళ్ళు మనమాట వింటే బాగుంటుందనుకొంటున్నారు గాని మనం మిగతావాళ్ళతో ఎందుకు కలిసిమెలిసి వుండటం లేదు అన్న ఆలోచన రావటంలేదు. మీలో ఒకళ్ళకొకళ్ళు నచ్చేవరకు, ఒకచోటే అందరూ కలిసి పనిచేయటం నేర్చుకునే వరకు, నేను మీ వూరు రావడం అనేది సాధ్యపడే పనికాదు. మీ రలా కలిసి పని చేస్తున్నప్పుడు మీరు పిలువనక్కరలేకుండా నేనే వస్తాను. అందుకే అన్నాను. నేను రావడం నా చేతుల్లోలేదు. మీ చేతుల్లో ఉంది అని. మీ చేతుల్లో ఉన్నదానిని వచ్చి నన్ను సతాయిస్తే ఎలా? చేతనయితే చేతల్లో చూపండి.

వ్యక్తి: (పాదాలకు నమస్కరించి లేచి) వస్తాను మాస్టారు.

మాస్టరుగారు: మంచిది వెళ్ళిరా.

## మంచిపని-అయస్కాంతం

వ్యక్తి: మాస్టరుగారూ! మీ దగ్గర ఉంటే ఒళ్ళు తెలియదు. ఇక్కడ మీ సాన్నిధ్యంలో రోజులు క్షణాల్లా గడచిపోతాయి. కాని మా ఊళ్ళో ఎందుకనో ఇలాంటి వాతావరణం ఏర్పడటంలేదు మాస్టారూ. అక్కడికీ అవకాశం కుదిరినప్పుడల్లా నలుగురం కలుసుకుంటూనే ఉంటాం. ప్రార్థన మొదలైనవి చేస్తూనే ఉంటాం. కానీ ఏదో లోటు కనపడుతూనే ఉంది.

మాస్టరుగారు: పూలు గుట్టగా పోయబడినపుడు ఒకలా ఉంటాయి. దండలుగా తీర్చిదిద్దబడినపుడు మరొకలా వుంటాయి. ఆ దండలు పూజ్యులైన వారి మెడల నలంకరించినపుడు ఇంకొకలా వుంటాయి. అలాగే మీరందరూ మంచి పూలవంటివారు ప్రార్థన వలన మీరు చక్కని దండలుగా తీర్చిదిద్దబడవలసి వుంది. ఇలా తీర్చిదిద్దబడాలి అంటే రోజూ ఒకేచోట

ఒకే కాలానికి మీరంతాచేరి ప్రార్థన చేసుకోవటం అలవాటు చేసుకోవాలి. ఆపైన పదిమందికీ ఉపయోగపడే మంచి పనులలో మీరు చేయగలిగిన వాటిని ఒకటో రెండో ఎంచుకుని వాటిని క్రమబద్ధంగా ఆచరించడం ప్రారంభిస్తే నువ్విక్కడ అనుభవిస్తున్న అనుభూతి అక్కడా లభిస్తుంది. మంచిపని ప్రారంభిస్తేనే గాని మన జీవితాలకు క్రమశిక్షణ అబ్బదు. మామూలుగా నలుగురు కలుసుకున్నదానికీ, మంచిపనికై నలుగురు కలుసుకున్న దానికీ తేడా చాలా వుంది. మనం ఇనుపముక్కలమైతే, మంచిపని అయస్కాంతం లాంటిది. అది మననుకూడా అయస్కాంతాలుగా మారుస్తుంది. అప్పుడు మనం అనుభవించే స్థితి వేరు.

వ్యక్తి: కర్తవ్యం బోధపడింది మాస్టారూ. మీరు చెప్పినట్లే తు.చ. తప్పకుండా నడుచుకుంటాము. పూలలాంటి మేము మీ సాన్నిధ్యంలో దండలుగా తీర్చిదిద్దబడి సత్కార్మాచరణ ద్వారా మాస్టరుగారి మెడలో అలంకరించబడి తరిస్తాం. ఆశీర్వదించండి.

మాస్టరుగారు: తథాస్తు.

## ఆచరణ వెనకాల

వ్యక్తి: మాస్టరుగారూ! మీరొకసారి మా ఊరు రావాలి. మీపాదం మా ఇంట మోపాలి. మీ పాదపూజ చేసుకొనే అవకాశం మాకు ప్రసాదించాలి. మీరు ఒక్క రెండు మూడు రోజులైనా మా గృహంలో వుండాలి.

మాస్టరుగారు: నీ కోరిక చాలా బాగుంది. అలా చేస్తే బాగుండునని నాకూ వుంది. కాని నేను రావటానికి, చెయ్యటానికి చిన్న నియమం ఉన్నది. ఎక్కడైతే సజ్జనులు పదిమంది కలిసి నిస్వార్థంగా రోగులకు, ఆర్తులకు సేవచేస్తూ వుంటారో అక్కడకు మాత్రమే నేను రావడానికి

అవకాశం వుంటుంది. ఈ నియమాన్ని మీరు పాటించగలిగితే మీ ఊరు రావడానికి నాకేమీ అభ్యంతరం లేదు.

వ్యక్తి: మంచిది మాస్టారూ! మీరు చెప్పినదానికి తగ్గట్లుగా మా ఊరిని తీర్చిదిద్దుకొని మళ్ళీ కన్పిస్తాను. త్వరలో మా ప్రయత్నాలు ఒన కూడేటట్లుగా ఆశీర్వదించండి.

మాస్టరుగారు: ఆచరణ వెనకాల ఆశీస్సులెప్పుడూ వుంటాయి.

## అదృష్టం మీదేనా ?

వ్యక్తి: మీ రాక మాకెంతో బలాన్ని ఇచ్చింది. మీ ఆశీస్సుల బలం వల్లనే మేమంతా ఈ చిన్న మంచిపనికి పూనుకున్నాం. మా కాలనీవాళ్ళం దరం కలిసి ఈ స్థలాన్ని ఏర్పాటు చేసుకున్నాం. మాది లేబరు కాలనీ. దేవుడి దయవల్ల అన్నివిద్యలు వచ్చినవాళ్ళు మాలోనే వున్నారు. రాళ్లు మేమే తీసికొన్నాము. గుడిగోడలు మేమే కడుతున్నాము. తరువాత ఎలక్ట్రికల్ వైరింగు అదీ మేమే చేసెయ్యగలం. అందరం కలిసి సీతారాముల విగ్రహాలకి, మిగతా విగ్రహాలకి ఆర్డరుఇచ్చాం. మా డ్యూటీలు పోను మిగిలిన కాలమంతా ఇక్కడే ఈ పనులలోనే గడుపుతున్నాం. సాధ్యమైనంత త్వరలో రామాలయం అన్ని హంగులతో పూర్తిఅయిపోవాలని మా వాళ్ళందరి సంకల్పం. మీరొక్కసారి వచ్చి, జరుగుతున్న పనులను చూచి ఆశీర్వదిస్తే కొండంత బలం కలుగుతుందని మేమందరం అనుకున్నాం. అనుకున్నదే తడవుగా నేను మీ దగ్గరికి రావడం, అడిగినదే తడవుగా మీరీ ప్రాంగణంలో అడుగుపెట్టడం అంతా లీలగా వుంది. ఇప్పుడు మాకు పని చేయడం శ్రమ అనిపించటంలేదు.అనుకున్న పని అనుకున్నట్లుగా రోజుల్లో అయిపోతుందన్న ధైర్యం, విశ్వాసం కలుగుతున్నాయి.

మాస్టరుగారు : మీరు చేస్తున్న పవిత్రమైన ప్రయత్నాలన్నీ నాకెప్పటి కప్పుడు గమనికకు వస్తూనే ఉన్నాయి. మిమ్మల్ని చూస్తుంటే ఆనాడు వారధికట్టిన వానరులే ఇలా దిగి వచ్చారని అనిపిస్తోంది. మీ దృఢ సంకల్పమే నిరాటంకంగా గుడిని పూర్తి చేసుకుంటుంది. మీకు చేస్తున్నట్లు తెలియకుండానే పని పూర్తియై గుడి వెలుస్తుంది. రాముడి దగ్గర ఒక విచిత్రమైన పద్ధతి వుంది. ఆనాడు వానరుల సహాయంతో వారధి నిర్మాణం జరిపించినట్లుగానే, ఆనాటి నుంచీ ఈనాటి వరకూ ఉండీ లేనివాళ్ళ సామూహిక ప్రయత్నాలవల్లే రామాలయాలు వెలిసేటట్లు చేస్తాడు. ఈనాడు మీరు కూడా అదే సత్యాన్ని నిరూపిస్తున్నారు. నాకు చాలా తృప్తిగా, సంతోషంగా వుంది. మీ కాలనీలో అందరూ శుచి, శుభ్రాలు పాటిస్తూ, స్నానము-సంధ్య-పూజ-పునస్కారము చేసుకుంటూ మీ మీ విధి నిర్వహణలో ఏమరుపాటు లేకుండా ప్రవర్తిస్తూ సద్గ్రంథపఠనము, సత్కాలక్షేపాలతో కాలమంతా రాముని సేవగానే సద్వినియోగ పరుస్తున్నారని నేనెరుగుదును. మీ ప్రయత్నాలు ఫలవంత మౌతాయి. మళ్ళీ వచ్చి విగ్రహ ప్రతిష్ఠాపన చేస్తాను. వస్తాను.

వ్యక్తులు : మీకు మీరుగా మాటిచ్చారు. ఎంత అదృష్టం బాబూ.

మాస్టరుగారు : అదృష్టం మీదేనా? నాదీను!

## బాధ-బోధ

వ్యక్తి : మాస్టరుగారూ! రేపు రాత్రికి మా ఊరు బయలుదేరుతున్నారు కదా! నేను ఈరోజు వెళుతున్నాను. మీరక్కడికి చేరేటప్పటికి సిద్ధంగా ఉంటాను.

మాస్టరుగారు : అలాగే! అది సరేగాని ఇంతకీ మన బస ఎక్కడ ఏర్పాటు చేశావు?

వ్యక్తి : మా ఇంట్లోనే మాష్టారూ.

మాస్టరుగారు : అలావద్దోయ్! మీ ఆవిడ ఆరోగ్యం నాకు తెలుసు. పని తాకిడికి తట్టుకోలేదు. ఇక మనం ఉంటే జనం ఎలా వస్తూ పోతూ వుంటారో తెలుసుగదా! పనిపూర్తై నేను వచ్చేసేటప్పటికి మీ ఆవిడ తుక్కైపోతుంది. ఈ పరిస్థితులను దృష్టిలో పెట్టుకునే ఈ మధ్య ఏ ఊరు వెళ్ళినా ఇళ్ళల్లో ఉండటంలేదు. గురువుగారు వచ్చి వెళ్ళారుట అంటే ఆ కుటుంబం ఆయిదారు నెలలకుగాని ఊపిరి పీల్చుకోలేనంత గుండం పడిపో కూడదు కదా! అందుకనే ఆ ఊళ్ళో వున్న గెస్ట్‌హౌస్‌లోనో, లాడ్జిలోనో, బస ఏర్పాటు చేసుకోమని చెపుతున్నాను. అప్పుడు జనం ఎవరూ హైరాన పడకుండా అందరూ ఆనందించటానికి వీలుంటుంది. నువ్వా ఆ పనే చెయ్యి, అనవసరంగా ఆవిడని యిబ్బంది పెట్టకు.

వ్యక్తి : అదేమిటి మాస్టారూ, యిబ్బంది అంటారేమిటి? మీరు ఇంట్లో అడుగుపెడితే అదే పదివేలని మా ఆవిడ, పిల్లలు ఎదురు చూస్తున్నారు.

మాస్టరుగారు : నేను చెప్పినట్లు చెయ్యవోయ్ నువ్వు. మీ ఇంటికి నేను రావడమేగా కావలసింది. తప్పకుండా ఖాళీచేసుకుని మీ ఇంటికి వెళ్ళి చూసివద్దాం. బస మటుకు వేరే ఏర్పాటు చేసెయ్యి.

వ్యక్తి : అలాగే మాష్టారు, వస్తాను.

మాస్టరుగారు: మరొకచోట ఉంటానన్నానని బాధపడకోయ్, నువ్వు కూడా వ్యామోహ పడితే ఎలా? రేపొద్దున నీ శిష్యుల విషయంలో నువ్వు కూడా ఇలాగే ప్రవర్తించటం నేర్చుకోవాలి. మనవల్ల శారీరకంగాగాని, ఆర్థికంగాకాని శక్తికి మించిన శ్రమ అవతల వాళ్ళకి ఎప్పుడూ కలుగనివ్వ కూడదు. ఈ మాత్రం జాగ్రత్త పడకపోతే ఏదేదో సాధిస్తున్నా మనుకొని నమ్ముకున్న జనాన్ని యిబ్బంది పెట్టడం జరుగుతుంది.

వ్యక్తి : వినటానికి ప్రస్తుతం బాధగా వున్నా మీరు చెప్పింది మాత్రం తెలుసుకోవలసిన సత్యమే మాష్టారూ.

మాస్టరుగారు : క్రమంగా బాధపోయి సత్యం మరింతగా బోధ పడుతుందిలే.

## మనం పనిచేయడం మానేస్తేనే............

వ్యక్తి : నమస్కారం మాష్టారు నిన్ననే వచ్చాను.

మాస్టరుగారు : ఏమిటోయ్ మీ ఊరు విశేషాలు?

వ్యక్తి : మీరు తప్పులెంచుతున్నాను అని అనుకోకుండా ఉంటే మా ఊరి పరిస్థితిని గూర్చి రెండు ముక్కలు చెపుతాను.

మాస్టరుగారు : చెప్పవోయ్, ఉన్న విషయం చెప్పటానికి జంకెందుకు?

వ్యక్తి : మీరు వ్రాసిన ఉత్తరాలు, అవీ మాకతను చూపించటం లేదు. మీరు వచ్చినపుడు కూడా మాలో కొందరికి తెలియని సందర్భాలు వున్నాయి. ఎందువల్లనో మావూరి కార్యక్రమాలలో ఎదుగుదల కనపడటం లేదు. అతను మమ్ములను కలుపుకొని కార్యక్రమాలు నిర్వహించాలన్న ఉత్సాహం చూపడంలేదు. మీకు ప్రతినిధిగా ఉంటాడనుకున్న అతను ఇలా ప్రవర్తిస్తాడని మేము ఊహించలేదు. మీలాగఉండి మమ్మల్ని తృప్తితో నడిపిస్తాడని ఆశించాం, మా కలలు ఫలించ లేదు.

మాస్టరుగారు:మీరనుకున్నట్లు అతను ఉండాలని మీరనుకుంటున్నారు. అతను చెప్పినట్లు మీరు నడుచుకుంటే బాగుంటుందని అతను అనుకుంటున్నాడు. ఎవరూ ఎవరితోనూ రాజీపడటం జరగటంలేదు. సంవత్సరాలు జరిగిపోతున్నాయి. నలుగురు కలిసి ఒకచోట ఒకరి ఆధ్వర్యంలో అరమరికలు లేకుండా మంచిపనిని చేసుకోవటం మీకు ఇంకా చేతకాలేదు. ఊరికే

ఇక్కడికి వచ్చి నా కాలహరణం చేసి, నా కాళ్ళ మీదపడి కన్నీళ్ళు కార్చి ఏం ప్రయోజనం? నా టైమ్‌కూడా పాడుచేయడం తప్ప. పోనీ ఆ వచ్చేది కూడ అందరూ కలిసి ఒకసారి రావడం వుండదాయె. ఒకడికి తెలియకుండా ఒకడు వచ్చి వెళతూ వుండడమేగా మీరు చేస్తున్నది! పోనీ కేకలేసినా మీకు సత్యం బోధపడదు. ఉన్నమాట చెబితే మాస్టరుగారు సానుభూతి చూపకుండా కోప్పడ్డారనుకుంటారుగాని, సత్యం గ్రహించరాయె! నిన్ను కోప్పడుతున్నానంటే అతన్ని సమర్థిస్తున్నానని కాదు అర్థం. అతను, మీరు కూడ ఎలావుంటే బాగుపడతారో అలా వుండటానికిగాను కోప్పడు తున్నాను.

వ్యక్తి : మీరు చెబుతున్నది మా మేలు కొరకే అని మాకు తెలుసు. మాలో లోపాలు లేవని మేము అనలేము. మా లోపాలు మాకు కనపడు తునే ఉన్నాయి. మేము సర్దుకోవటానికి తప్పకుండా ప్రయత్నిస్తాము. అతనుకూడా ఇలాగే సర్దుకుంటే బాగుంటుంది కదా అని మా ఆశ.

మాస్టరుగారు : నీ సంగతి నువు చూడవోయ్. మనం పనిచెయ్యడం ఆ పేస్తేనే మరొకడు పనిచేస్తున్నాడో లేదో మనకు చూడడానికి సమయం చిక్కుతుంది. మనని మనం దిద్దుకోవడం మానినపుడే ఎదుటి వాళ్ళ దిద్దు కోవలసిందేమిటో మనకు కనపడుతుంది. మనం అనుకొన్నందువల్ల చెప్పు కొన్నందువల్ల అవతలి వాళ్ల బాగుపడి పోతారను కోవడం భ్రమ. మనని మనం సరైన మార్గాన పెట్టుకుంటే క్రమంగా మనని చూచి వాళ్ల సరియైన మార్గాని కొస్తారు. ఇదొక్కటే సత్యం.

వ్యక్తి : బోధపడింది మాస్టారూ కర్తవ్యం. మీరు చెప్పినందు వల్ల కాకుండా మిమ్ములను, మీ ప్రవర్తనను చూచేకదా! మాలో మేము మార్పు తెచ్చుకుంటున్నది. అలాగే మా ప్రవర్తనని మేము సరిగ్గా మలుచు కుంటున్న కొద్దీ అవతల వ్యక్తులు కూడా మా యెడల తమ ప్రవర్తనలో

క్రమంగా మార్పు తెప్పిస్తుంటారు. [illegible] మీ సమా-
ధానము కొరకే మా లోపల [illegible]
ఉంచడం జరిగింది. సందేహమనే [illegible] సమ-
న్వయమనే వెలుగుతో ఇప్పుడు [illegible]
కొకసారి అయినా మీ దర్శనం [illegible]
కొంచెం వార్జి అవుతూ ఉంటాయి. [illegible] దర్శనం
చేసుకుంటాను.

మాస్టరుగారు : మంచిది [illegible]

వ్యక్తి : ఈ సారి మీ ఉపదేశాని [illegible]
లను తీర్చిదిద్దుకొని మిమ్మల్ని కలవడం జరిగింది.

మాస్టరుగారు : అంత [illegible]
ఖర్చుపెట్టి నిన్ను కోప్పడింది. [illegible]

## [illegible]

వ్యక్తి : మాస్టరుగారూ! మీ దర్శనం చేసుకుని, ఉపన్యాసాలు విని,
మీరు చేస్తున్న సేవా కార్యక్రమాలన్నీ చూసిన తరువాత మా [illegible]
ఇలాంటి కార్యక్రమాలు ప్రారంభించి నడిపించే [illegible] కోరిక
కలిగింది. కాని వచ్చిన చిక్కేమిటంటే మా [illegible]
అక్కర్లేని మూతా తగాదాలు. ఎవడు ఏ పని చేసినా [illegible]
అలాంటిచోట ఈ మంచి పనులను ప్రారంభించి నడపడం సాధ్యమౌ-
తుందా! అని ఒక విధమైన సందేహము, భయము కలుగుతున్నాయి.

మాస్టరుగారు : వాటినిగూర్చి ఆలోచించకుండా నీవు చేయదలచిన
మంచి పనిని నీవు మొదలుపెట్టు. నీవు చేస్తున్నది మంచి పని [illegible]

తెలుసు కాబట్టి నువ్వు ఎవరినీ సంప్రదించి పర్మిషన్ పొందవలసిన పనిలేదు. నీకు నీవుగా నీకు తోచిన విధంలో పని చెయ్యటం మొదలు పెట్టు. మొదటి దశలో కొందరు నిన్ను ఎగతాళి చేస్తారు. నీతో కలిసి వచ్చిన వాళ్ళతో కలిసి నీ పని రోజు రోజుకు పెరిగిపోతుంది. మీ సేవ పొందిన వ్యక్తుల అండదండలతో మీ కార్య క్రమాలు మరింత విస్తృతి చెందుతాయి. అప్పుడు పూర్వము ఎగతాళి చేసినవాళ్లే మిమ్మల్ని చూచి భయపడటం మొదలు పెడ తారు. మీరేదైనా సాధించగలరన్న నమ్మకం వాళ్ళకి కుదిరిన కొద్దీ వాళ్ళ భయం మరింత పెరుగుతుంది. మీ ఎడల ఎలా ఉండాలో అలా ఉండటం' ఎంత దూరంలో ఉండాలో అంతదూరంలో ఉండటం నేర్చుకుంటారు. కొంత కాలానికి నిజం తెలిసి వచ్చి వాళ్ళభయం భక్తిగా మారుతుంది. అప్పుడు వాళ్ళే పనికట్టుకొని మీ గూర్చి, మీ మంచితనంగూర్చి ప్రచారం చేయడం ప్రారంభిస్తారు. ఎక్కడ, ఎప్పుడు మంచి పనిని ప్రారంభించినా వాతావరణంలో ఇలాంటి మార్పులే వస్తాయి. కనుక మీరు నిర్భీతిగా సేవా కార్యక్రమాలు మీ ఊరిలో ప్రారంభించుకోవచ్చును. రెండు మూడేళ్ళ అయ్యేప్పటికి పార్టీల నాయకులందరూ మీ యింటి దగ్గర డిస్పెన్సరీలో రోగులకు చీట్లు వ్రాసి మందులు కడుతూ ఉంటారు. వేరే పనిలేక పోవటం వల్ల ఆ జనమంతా నినాదాలతో తిరుగుతున్నారు. అంతకన్నా మంచి పనిని మీరు చూపి నప్పుడు పూల దగ్గరికి తుమ్మెదలు చేరినట్లు వాళ్ళందరూ ఇక్కడికే చేరుకుంటారు. నడుచుకోవలసిన పద్ధతని ఒకటుంది. ఆ పద్ధతి ప్రకారం వెళితే విజయవంతం కాకపోవడం అనేది ఇక ఉండదు. పని మనది కానప్పుడు, పదిమందికీ పనికి వచ్చేదైనప్పుడూ దాని వలన ఏమీ అపేక్షించకుండా శ్రద్ధతో మనం ఆచరిస్తున్నప్పుడు ఇంకా ఆ పని పెరగక పోవటం అనేది ఉండదు. వామనుడిగా ప్రారంభమయిన ఆ పని త్రివిక్ర మత్వం సాధించే వరకు ఇక ఆగదు.

వ్య_క్తి : మీరుండగా మాకేంకావాలి మాస్టారూ? మీరు పద్ధతి ప్రకారం నడిపిస్తూ ఉండండి, మేము నడుస్తూ ఉంటాము.

మాస్ట రుగారు : తప్పకుండా! మీ రే స్థాయిలో పనిచేస్తూంటే ఆ స్థాయిలో నా నుండి ప్రణాళిక మీ కందుతూనే ఉంటుంది.

## B. పెళ్ళివారు

మీ ఆవిడ నీకు నిజమైన గురువు.

భార్య : మాస్ట రుగారూ! ఈ రోజు మా వారిని తీసుకొచ్చాను. నే నెంత ధైర్యం చెప్పినా ఆయన మాత్రం పిల్ల పెళ్ళిగురించి బెంగ పెట్టేసుకొని రాత్రిళ్ళు నిద్ర కూడా పోవటం లేదు. మధ్యలో ఒక రాత్రి వేళ "ఏమిటా మొద్దు నిద్ర" అని నన్ను కూడా లేపి కూర్చోపెడుతు న్నారు. మాస్టరుగారి దయవల్ల అన్నీ అవే అయిపోతాయని నేనెన్నిసార్లు చెప్పినా ఆయనకు మాత్రం తల కెక్కడం లేదు." నీకే నీవలాగే అంటావు. ఆలోచించకుండా పనులెలా అవుతాయి. అన్నీ మాస్టరుగారిమీద వదేసి కూర్చుంటే సరిపోతుందా?" అంటూ ఉంటారు పదే పదే.

మాస్ట రుగారు : ఏమయ్యా స్వామీ! ఆలోచిస్తే పనులయి పోతా యంటావా? అయితే చెప్పు. నిద్ర మానుకొని ఆలోచిస్తూ కూర్చుంటే అమ్మాయి పెళ్ళి అయిపోతుందని నువు నిజంగా నమ్మితే నీతో బాటు మేం కూడా 'టీ' త్రాగి మేల్కొంటాం. నీ నిద్రతోపాటు మా నిద్రకూడా చందా వేస్తాం. ఏం! అలా చేయమంటావా చెప్పు.

భ_ర్త : అదికాదు మాస్టారూ! అనుకున్నట్లవ లేదని మనస్సదోలా అయిపోతుందంతే.

మాస్టరుగారు : అది మార్గం కాదని తెలిసి కూడా అలా అయిపోతే ఎలాగూ? అమ్మాయి అదృష్టాన్ని బట్టి కాలం అనుకూలిస్తుంది. అనుకూలించనపుడు తగిన రీతిలో ప్రవర్తించడమే మనం చేయవలసిన పని. మన మనస్సు ఆందోళనకు, ఆవేదనలకు లోను గాకుండా ఉంటేనే ఆ అనుకూలమైన కాలం వచ్చినపుడు తగినట్లు ప్రవర్తించ గలం. ఏం! బోధ పడిందా? ఎప్పుడు చేయవలసిన పని అప్పుడు చేయటం అభ్యాసం చేసేవాడికి ఆలోచించడానికి ఖాళీ ఉండదు. ఆలోచించే అవసరమూ ఉండదు.

భార్య : మాస్టరుగారు చెబుతోంది మీకు బోధపడుతోందా? ఆ పాదాలను నమ్మండి. మీరు కూడా నాలాగ నిశ్చింతగా ఉండగలరు. మాస్టరు గారి దర్శనం అయ్యాకే, జరగవలసింది సమయానికి నా ద్వారా జరుగుతూ ఉండడమే తప్ప, నే నాలోచించడం ఎప్పుడైనా చూశారా? పనులు ఆలోచిస్తే అయ్యేవికావు, ఆయన చూస్తే అయ్యేవి. ఏది ఎప్పుడు జరిపించాలో ఆయనకు తెలుసు. ఇప్పటికైనా గ్రహించుకోండి.

భర్త : నాకు మటుకు తెలియదేమిటి? కాకపోతే నీలాగా నిబ్బరంగా నిలబడ గలగటం నాకింకా చేతకావటం లేదు.

భార్య : ఆ విషయమేదో "ఆయన" ముందే చెప్పుకుంటే సర్దుకుంటుందనే మిమ్మల్నిక్కడకు తీసుకురావటం.

మాస్టరుగారు ; నీకు నేను కాదయ్యా, మీ ఆవిడే నిజమైన గురువు. ఆవిడ చెప్పినట్లు వింటే చాలు, ఇక్కడవాకా రానక్కరలేదు.

భర్త : అదినిజమే మాస్టరుగారూ మీ మాటకీ, ఆవిడ మాటకీ నా అనుభవంలో తేడాలేదు. ఆవిడేదన్నా చెప్పిందీ అంటే మీ సంకల్పమేనని నాకు తెలుస్తూనే ఉంటుంది. మీరు 'మీడియమ్స్' అంటారే వాళ్ళల్లో ఈవిడ ఒకతె. నన్నూ, కుటుంబాన్ని సరిజేసేందుకై మాయింట్లో మీ రేర్పాటు చేసిన మీడియ మన్నమాట.

మాస్టరుగారు : ఆ మాత్రం 'సత్యం' నీ కందితే చాలు. ఇక నీ గూర్చి నాకు దిగులులేదు. పూర్వం"నీవే సఖుడవు, గురుడవు" అని వుండేది ఇపుడు "నీవే నా భార్యకూడ నిజముగ కృష్ణా" అని కలుపుకొని నన్ను తలుచుకుంటూ ఉండు.

భార్య : దాని అర్థమేమిటో తెలుసా? మీరివాల్టినుండి దిగులు పడదామన్నా పడలేరన్నమాట.

మాస్టరుగారు : నువ్వేమిటి రహస్య ప్రకాశం చేసేస్తున్నావ్.

భార్య : అంతా మీదయ మాస్టారూ! మీరు తలుచుకుంటే దేనిని అనుగ్రహించలేరు?

మాస్టరుగారు : నీలాగ నిలబడిన వారికి మాస్టరుగారేమైనా అనుగ్రహించగలరు.

భార్యాభర్తలు : వస్తాం మాస్టరుగారూ!

మాస్టరుగారు : వెళ్ళిరండి శుభం.

* * *

## నన్నేం చెయ్యమంటావో నీవే చెప్పు

వ్యక్తి : మాస్టరుగారూ ! సాయంత్రం వెళ్ళిపోదామనుకున్నదాన్ని మీతో మాట్లాడటం అవలేదని ఈ రాత్రికి ఉండిపోయాను. ఇప్పటికి అవకాశం దొరికింది మీతో మాట్లాడటానికి.

మాస్టరుగారు : సరే, ఉపోద్ఘాతం ఆపి విషయ మేమిటో చెప్పు.

వ్యక్తి: మీకు తెలియని దేముంది. అక్కడ నలుగురూ, అమ్మాయికి పెళ్ళి కాలేదని సతాయిస్తున్నారని చెప్పుతున్నానుగదా! చాలాసార్లు. (అని కన్నీళ్ళు పెట్టుకుంది)

మాస్టరుగారు: ఇలా ఏడుస్తున్నావు గనుకనే వాళ్ళలా సతాయిస్తున్నారు. ఎవరు ఉడికిపోతారో వాళ్ళను ఉడికించడం లోక లక్షణం. ఏం ఆ సతాయించే వాళ్ళని సరైన సంబంధం పట్టుకు రమ్మనక పోయావా? చెయ్యటానికి నువ్వు సిద్ధమే గదా? "చేతనైతే సంబంధం తీసుకురండి లేక పోతే నోళ్ళు మూసుకు కూర్చోండి" అని వాళ్ళకి చెప్పాలి.

వ్యక్తి : వాళ్ళలా కూర్చోరు గదండీ!

మాస్టరుగారు: వాళ్ళనోళ్ళు మూతబడాలంటే ఒకటే మార్గం. వాళ్ళ మాటలు నువ్వు లెక్క చెయ్యటం లేదని వాళ్ళకు తెలియాలి. వాళ్ళ మాటలు పట్టించుకోకుండా మీపని మీరు చూసుకుంటుంటే నోరు నొప్పెట్టే దాకా అట్టే సతాయించి ఇకలాభం లేదని తెలుసుకొని వాళ్ళే సర్దుకుంటారు.

వ్యక్తి : మరింతకీ అమ్మాయి సంగతి....

మాస్టరుగారు : ఆ విషయంలో ఏం చెయ్యాలో నీకెప్పుడో చెప్పాను. నీకు చేయగలనన్న ధైర్యం నీకుంటే నీ దగ్గర అట్టి పెట్టుకో! లేకపోతే నాకు అప్పచెప్పేయి. నీకు ధైర్యం చాలదు. నా దగ్గర వదిలి పెట్టలేవు. మరి నేనేంచేసేది? అసలు సమస్య నీలోనే ఉంది. అది తేల్చుకోవలసింది కూడా నువ్వే. నాదేముంది. నీకేది కావాలంటే అది చేస్తాను. నిర్ణయించవలసింది నువ్వు.

వ్యక్తి : నిర్ణయించ వలసిందేమిటి మాస్టారూ!

మాస్టరుగారు: నా నిర్ణయం ఎప్పుడో చెప్పాను గదా? అది ఆచరణ లోకి రాలేదంటే ఇక నిర్ణయించవలసింది నువ్వా నేనా? నువ్వు నిర్ణయించు నిర్ణయించి చెప్పు. నన్నేం చేయమంటావో! వెళ్ళిరా!

## పెళ్ళికి చూడవలసిందేమిటి?

వ్యక్తి : మాష్టరుగారూ! మీతో ఒకముఖ్యమైన విషయం మాట్లాడాలి.

మాష్టరుగారు : ఏమిటి చెప్పండి.

వ్యక్తి : మా అమ్మాయికి ఒక సంబంధం వచ్చింది. కుర్రవాడు బొంబాయిలో ఉన్నాడట. ఎం టెక్. ప్యాసయ్యాడుట. నెలకు రెండువేల వరకూ సంపాదిస్తున్నాడుట. వాళ్ళ తల్లి దండ్రులకు కొంచెం పెద్ద మొత్తం మీద మోజుంది. అదిస్తే వారు సిద్ధమే నన్నారు. మీరు బాగుంది అంటే నేను ముందుకు అడుగేస్తాను.

మాష్టరుగారు : అబ్బాయిని మీరు చూశారా ?

వ్యక్తి : లేదండీ, వాళ్ళ పెద్దలతో మాట్లాడాను. ఈ విషయమంతా వాళ్ళే చెప్పారు.

మాష్టరుగారు : అమ్మాయిని అవతలి వాళ్ళు చూశారా ?

వ్యక్తి : లేదండీ, కట్నం నిర్ణయమయ్యాక ఏకంగా చూస్తా మన్నారు.

మాష్టరుగారు ; చాలా బాగుంది. మీరు అబ్బాయిని చూడలేదు, వాళ్ళు అమ్మాయిని చూడలేదు. అబ్బాయి అమ్మాయి ఒకరి నొకరు చూసు కోనేలేదు. 'ఎం. టెక్'కు రెండు వేలకు, బియస్‌సి యాభై వేల నిచ్చి నిశ్చయం చేయబోతున్నారు. మీరంత ఉన్మత్తస్థితిలో ఉన్నప్పుడు ఇంక నేను చెప్పేదేముంది?

వ్యక్తి : అదికాదు .... అదికాదు మ్యాష్టరుగారూ! మీరు సెలవిచ్చి నట్లే నడుచుకొంటాను.

మాస్టరుగారు : పెళ్ళికి చూడవలసిందేమిటి? అబ్బాయినీ అమ్మాయినా? డిగ్రీలని, డబ్బునా? అబ్బాయికి అమ్మాయికి ఈడూజోడూగా ఉంటుందా లేదా? మనస్తత్వాలూ కలుస్తాయా లేదా? దాంపత్యం నప్పుతుందా లేదా? అనేవి చూసుకొని అవన్నీ సరిపోయిన తర్వాత చెప్పుకోవలసిన తుక్కు విషయాలు వల్లించి, మీరు నిర్ణయం చేయమంటే నేనేం చేసేది? మనం పెళ్ళి చేస్తున్నది మన పిల్లలకని కొంచెం గుర్తుండాలి. నువ్వు నీ కూతుర్ని వదిలించుకోవాలని చూస్తున్నావ్. వాడు వాడి కొడుకుని చూపించి గుంజుకోవాలని చూస్తున్నాడు. ఇలాంటి తల్లిదండ్రులు చేసేవి నిజమైన పెళ్ళిళ్ళవుతాయా? చూడవలసిన నిజాలను మరచి మీరూ, వాళ్ళూ అప్రధానమైన వాటికి ఆరాటపడుతున్నారు మధ్యలో నన్ను ఇరికించడం ఎందుకు? మీరు చేస్తున్న పని బాగున్నదని మీ రనుకొంటున్నారు. దానికి నన్ను సర్టిఫికెట్టు యిమ్మంటున్నారు. అంతేనా?

వ్యక్తి : నిజమే మాస్టరుగారూ? మీ మందలింపుతో గానీ నాకు నిజం బోధపడలేదు. పెద్ద ఉద్యోగస్థుడి కిచ్చి పెళ్ళి చేద్దామనే తప్ప దాంపత్యానికి జతగూర్చే ముందు అంత కన్నా విలువైనవి చూడవలసినవి ఉంటాయి. అవి చూడకుండా మనవాళ్ళు తొందరపడి చేసినందువల్లనే చాలాసంసారాల్లో కలతలు పుట్టుకు వస్తున్నాయనీ ఇప్పుడు అనిపిస్తోంది. నేను మీ బిడ్డలాంటి వాడిని. తొందరపడినందుకు క్షమించండి మీరు చెప్పిన ముఖ్యమైన అంశాలు నప్పనిదే నేను అమ్మాయికి పెళ్ళి చెయ్యను. నప్పాయని నేను కాక మీరు అన్ననాడు మీ చేతులమీదుగానే ఆ మూడు ముళ్ళూ వేయిద్దురుగాని. వస్తాను. దయ ఉంచండి.

మాస్టరుగారు : దయ ఉండబట్టే గదా స్వామీ! పూనుకొని చివాట్లు పెట్టింది. నువ్వు వచ్చిన ఊపుకి నేను బ్రేకు వెయ్యకపోతే రేపే శుభ

లేఖలు వేయించేసేవాడివి. వెళ్లి పెళ్లి కొడుకుని చూసిరా! నేనెందుకు బ్రేకు వేశానో నీకే బోధ పడుతుంది.

## జాగ్రత్తగా బుట్టలోపడేయి

వ్యక్తి : మాస్టరుగారూ! మనవాడు వాళ్ళమ్మాయికి సంబంధం నిశ్చయించాడుట. ముహూర్తం కూడా పెట్టాడుట. జాతకాలు పంపించాడు మీకు చూపించమని. చూస్తారా మాస్టారూ! ఇమ్మంటారా?

మాస్టరుగారు : అక్కరలేదు. అలా ఉండనీ.

వ్యక్తి : మరి అతనికి ఏమని వ్రాయమంటారు.

మాస్టరుగారు : అలాగే అనుకున్నట్లే కానిమ్మని వ్రాయి.

వ్యక్తి : అయితే వీటినేం చేయమంటారు.

మాస్టరుగారు : ఒకటి చెయ్యి, జాగ్రత్తగా ఆ బుట్టలో పడేయి. అదేమిటోయ్! అలాచూస్తావ్. పెళ్లికి ముహూర్తం పెట్టుకున్నాక ఇప్పుడు మనల్ని జాతకాలు చూడమనడంలో అర్థమేమిటి? చూసి ఒకవేళ నప్పలేదని చెప్పామనుకో! పెళ్లి చేయడం మానేస్తాడా! అందుకే చూడనక్కర లేదన్నాను. మన చేత అవుననిపించుకోవడమే గదా అతనికి కావల్సినది. అలాగే అనుకున్నట్లే కానిమ్మని వ్రాయి.

## తిరుపతిలో పెళ్ళికి ముహూర్తం

వ్యక్తి : మాస్టరుగారూ! తిరుపతిలో అమ్మాయి పెళ్ళి జరపడానికి నిశ్చయమైంది. మీరు ముహూర్తం పెట్టాలి.

మాస్టరుగారు : తిరుపతిలో చేస్తున్న పెళ్ళికి మనంకాదు ముహూర్తం పెట్టవలసింది వెంకటేశ్వర స్వామి. ఆయన సన్నిధిలో చేస్తూ ఇంకెవరినైనా ముహూర్తం పెట్టమని అడిగారంటే ఇంక అక్కడ చేయడం అనవసరం;

నేను మటుకు పెట్టను. ఇంకెవరిచేతైనా మీరు పెట్టించుకున్నా పెట్టుడు ముహూర్తానికి మాత్రం అక్కడ పెళ్ళి జరగదు. వాడి ఇష్ట ప్రకారం చేయ డానికి అక్కడికి వెళ్ళాలిగాని మన ఇష్ట ప్రకారం చేసుకునే కాడికి అక్కడి కెందుకు.

## పెద్దవాడికి పెళ్ళి కాకుండా......

వ్యక్తి : మాష్టారుగారూ! మా పెద్దవాడి సంగతి మీకు తెలుసు గదా! వాడేమో పెళ్లిచేసుకో నంటున్నాడు. మీరు చెబితే ఏమైనా వింటాడేమో తెలి యదు. ఈ రెండో వాడికి సంబంధం మూడేళ్ళ క్రితమే నిశ్చయమైంది. వాళ్ళేమో పెళ్ళికి తొందర పడుతున్నారు. పెద్దవాడి పెళ్లి కాకుండా రెండో వాడికెలా చేయటమా అని మేం పెద్దవాడికి నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తు న్నాం. ఏళ్లు జరిగిపోతున్నాయి గాని వాడు దారికి వచ్చేటట్లు కనబడటం లేదు. ఇప్పుడేం చేయమంటారు? ఈ సమస్య ఎలా తేలుతుందంటారు?

మాస్టరుగారు : ఇందులో సమస్యేముంది తేలడానికి. చేసుకుంటా నన్నవాడికి చేసెయ్యడం, చేసుకోనన్నవాడికి వాడు చేసుకుంటా ననేదాకా ఆగడం.

వ్యక్తి : మరి పెద్దవాడికి కాకుండా........

మాస్టరుగారు : ఆ అనుమానం ఏమీ అక్కరలేదు. వాడి యోగం ఎప్పుడుంటే అప్పుడౌతుంది. దానికి మీరేం చేస్తారు? చేసుకోనంటున్న వాడిని బ్రతిమాలుతూ చేసుకుంటానన్న వాణ్ణి పట్టించుకోక పోతే అవతల ఆడపిల్ల గల వాళ్ళేమైపోతారు. ఆ పెద్దవాడి సంగతి నాకు వదలి చిన్న వాడికి లక్షణంగా పెళ్లి చేసెయ్యండి. ఆ పెద్దవాడు కొద్దికాలం పోతే వాడే చేసుకుంటా నంటాడు. అప్పుడు నేనే చేస్తాను వాడి పెళ్లి.

వ్యక్తి : అలాగే మాస్టరూ! తమ రాజ్ఞాపించినట్లే కార్యక్రమం నడి పిస్తాను.

## నిశ్చయమయ్యాక...

వ్య క్తి : మాస్టారూ! మీరు ఉత్తరంలో వ్రాసినట్లే అన్నీ జరిగాయి. అమ్మాయికి వివాహం నిశ్చయమైంది. ప్రధానంకూడా జరిగింది.

మాస్టరుగారు : మరి పెళ్ళెప్పుడు నిశ్చయించారు?

వ్య క్తి : ముహూర్తమింకా నిశ్చయం కాలేదు మాస్టారూ. వాళ్ల వాళ్లంతా తలొక చోటా దూరదూరంగా ఉన్నారుట! వాళ్లందరికీ సెలవులు కలిసి రావాలని చూస్తున్నారు.

మాస్టరుగారు : ఏది ఏమైనా ఒకసారి అవుననుకొన్న తర్వాత సాధ్యమైనంత త్వరలో జరిగిపోవడం మంచిది. నిశ్చయానికీ, ముహూర్తానికీ మధ్య ఎక్కువ గ్యాప్ వుండటం మంచిది కాదు. త్వరలో ముహూర్తం పెట్టించే ఏర్పాట్లు చూచుకోండి.

## మీ విశ్వాసమే రప్పించగలదు

వ్య క్తి : మాస్టరుగారూ! ఈ రోజు రాత్రి 8-30కి అమ్మాయి వివాహం. మీరు సకుటుంబంగా రావాలి.

మాస్టరుగారు : కుటుంబం వస్తారు. నేను రావడానికి ప్రయత్నిస్తాను ఒకవేళ నేను రాలేకపోయినా మీరు బాధ పడకూడదు. నేను రాకపోవడం జరిగితే ఎలాంటి సన్నివేశంలో ఉండి ఉంటానో మీకు తెలుసుగదా! మంచి జరిగే చోట మనం ఉన్నా లేకపోయినా ఫరవాలేదు. ప్రమాదంగా ఉన్నచోట మనం ఉండి జాగ్రత్తగా కర్తవ్యాన్ని నిర్వహించ వలసి ఉంటుంది. కనుకనే అన్నాను నేను రాలేకపోతే బాధ పడగూడదని.

వ్య క్తి : కానున్న దంపతులు అదృష్టవంతులైతే మీకా టైమ్‌కి ఏ సీరియస్ కేసులూ లేకుండా ఉంటాయి. మీరాక వారికి ప్రాప్తి వుంటే మీకా టైమ్‌కి అవకాశం కుదురుతుంది.

మాస్టరుగారు : మీ విశ్వాసమే తగిన వాతావరణాన్ని సృష్టించగలదు. పదండి. ఆ వేళకు అక్కడ ఉంటాను.

వ్య క్తి : సంతోషం. ఆ మాటే మాకు అనంతమైన ఉత్సాహాన్నిస్తుంది.

# సమస్యలు - సరిదారులు

**కుటుంబ నియంత్రణ ధర్మమేనా?**

వ్యక్తి : మాస్టరుగారూ! కుటుంబ నియంత్రణ అవలంబించడం ధర్మమే నంటారా?

మాస్టరుగారు : ప్రకృతిని వ్యతిరేకించడం ధర్మమెలా అవుతుంది?

వ్యక్తి : మరి పిల్లలు ఎక్కువైతే భరింపడం, పోషించడం ఎలా?

మాస్టరుగారు : పిల్లలను ఎక్కువగా కనమని మిమ్మల్ని ఎవరు బలవంతంచేశారు?

వ్యక్తి : ఏమిటి మాస్టారూ మరీ అలాగంటారు?

మాస్టరుగారు : అదేమిటయ్యా! ఉన్నదున్నట్లు అడిగితే ఇబ్బందిగా మొహం పెడతావేమి? ప్రకృతిలో ఏ జీవికైనా ఈ సమస్య వచ్చిందా? ఒక్క మానవునికి తప్ప.

వ్యక్తి : రాలేదు.

మాస్టరుగారు : ఎందుకు రాలేదంటావు? అవి ఋతు కాలంలో సంతతి కోసం మాత్రమే కలుసుకుంటున్నాయి. మానవుడు సంతతి కలుగ కుండా సుఖపడదామని చూస్తున్నాడు. ఇతర జీవులకు ఆ సుఖం లభించ కుండా కృత్రిమంగా సంతానోత్పత్తి జరిగేటట్లుగా శాస్త్రీలు కనిపెడు తున్నాడు. తన సుఖానికి సంతానం అడ్డు రాకుండా శాస్త్ర సహాయంతో జాగ్రత్త పడాలని చూస్తున్నాడు. చూశావా మన అభ్యుదయం!

వ్యక్తి: ఇంతకీ అనుసరించవలసిన మార్గం ఏమిటంటారు?

మాస్టరుగారు: నువ్వు కష్టపెట్టుకోకుండా వుంటానంటే చెబుతాను.

వ్యక్తి: భలేవారు మాస్టారూ! మరీ ఆట పట్టిస్తున్నారు. ఇంతకూ అసలు మార్గం ఏమిటో చెప్పండి. మీ అండతో నేను ఆచరించి పదిమందికి ప్రచారం చేస్తాను.

మాస్టరుగారు: అసలు కామం అనేది ఎందుకు ఏర్పడిందంటావు? ప్రకృతి చాలా తెలివైనది "బాబూ! మీ తర్వాత తరాలు నిలబడాలి. కాస్త పెళ్ళిచేసుకొని సహకరించండి" అని బ్రతిమాలి అడిగితే మనం కాళీ లేద న్నట్లు మొహం పెడతామని దానికి బాగా తెలుసు. అందుకని కుక్కకి బెల్లంముక్క పడేసినట్లు మానవుని మనస్సుకు కామాన్ని విసిరింది. దాంతో ఎవరికి వారు స్వంత ప్రేమనీ, స్వంత పెళ్ళనీ, స్వంత పిల్లలనీ కానికూలి అడగకుండా ప్రకృతిపని చేసి పెడుతున్నారు. మన పని అనిపించేటట్లుగా తనపని చేయించుకుంటుంది. ఈ రహస్యాన్ని గమనించి మనపనిగా గాక, ప్రకృతి పనిగానే సంతతికొరకు మాత్రమే కామాన్ని అనుభవించినవాడు యోగి అవుతున్నాడు. అలాంటి యోగి జీవితంలో సంతతి ఎంతవరకు అవసరమో, అంతవరకే కామానుభవ ప్రసక్తి వుంటుంది. కావలసిన సంతతి కల్గిన తరువాత కామప్రసక్తి విడచి కేవలం స్నేహితులుగా, సహచరులుగా దివ్యజీవనాన్ని గడపడం వివేకవంతుని మార్గం.

వ్యక్తి: మీరు వివరించిన సత్యాలు నూటికి నూరుపాళ్ళ నిజాలు. కాని ఒక్కటే బాధ. ఈ కాలం మనుషులు ఈ సత్యాలు ఎంతవరకు ఆచరణలో పెట్టుకోగలరూ అని.

మాస్టరుగారు: మనం ఆచరణలో పెట్టుకోనంత మాత్రాన సత్యాలు సత్యాలు కాకపోవు. రాబోయే శతాబ్దంలో ఏం జరుగుతుందో తెలుసా? తలి దండ్రులు పిల్లలకి ప్రదర్శనశాలలో చూపిస్తూ "ఇక్కడ బొమ్మలు ఇర వయ్యో శతాబ్దం వాళ్ళవి. వీళ్ళు కామం చేతిలో ఓడిపోయినవాళ్ళు. అదే వీళ్ళ ప్రత్యేకత" అని చూపిస్తారు. అప్పుడా పిల్లలు మన ముఖాలు ఎలా చూస్తారో ఊహించవచ్చు.

వ్యక్తి: అయితే మన మనుమళ్ళు మనని వెక్కిరిస్తారన్నమాట.

మాస్టరుగారు: ఓ! దర్జాగా.

వ్యక్తి: అయితే మనం బాగుపడటానికి ఏమిటి మార్గం?

మాస్టరుగారు: ఒక్కటే మార్గం వుంది. మన మనుమళ్ళకి మళ్ళీ కొడుకులుగా పుట్టి ఎలా బ్రతకాలో నేర్చుకుందాం.

## జనాభా తగ్గేదెలా ?

వ్యక్తి: మాస్టరుగారూ! ప్రస్తుతం జనాభా సమస్య పెద్దదిగా ఉంది కదా! ఇది ఎందుకింత పెద్దదయిందంటారు? దీనిని అదుపులోనికి తేవటం ఎలా? పాపం గవర్నమెంటు వాళ్ళు నానా ప్రయత్నాలు చేస్తున్నారు. కాని పరిస్థితి ఒక కొలిక్కి రావటంలేదు.

మాస్టరుగారు: ఈ సమస్య కేవలం మనం సృష్టించుకొన్నది. జనాభా పెరగడానికి మొదటి కారణం-మానవుడు కావలసిన సంతానాన్ని పొందకుండా తన కామానికి బై ప్రొడక్ట్సుగా సంతానాన్ని పొందడం. రెండవది శరీరం ధరించిన పని అయిపోగానే తృప్తితో శరీరాన్ని వదిలివేయాలి అనే వివేకం లేకపోవడం.

వ్యక్తి: అంటే ?

మాస్టరుగారు: నువ్వు భారతం చదివావా!

వ్యక్తి: చదివాను.

మాస్టరుగారు: అందులో చివరకు ధర్మరాజు వాళ్ళేం చేశారు? తాము శరీరం ధరించిన పని అయిపోగానే పరీక్షిత్తుకు పట్టం కట్టి ఉత్తరాభిముఖంగా తిరిగిచూడని ప్రయాణం చేశారు గదా! దానినే మహాప్రస్థానం అంటారు. అలా వెళ్తూనే వారివారి శరీరాలు వదిలివేశారు. అది మన పెద్దలు అనుసరించిన మార్గం. ఈ మార్గం ప్రకారం శరీరాలతో దిగివచ్చినవారు తమ పనులు, కర్తవ్యాలు పూర్తికాగానే వివేకవంతులై శరీరాలు వదలి

వేస్తుంటే జనాభా అనేది సమస్యకాదు. అయితే ఇక్కడ వదలిపేయడం అంటే తాను వచ్చినపని అయిపోయిందనుకొని ఏ ఆత్మహత్యో చేసుకోవడం కాదు. యోగమార్గంలో ప్రయోజనాత్మకమైన దివ్యజీవనం నడుపుతున్న వాడికి దిగివచ్చిన పని పూర్తికాగానే చెట్టునుండి పండిన పండు రాలినట్లు శరీరం రాలి పడిపోతుంది. జీవితాన్ని కోరికల కొరకు ఖర్చుపెట్టడం కాక, కర్తవ్యం కొరకు వినియోగించిన వాడికే ఈ విలువైన అవకాశం లభిస్తుంది. ఎప్పుడెప్పుడు ప్రజలు వివేకవంతులై కామశక్తినీ, జీవశక్తినీ లోకహిత దృష్టితో సద్వినియోగపరచుకుంటారో అప్పుడప్పుడు జనాభా సమస్యల వంటి సమస్యలు ఊహిద్దామన్నా వుండవు.

వ్యక్తి: మీలాంటి వారివల్లే లోకంలో అలాంటి మంచిమార్పు రాగలదని నా నమ్మకం.

మాస్టరుగారు: మీ కా నమ్మకం కలిగింది అంటే మేము వచ్చిన పని జరుగుతోంది అన్నమాట.

## యువతరం దారి తప్పడానికి కారకు లెవరు ?

వ్యక్తి: మాస్టరుగారూ! ఏమిటో ఈమధ్య యువతరం మరీ వెర్రితలలు వేస్తోంది. ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తారో ఆ కుఱ్ఱవాళ్ళకే తెలియకుండా వుంది. కాబోయే పౌరులుకదా వీళ్ళు! దేశ భవిష్యత్తు వీళ్ళ మీద ఆధారపడి వుందికదా! వీళ్ళిలా పద్ధతి లేకుండా విచ్చలవిడిగా విధ్వంసకరంగా ప్రవర్తించడం చూస్తూంటే ఏమైపోతారా వీళ్లు అనిపిస్తుంది. అసలు వీళ్ళు ఇలా ఎందుకు చెడిపోయా రంటారు?

మాస్టరుగారు: మన పిల్లలు కనుక చెడిపోయారు. చెట్టునుబట్టి కదా కాయలు ఉండేది? మనసుబట్టి మన పిల్లలు వుంటారు. యువతరం అని వాళ్ళకు వేరే నామకరణం చేస్తావెందుకు, తప్పించుకోవడానికి? అక్కడ ఉన్నది నీ పిల్లలు, నాపిల్లలు మనలాటివాళ్ళ పిల్లలు. వాళ్ళను అలా

తయారుచేసింది మనమూ, మన ప్రవర్తన. మనం వాళ్ళపట్ల ఎలా వుండాలో అలా వుండటంలేదు కనుక వాళ్ళు, వాళ్ళకెలా తోస్తే అలా వుంటున్నారు. కోప్పడకు, ఒక చిన్నమాట అడుగుతాను. మనదగ్గర నుండి అంటే మన తరంనుండి పిల్లలు నేర్చుకోవలసినది ఏమిటి ఉందంటావు? కోర్టులకెక్కడం నేర్చుకోవాలా? కులాల తగాదాలునేర్చుకోవాలా? త్రాగుడు, జూదం నేర్చుకోవాలా? ఏం నేర్చుకోవాలి? నేర్చుకోవలసినది లేక, నేర్చుకోవలసినదేమిటో తెలియక అలా వీధిన పడుతున్నారు ఆ కుఱ్ఱవాళ్లు.

వ్యక్తి: మీరు చెప్పిన సత్యాన్ని నేను కాదనలేను. ఈ తరం తల్లిదండ్రులకు నైతిక విలువలు తక్కువ. కానీ పిల్లల విషయంలో చేయవలసినదంతా చేస్తున్నాము కదా!

మాస్టరుగారు: చేయవలసినదంతా చేస్తున్నామంటావా! ఏమిటా చేస్తున్నది? మాటలుకూడా రాకముందే కాన్వెంట్లలో పారేస్తున్నాం. డ్రస్ కుట్టించి పుస్తకాలు చేతికిచ్చి, టిఫిన్‌బాక్సుసర్ది, కాన్వెంట్ బస్ ఎక్కిస్తే మన బాధ్యత అయిపోయిందనుకుంటున్నాం. చదువులకు ఫీజులుకట్టటం, కావలసినవి కొనిపెట్టటం, ఇవేనా తల్లిదండ్రులు నిర్వహించవలసిన బాధ్యతలు? వీటిపైన మరొకటి ఉన్నది. అది మన బిడ్డలను మనం తీర్చిదిద్దడం. దానికి మనకి కాళీ ఉండటంలేదు. మనం చాలా బిజీగా ఉంటున్నాం. ఈ బిజీ అంతా ఆ పిల్లల కొరకే అంటున్నాం. కానీ వాళ్ళకి ఏం చేయాలో అది చేయలేక పోతున్నాం. చేతులు కాలాక ఆకులు పట్టుకుంటున్నాం.

వ్యక్తి : అక్కడికీ అవకాశం ఉన్నప్పుడల్లా మనం ఎలాగూ చెడిపోయాం, వాళ్ళయినా బాగుపడాలని కలగచేసుకొని ఇది మంచి, ఇది చెడు అని చెపుతూనే ఉంటాను. కాని ఎక్కడ? వాళ్ళ తలకు ఎక్కందే!

మాస్టరుగారు : పిల్లలు మనం చెప్పినట్లు చేయటం లేదంటావు. పిచ్చివాడా! పిల్లలు ఎప్పుడూ మనం చెప్పినట్లు చేయరు. మనం చేసినట్లు చేస్తారు. చేతనైతే చేయడంలో జాగ్రత్తపడాలి. కోపం వచ్చి, కేకలేసి

ధర్మపన్నాలు పల్లించినంత మాత్రాన తేలికౌతాం తప్ప, వారు బాగుపడరు. మనవల్లి వాళ్ళు బాగుపడాలంటే మన ప్రవర్తన నుంచి వాళ్ళు నేర్చుకోవల సినదేదైనా ఉండితీరాలి. అధికారం పోయినవాడు ఎలా ఆజ్ఞాపించలేడో, అర్హత కోల్పోయినవాడు అలాగే చెప్పి వినిపించలేడు. మన ప్రవర్తనలో తీరుతెన్నులు ఉన్ననాడు మనం చెప్పవలసిన అవసరం లేకుండానే మనను చూచి మన పిల్లలు పెరగవలసిన తీరులో పెరుగుతారు, ఏం బోధపడిందా? మన పిల్లలు కనుక చెడిపోయారని ఎందుకు అన్నానో!

వ్యక్తి : బాగా బోధపడింది మాస్టారూ!

మాస్టరుగారు : ఏమిటోయ్ బాగా అంటున్నావు.

వ్యక్తి : అదే మాస్టారూ సినిమారీలులో ఉన్న చిన్న మచ్చ, తెర మీద పెద్దమచ్చగా కనపడినట్లు మనలో వున్న లోపాలే మన పిల్లలను అలా పాడుచేస్తున్నాయి. దిద్దవలసినది వాళ్ళనుకాదు. ముందు మనని మనం దిద్దుకోవాలి అని, మీ మాటలతో నిజంగా నాకు కనువిప్పు కలిగింది మాస్టారూ !

మాస్టరుగారు : అయితే మొత్తంమీద బోధ పడిందంటావు.

వ్యక్తి : మీరు చెప్పడం, ఒంటపట్టక పోవడమూనా!

## పిల్లలకి పద్ధతి వచ్చేదెలా ?

వ్యక్తి : ఏమిటో మాస్టారూ! ఎన్ని అమర్చిపెట్టినా ఈ పిల్లలు ఒక పద్ధతిలోకి రావడంలేదు. వాళ్ళల్లో వాళ్ళకి కలవడంలేదు. ఏం చేస్తే వీళ్ళు ఒకదారికి వస్తారో నాకు బోధపడటంలేదు.

మాస్టరుగారు : ఏమి టేమిటి అమర్చిపెట్టావు పిల్లలకి?

వ్యక్తి : అక్కడికీ చదువుకోడానికి ఎవరి రూము వాళ్ళకి ఏర్పాటు చేశాను. ఒక్కొక్కళ్ళకి ఒక్కొక్క టేబిల్‌లైటు కూడా ఏర్పాటుచేశాను. ఒకేబళ్ళో చదువుతున్నా ఎవరి క్యారేజి వారికి ఏర్పాటు చేశాము. ఇలాగ

పోట్లాటలు రాకుండా వుండాలని ఎవరివి వారికి ఎన్ని ఏర్పాటు చేసినా ఒక ళ్ళతో ఒకళ్లు కలిసి ఉండలేకపోతున్నారు.

మాస్టరుగారు : మీరు పిల్లలకు చేసింది ఏర్పాటు అనుకుంటున్నా రేమో—అది ఏర్పాటు కాదు. వేర్పాటు వారు చెడిపోవడానికి ఎన్నికావాలో అన్నీ చేసి చెడిపోయారని ఏడుస్తారేం? ఎవరి రూములో వాడు ఉంటూ, ఎవడి లైటుదగ్గర వాడు చదువుకొంటూ, ఎవరి క్యారేజీలో వాడు భోంచేస్తూంటే, ఇక వాళ్ళెందుకు కల్సి వుంటారు? మీరు చేసిన ఏర్పాట్లతో వాళ్లు ఎవళ్ళకి వాళ్ళుగా బ్రతుకుతున్నారు. ఒకళ్ళకి ఒకళ్ళుగా బ్రతకవలసిన అవసరం వాళ్ళకేమిటి ?

వ్యక్తి : అయితే ఇప్పుడు ఏం చేయాలంటారు?

మాస్టరుగారు : శృతిమించిన తర్వాత ఇంకా ఇప్పుడు నువ్వు చేసే దేమిటి? వాళ్ళే నిన్ను ఏమైనా చేస్తారు. ఒకటి చేసుంటే బావుండేది.

వ్యక్తి : ఏమిటది మాస్టారూ!

మాస్టరుగారు: నీళ్ళు పోయిన తర్వాత గట్టు వేసినట్లు నీకు పనికి రాకపోయినా మిగిలిన వాళ్ళకైనా పనికివస్తుందేమో చెబుతాను విను. చిన్నప్పటినుండి పిల్లలు కలిసి బ్రతికేటట్లుగా వారి దినచర్య అమర్చాలి. కలిసి గట్టుతనం మనం నూరిపోస్తే వచ్చేదికాదు. వాళ్ళ దినచర్యలోనే వాళ్ళకు అలవడేటట్లుగా చూడాలి. ఒకేతొట్టిలో నీళ్ళు అందరూ పోసుకునేటట్లు చూడటం, ఒకేచోట అందరూ కలిసి భోంచేసేట్లు చూడటం, ఒక హాలులో అందర్నీ పక్కపక్కన పడుకొనేట్లు చూడటం, ఒకే క్యారేజిలో నలుగురూ నాల్గుముద్దలు తినేట్లు చూడటం, మొదలైన పద్ధతులు ఆచరణలో పెడితే కలిసి బ్రతకటంలోని రుచి ఆ పిల్లలకి తెలుస్తుంది. ఆ రుచి తెలిసిన తర్వాత చిన్నచిన్న విభేదాలు అవీ వస్తూ పోతూ ఉన్నా, వాళ్ళంతా జీవితాంతం కలిసి వుండాలనే కోరుకుంటారు. ఎలాగ నడిపితే పిల్లలకి కలిసిమెలసి వుండాలని ముచ్చట కలుగుతుందో, అలాగ నడపటం చేత

నైననాడు తల్లిదండ్రుల పాత్రను మనం సరిగా నిర్వహించ గలిగామన్న మాట.

## పల్లెటూళ్ళు ఎందుకిలా మారాయి ?

వ్యక్తి : చూస్తుంటే మా పల్లెటూళ్ళ కన్న ఈ బస్తీలే నయంగా కనిపిస్తున్నాయి బాబూ. ఇక్కడ ఒకళ్ళ ఊసు ఒకళ్లకి పట్టదు. ఎవళ్ళ మానాన వాళ్ళు పొట్ట పోసుకుంటూ ఉంటారు. ఇదంత మంచి లక్షణం కాకపోయినా గుడ్డిలో మెల్లగా మా పల్లెటూళ్ళ కన్న ఇదే నయమని పిస్తోంది పల్లెటూళ్ళు మునుపటిలా లేవు బాబూ! పూర్వం మా చిన్ననాటి రోజులలో కడుపులో చల్ల కదలకుండా హాయిగా ఉండేవాళ్ళం. మరి ఇప్పుడో—ఎక్కడ చూసినా కులాల కొట్లాటలు, పార్టీల పోట్లాటలు, కొడుకుని ఒక పార్టీ వాడు చేరదీస్తే తండ్రిని మరొక పార్టీవాడు నిమురుతున్నాడు! కొంపకొంపకీ రామ రావణ యుద్ధమే. గవర్నమెంటు వారి పుణ్యమా అని తాగితే తప్పు లేదన్నారు గదా! ఇక తాగనివాడిదే తప్పుగా కనపడుతోంది. పరిస్థితులు బాగుండలేదు బాబూ. పాలకుండల్లాంటి పల్లెటూళ్లు విషపు ముంతల్లా మారిపోతున్నాయి. ఎవణ్ణిఎవడు కలుపుకుంటాడో, ఎవణ్ని ఎవడు కూలదోస్తాడో చెప్పలేకుండా వున్నాం. మంచి, మానవత్వం మరి కనపడటంలేదు బాబూ ఈ కలియుగంలో. ఈ జనం గతి ఇంతేనంటారా! వీళ్ళకి ఇక మంచిరోజులు రావా బాబూ? మీ లాంటి వారిని చూసినప్పుడల్లా మళ్ళీ మంచిరోజులు వస్తాయని అనిపిస్తూ ఉంటుంది. మీలాంటి వాళ్ళు కలుగచేసుకోకపోతే ఈ జనం ఎటుకేసి పోతున్నారో వాళ్ళకే తెలియటం లేదు బాబూ. అసలు మా చిన్ననాటికీ, ఇప్పటికీ ఇంతలో యింత మార్పు ఎలా వచ్చిందంటారు ?

మాస్టరుగారు : మీ చిన్ననాటి రోజులలో పల్లెటూళ్లు ఎలా ఉండేవో మీకు తెలుసుగదా? ఆ రోజులలో ఎవళ్ళపని వాళ్ళు చేస్తూ అందరూ కలిసి, మెలిసి బ్రతికేవారు. కులాలు ఉండేవే గాని, కులాలమధ్య ఎక్కువ తక్కువలు, కొట్లాటలు ఉండేవికావు. జనం అంతా భేదాలు లేకుండా మామ,

తాత, బాబాయి అంటూ వరసలు పెట్టుకొని పిలుచుకునేవారు. ఒకళ్ళింటికి చుట్టమొస్తే అందరూ ముచ్చటపడేవారు. ఒకళ్ళింట్లో కష్టమొస్తే అందరూ ఆదుకొనేవారు. ఊరంతే ఒక పెద్ద కుటుంబంలా ఉండేది. ఊళ్ళో జరిగిన మంచి గాని, చెడు గాని అందరూ బాధ్యత పడేవాళ్ళు.

ఏనాడైతే రాజకీయాలు పల్లెటూళ్ళలో ప్రవేశించాయో ఆనాటినుండే పల్లెటూళ్ళు పాడైపోవడం మొదలు పెట్టాయి. రాజకీయ నాయకులు తమ, తమ స్వార్థాలకోసం, పదవుల కోసం కుల తత్వాలను రెచ్చగొట్టి అమాయక ప్రజలను తమ చేతులలో కీలు బొమ్మలుగా చేసుకున్నారు. ప్రజల బలహీనతలను కనిపెట్టి, వాళ్ళకి తాగబోయించి, వాళ్ళచేత వాళ్ళ తలలే పగలగొట్టించి, భీభత్సాలు చేయించడం ప్రారంభించారు. చదువుకున్నవాళ్లు పల్లెటూళ్ళను బాగుచేయవలసినదిపోయి, తమ తెలివితేటల నుపయోగించి పల్లెటూళ్ళను పార్టీలపాలు, కోర్టులపాలు, పోలీస్ స్టేషన్లపాలు చేశారు.

ఇది యిలా ఉండగా భూములను, వృత్తులను, వదలి చదువులు చదివి పల్లెటూళ్ళ వాళ్ళంతా ఉద్యోగాలకై వేటాడుతూ పట్నాలకు రద్దీ పెంచసాగారు. చదువుకున్నవాళ్ళకు తిరిగివెళ్ళి తమ తమ గ్రామాలను తీర్చి దిద్దుకుందామన్న సద్బుద్ధి కలగటంలేదు. పట్టణ ప్రభావం పడటం వలన గ్రామాలలో కూడ పాడి పంటలమీద కన్న నోట్ల కట్టలమీద మోజు పెరిగింది. పాడిపంటలు విక్రయించుకొని నోట్లకట్టలు కూడబెట్టుకొనే తత్త్వం పెరిగింది. ఎక్కడైతే పాడిపంటలు కన్నా నోట్ల కట్టలు గౌరవింప బడతాయో అక్కడ ప్రశాంతత మరి ఉండదు; తృప్తి ఇక లభించదు. ఎక్కడైతే పాడిపంటలు, వృత్తి విద్యలు నిరాదరింప బడతాయో అక్కడ నిరాశ నిస్పృహలు రాజ్యమేలతాయి. ఎక్కడైతే మనిషికన్న డబ్బు ముఖ్యమన్న భావన పెరుగుతుందో అక్కడ మనిషికి రక్షణలేని స్థితి ఏర్పడుతుంది. ఈ కారణాలవల్ల మన పల్లెటూళ్ళు మీరు చెబుతున్నంత భయంకరంగా తయారైనాయి.

వ్యక్తి : అవి మళ్ళీ బాగుపడే మార్గమేమి టంటారు?

మాస్టరుగారు ! ఒకప్పుడు చదువుకున్న వాళ్ళ స్వార్థబుద్ధివల్ల యీ పల్లెటూళ్ళు పాడైపోవడం ప్రారంభమైంది. మళ్ళీ ఇప్పుడు చదువుకున్న వాళ్ళ త్యాగ బుద్ధి వల్ల పల్లెటూళ్ళు బాగుపడవలసి ఉంది. కర్తవ్యాన్నెరిగిన విద్యావంతులు గ్రామాలకుచేరి, తమ, తమ, సత్కర్మాచరణలతో గ్రామాలను తీర్చిదిద్దటం జరగాలి. ప్రస్తుతం సరియైన దారిచూపేవాళ్ళు లేక అయోమయంలో పడిపోతున్నారు జనం. నమ్మదగిన మనుషులు, తమకు దారిచూపే మనుషులు, ఎక్కడ దొరుకుతారా అని వెయ్యికళ్ళతో వెతుక్కుంటున్నారు. ఈ సమయంలో వివేకవంతులైన విద్యావంతులు పూనుకుంటే కొద్ది సంవత్సరాలలోనే పల్లెటూళ్లు మళ్ళీ ఊపిరి పీల్చుకుంటాయి. కులతత్వాలు, రాజకీయాలు, కోర్టు తగాదాలు కొట్లాటలు తమను చెడగొట్టేవే కాని, తమకు కూడు పెట్టేవి కావని వాళ్ళ కిప్పుడిప్పుడే తెలిసి వస్తోంది. సరైన దారి చూపగలిగే వారికే తమనుతాము సమర్పించుకునే స్థితికి వస్తున్నారు వాళ్ళు. ఇది గమనించిన నేను చదువుకోవడానికి ఇక్కడకు వచ్చిన కుర్రవాళ్ళను తీర్చి దిద్ది పనికివచ్చే వాళ్ళుగా తయారుచేసి, వాళ్ళ వాళ్ళ ఊళ్ళకు పంపించడం మొదలు పెట్టాను. అక్కడికి వెళ్ళి వాళ్ళ విద్యాలయాలు, వైద్యాలయాలు, వృత్తి విద్యా శిక్షణలు, పురాణేతిహాస ప్రవచనాలు ప్రారంభించారు. ఇప్పుడా ప్రాంతాలు వాళ్ళే నమ్మలేనంతగా మారిపోయాయి.

వ్యక్తి : అయితే నన్నిప్పుడు ఏం చేయమంటారు? మీరేం చేయమంటే అది చేస్తాను.

మాస్టరుగారు: నేను చెప్పిన కుర్రవాళ్ళ మార్గాన్నే మీరూ అనుసరించండి. మిమ్మల్ని నేను తయారుచేస్తాను. మీరు మీ గ్రామాన్ని తీర్చి దిద్దండి.

వ్యక్తి : మీదగ్గర తయారయిన కుర్రవాళ్ళని కొందరిని చూశాను. వాళ్ళను చూడగానే నాకు కొండంత ధైర్యం వచ్చింది. వాళ్ళ మార్గాన నడిచి జీవితాన్ని సద్వినియోగపరచుకోవాలని కోరిక కలిగింది. మీరు నన్ను నడిపించండి. నడవడానికి నేను సిద్ధంగా ఉన్నాను.

మాస్టరుగారు: నడవడానికి మీరు సిద్ధమైతే, నడిపించడానికి నేను సిద్ధమే. ఇవ్వాళే హోమియోక్లాసులు ప్రారంభిస్తున్నాను. రండి, మీరూ వింటురుగాని.

వ్యక్తి : వినడమేమిటి? మీ ఆశీర్వాదం ఉంటే నేర్చుకొని మందు లివ్వాలని ఉంది.

మాస్టరుగారు: తప్పకుండా యిస్తారు. మీ మందులతో ఊళ్ళో అన్ని రోగాలు కుదురుతాయి.

వ్యక్తి: ఆ రోజు రావాలి బాబూ!

మాస్టరుగారు: త్వరలోనే వస్తుంది. ఇదిగో వచ్చింది మనం దిగ వలసిన చోటు. దిగండి వెళదాం.

## పట్టణాలకెందుకు ఎగబ్రాకుతున్నారు?

వ్యక్తి: రాను రాను వ్యవసాయాలు చేయడం కష్టమైపోతోంది మాస్టారూ! జనమంతా వ్యవసాయమంటే భయపడి పొలాలమ్ముకుని, పిల్లలను చదివించుకుని, పట్టణాలలో స్థిరపడటానికి ప్రయత్నిస్తున్నారు. ఈ స్థితి ఎందుకిలా వచ్చిందో బోధపడటంలేదు మాస్టారూ!

మాస్టరుగారు: గత యాభై సంవత్సరాలుగా ఒక విచిత్రమైన దుస్థితి ప్రారంభమై నానాటికి తీవ్ర రూపం ధరిస్తోంది. జీవితావసరాలైన వ్యవసాయము, వృత్తి విద్యలకు నిరాదరణ పెచ్చు పెరుగుతోంది. ఇన్ని శతాబ్దాలుగా పెద్ద పెద్ద కుటుంబాలను పోషిస్తూ వచ్చిన వ్యవసాయం, వృత్తి విద్యలపై ఈనాడు జనానికి నమ్మకంసన్నగిల్లుతోంది. వాటిని నిర్వహించడం

వల్ల కుటుంబ పోషణ జరగదేమో, వారసులు బ్రతికి బట్టకట్టరేమో నన్న భయం పెరుగుతోంది. దానితో జనం ఉద్యోగాలవెంట, వ్యాపారాలవెంట పడుతున్నారు. ఏదో ఒకలా నాలుగు డబ్బులు సంపాదించుకుందామనే కక్కుర్తిపడిపోతున్నారు. మొత్తంమీద జరుగుతున్న దేమిటంటే జీవనాధారాలైన వ్యవసాయం, వృత్తివిద్యలనుండి విముఖులై జనం నోట్ల వెంట పడుతున్నారు. దీనితో నోట్లకు విలువ తగ్గిపోతోంది. ఉత్పత్తిచేసే వారికన్న, ఆ ఉత్పత్తులనుపయోగించి డబ్బు చేసుకునేవాళ్ళు పెరుగుతున్నారు. దీనితో అన్ని వస్తువుల ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. రాను రాను జనం శ్రమపడకుండా డబ్బు సంపాదించే మార్గాలకోసం అన్వేషిస్తున్నారు. తాము శ్రమపడకపోగా శ్రమపడి జీవించేవారిని చిన్న చూపు చూడడం నేర్చుకుంటున్నారు. శ్రమపడకుండా జీవించడం ఘనతగా భావిస్తున్నారు. ఈ విధంగా జాతిలో ఎక్కువ మంది సామర్థ్యాన్ని కోల్పోయి నిర్వీర్యులవుతున్నారు.

ఒక విత్తనం వేస్తే మొక్క వచ్చి కొన్ని వందల గింజలనిస్తోంది. ఒక ఆవుని పెంచితే ఎన్నో ఆవులు, ఎద్దులు మనకు లభిస్తున్నాయి. ఈ విధంగా వాటికవిగా పెరుగుతున్నవి దైవ సంపదలు. ఒక గడియారం పాతిపెడితే కుళ్ళిపోతుంది తప్ప పది గడియారాలు పుట్టవు, ఒక వంద రూపాయల నోటు పాతిపెడితే మరో పది వందరూపాయలనోట్లు పుట్టవు. ఈ విధంగా తయారు చేసినంత వరకు ఉండేవి, లేకపోతే నిలిచిపోయేవి మానవుడు తయారు చేసుకుంటున్న సంపదలు. వాటికవిగా వర్ధిల్లే దైవ సంపదలను నిరసించి, మానవ సంపదలపై బ్రతికి బట్టకట్టాలని ప్రయత్నిస్తున్న మానవుడు ఒకవేళ నోట్ల కట్టలు కూడబెట్టినా తృప్తి లేక అశాంతిలో పడి కొట్టుకుంటున్నాడు. ఎవరోదాకా ఎందుకు? మన తాత తండ్రుల నాటి కన్నా మన హయాంలో నోట్ల రద్దీ పెరిగింది. వందలా, వేలా కనబడుతున్నాయి. కాని మన తాత తండ్రులకన్నా ఎక్కువ తృప్తితో మనం బతక గల్గుతున్నామని గుండెమీద చెయ్యవేసుకుని చెప్పగలమా? వారి జీవితాలలో ఉన్న ప్రశాంతి, మన జీవితాలలో ఉన్నదని అనగలమా? ఈ

విధంగా ప్రస్తుతం మనం ఒక రకమైన అయోమయ స్థితిని సృష్టించుకొని కొట్టుమిట్టాడుతున్నాం.

వ్యక్తి : అయితే ఈ అయోమయ స్థితి తొలగిపోయే దెలా? మళ్ళీ మంచిరోజులెలా వస్తాయి?

మాష్టరుగారు : మొహమాట పడకుండా మనం పళ్ళు వంచి పని చేసిన రోజున నోట్లకట్టలపై వ్యామోహాన్ని ఇప్పటికైనా విడిచి, పాడిపంటలకు, వృత్తి విద్యలకు మన పిల్లల్ని తరలించిన రోజున వస్తాయి. ఎవడు జీవుల కవసరమైన పనిచేస్తున్నాడో, ఎవడు పనిచేయకపోతే తిండి, బట్ట, ఇల్లు మొదలైనవి ఉండవో, అలాంటి వృత్తి నిర్వాహకులకు మనం పెద్ద పీటవేసి గౌరవించ గలిగిననాడు, వాళ్ళ ఇండ్లలో వస్తుల ప్రసక్తి లేకుండా నిండుగా ఉండేలాగున మనం చూడగలిగిననాడు, దేశానికి ఈ దీనస్థితి పోతుంది. అన్నం వండి పెట్టే అమ్మను అవమానించటం లాంటిదే, అన్నాన్ని పండించిపెట్టే వ్యవసాయదారుణ్ణి అవమానించటం. ప్రజలను ప్రభుత్వం రెండు తరగతులుగా చేయాలి. జీవనాధారాలైన వ్యవసాయ, పాడి, వృత్తి విద్యలు నిర్వహిస్తున్న వారు మొదటి తరగతి క్రింద కొస్తారు. మిగిలిన వారందరు రెండవ తరగతి అవుతారు. ఈ మొదటి తరగతి వారికి మొదటి స్థానం ప్రభుత్వం ఇవ్వాలి. వారికా గౌరవం లభించిననాడు వారు చెదరిపోయి మరొకళ్ళ నాశ్రయించడం ఉండదు. ఈ సత్యాన్ని ప్రజలు, ప్రభుత్వమూ కూడా గుర్తించి, వివేకంతో ప్రవర్తిస్తే తప్ప ఇప్పుడు మనకున్న అయోమయ స్థితి తొలగదు.

వ్యక్తి : మీరన్నట్లు మనము, మన పిల్లలు ఈ ప్రయత్నాలకు పూనుకోవాలి. ఇలా పూనుకునే వాళ్లు పెరిగేకొద్దీ వెనకటి మంచి రోజులు మళ్ళా వస్తాయి. మీలాంటి వారి సారథ్యంలో మళ్ళీ ధర్మసంస్థాపన తప్పకుండా జరుగుతుంది.

మాష్టరుగారు : సత్యాన్ని గ్రహించి మీలాంటి వాళ్ళంతా కలిసి వచ్చిన రోజున ధర్మసంస్థాపన కష్టమేమీ కాదు.

వ్యక్తి : మన తండ్రుల తర్వాత నుండి దారి తప్పిన పరిస్థితి, మన పిల్లలతో దారికి వస్తుందేమో ననిపిస్తోంది.

మాస్టరుగారు : తప్పకుండా! మన పిల్లలు, మన పిల్లల పిల్లలు, మన లాగ గుడ్డిగా బ్రతకరు. ఏది మంచో, ఏదిచెడో గ్రహించి, మొహమాట పడకుండా మంచిని ఆచరించ గల వారు ఇప్పుడిప్పుడే భూమి మీదకు పిల్లలుగా దిగివస్తున్నారు. ఆ పిల్లలు మళ్ళీ చల్లని రాజ్యాన్ని రూపొందించు కోగలరు.

వ్యక్తి : ఆ రోజుకొరకు వయస్సుడిగి, ముసలినైనా వేచి చూడా లని ఉంది.

మాస్టరుగారు : అంత అక్కర లేదు. మీ శరీరంలో సత్తువ తగ్గ ముందే మీరనుకున్న రోజులు రాగలవు.

వ్యక్తి : అంతా తమ దయ.

## ధరలు తగ్గే దెప్పుడు

వ్యక్తి : మాస్టరుగారూ! ధరలు రోజు రోజుకీ ఊహించ లేనంతగ పెరిగిపోతున్నాయి. జీవించడం దుర్భరమై పోతోంది. నిత్యావసర వస్తువుల్ని కూడా సమకూర్చుకోలేక పోతున్నాం. పరిస్థితికి తట్టుకోలేక ఉద్యోగస్తులు జీతాలు పెంచమని అడుగుతున్నారు. ఏమి ప్రయోజనం? 15 రూపాయలు జీతం పెరిగితే దానికి పదింతలు ధరలు పెరుగు తున్నాయి. పోఉత్పత్తులు చూద్దామా అంటే పూర్వం కన్నా పెరిగాయే గాని తగ్గలే. ఈ విషమ స్థితి ఎలా సర్దుబాటు అవుతుంది? ఈ ధరలు అదుపులోకి ఎలా వస్తాయి?

మాస్టరుగారు : ధరలు పెరగటంవల్ల జీతాలు పెంచడం జరిగినప్పుడల్లా మళ్ళీ ధరలు పెంచడం జరుగుతోంది. ఇందులో ఏ ఒక్కటి కోరే వాళ్లు దేశభక్తి కలవాళ్ళు కాదు. ధరలు పెంచదల్చు కున్నవాళ్ళ ప్రభు

త్వాన్ని కొనడానికి ప్రయత్నం చేస్తే దీనికి పరిష్కారం లేదు. జీతం పెరగడం అన్నా, ధర పెరగడం అన్నా వ్యక్తికి తక్కువ పనిచేసి ఎక్కువ ఫలితం రాబట్టుకోవాలన్న దుర్బుద్ధి ఉండడమే దీనికి మూలం. అక్కడ వైరాగ్యం రానిదే ఇక్కడ పరిష్కారం రాదు. ఎక్కువ పనిచేసి తనకు కావలసినవి మాత్రం వాడుకునే వాళ్ళు పుట్టనిదే ఇది పరిష్కారం కాదు. కనుక రాబోయే తరందాకా దీనికి పరిష్కారం లేదు.

జీతాలు పెంచమనే వాళ్ళు ఒక వర్గం, ధరలు పెంచదల్చుకున్న వాళ్ళు ఒక వర్గం. ఇద్దరిలోనూ రెండు విధాల దుర్బుద్ధి కనుపిస్తుంది. తక్కువపనిచేస్తాను—ఎక్కువ ఫలితం కావాలి అని ఒకరు, ఎక్కువ పని చేయి—తక్కువ ఫలితం నీకు చాలు అని ఒకరు, వాదించుకోవడం ఈ రెండు వర్గాలవారి లోనూ కనుపించే దుర్బుద్ధి. ఇది తేలదు. ఒకరు సర్దుకుంటే వాళ్ళని రెండవ వర్గం వాళ్ళు తినేస్తారు. రెండుపాములు ఒకదానికొకటి మ్రింగటానికి తోకలను వేటాడుతూ గుండ్రంగా తిరుగుతూ ఉంటే ఏమి జరుగుతుందో ఈ ధరల, జీతాల పెంపకంలో కూడా అంతే జరుగుతోంది. అంటే పరిష్కారం లేదు. తరం మారితే బుద్ధి మారవచ్చు. అప్పుడు పరిష్కారం ఉంటుంది. ఈ పరిష్కారానికి మూలసూత్రం ఒక్కటే. ఐదురూపాయల పనిచేసి రెండు రూపాయలతో తృప్తిపడే వారు, ఐదురూపాయల లాభానికి అమ్మే వస్తువుని, రెండు రూపాయల లాభానికి అమ్మటంతో తృప్తి పడేవారు పుట్టుకు రావడం ఒక్కటే దీనికి పరిష్కారం. అంటే కొన్ని వేల సంవత్సరాల క్రిందట మానవుడు కనిపెట్టిన నిష్కామ కర్మ యోగం, వైరాగ్యం అనే రెండు పంచాంగాలని బూజు దులిపి శిరోధార్యం చేసుకోవాలి. కనుకనే చెప్పాను, ఇప్పటికి పరిష్కారం కాదని.

వ్యక్తి : మీరు చెప్పిన మార్గానికి అనుగుణమైన ప్రవర్తనని ఆచరణలో పెట్టుకోవడానికి ప్రయత్నిస్తాం. ఇలా ఒక్కొక్కరు ఈ సత్యంలోనికి మేలుకోవడం ప్రారంభిస్తే మీరన్నట్లు వచ్చేతరం నాటికైనా పరిస్థితి కుదుట పడటానికి అవకాశం ఉంటుంది. మీరన్నట్లు వేటాడు కుంటున్న

పాముల కథలాగానే ఉన్నది ఇప్పటి సమాజస్థితి. మీలాంటి వారి సారథ్యంలో జాతి ఈ పీడకల నుండి మేలుకోవాలని కోరుకుంటున్నాను. మనిషి! డబ్బు ముఖ్యం అనుకుంటున్న స్థితినుండి డబ్బుకన్న మనిషికి ఎదు మనిషి ముఖ్యం అన్న మానవత్వం లోనికి జాతి మేలుకుంటే తప్ప ఇలాంటి సమస్యలకు పరిష్కార ముండదు.

## కులాలు ఉండటం మంచిదా?

వ్యక్తి : మాస్టరుగారూ! కులాలు ఎప్పటినుండో ఉన్నా ఈ మధ్య కాలంలో కులద్వేషాలు, కులతత్వాలను రూపు మాపాలనే నినాదాలు ఎక్కువవుతున్నాయి. అసలు ఈ కులాలు ఉండటం మంచిదా? లేక పోవ డం మంచిదా?

మాస్టరుగారు : కులతత్వాలు వేరు, కులాలు వేరు. కులతత్వాలు రాజకీయ వాదుల మనస్సులలో పుట్టినవి. కులాలు వృత్తులకు సమప యంగా మానవ ప్రకృతి ననుసరించి పుట్టినవి. అయితే ఇతర దేశాలలో కులాలు లేవు గదా అనవచ్చు. అది సత్యం కాదు. సంఘంలో విభాగ అన్ని దేశాలలోనూ ఉన్నది. ఆయా భాషలను బట్టి పేరు మాత్రం మా తుంది. ఒక్కొక్క వృత్తి చేసేవారు ఈ రోజుల్లో యూనియన్లు ఏర్పాటు చేసుకుంటున్నారు. అవి ఎలా ఏర్పడుతున్నాయి? ఫలానా ప చేసేవారంతా ఏకం కావాలని, వర్ధిల్లాలని కోరడమంటే కొత్తగా కులాల ఏర్పాటు చేసుకోవడమే కదా. అలాగే ఛాంబర్ ఆఫ్ కామర్స్ (Chamber of commerce), వీవర్స్ అసోసియేషన్, మొదలైన పేర్లు కులాలనే కొత్త పేర్లతో సూచిస్తాయి. కాకపోతే కులాల విభాగంలో ఉన్న సదుపాయం, సౌకర్యం వీటికి లేవు. ఒక గుంపువాళ్ళంతా వాళ్ళలో వాళ్ళే ఇచ్చి పుచ్చుకోవడాలు, వివాహాలు చేసుకున్నందువల్ల సదుపాయమేగాని, నష్టమేమీ లేదు. ఆహారాది వైఖరులు, దినచర్య, మరీ విభిన్నంగా ఉంటే, వివాహితులు సర్దుబాటు చేసుకునే టప్పటికి చాలారోజులు పడుతుంది.

తొందరపాటు ఉంటే ఈ సర్దుబాటు జరిగే లోపుననే విడాకులుకూడా జరుగుతున్నాయి. దాంపత్య సౌభాగ్యానికి ఏకాంతపుగది కావాలనుకోవడం ఎంత సహజమో, ఒక వృత్తి వాళ్ళంతా ఒక కులంగా ఏర్పడి, స్వేచ్ఛ, నిర్వృతి, అనుభవిద్దాం అనుకోవడం అంతే సహజం. అంతమాత్రాన మిగతా కులాలని ద్వేషించాలని ఎక్కడా లేదు. ద్వేషం దుష్టుడికి సంబంధించినది కాని, కులానికి సంబంధించినది కాదు. అన్ని కులాల్లోనూ మంచి వాళ్ళున్నారు గదా! కులాలవల్ల ద్వేషాలు పుడతాయనడం ఆ చెప్పేవాళ్ళకే నమ్మకం ఉన్నమాట కాదు. ఆ నమ్మకమే ఉంటే వాళ్ళన్ని రాజకీయ పార్టీ లెందుకు పెట్టుకుంటారు? మరొక రహస్యం, కులాలుండకూడదనే వాళ్లంతా తమ కులం వాళ్లకి ఉద్యోగాలిచ్చుకుంటున్నారుగదా! దాని అర్థమేమిటి? మనస్సులో కులాలుండాలని నమ్ముతూ, పైకి ఉండకూడదని అరుస్తున్నారన్న మాట! పైగా కులాల పేర వివిధ లాభాలు పొందుతూ ఉన్న వాళ్లు తమ కులం ఎప్పుడూ లేకుండా చేసుకోరు. ఏ కులంలో నైనా మంచివాళ్లు, విశాల హృదయం గలవాళ్లు, తమ కుల సంప్రదాయాల్ని గౌరవించుకుంటూనే ఇతర కులాల వాళ్లకి సహాయం చేస్తున్నారు. పేదవాడి భార్యకి కూడా పండగకు చీర కొని పెట్టడం భావ్యంగాని, తన భార్యను ఇతరుడికిచ్చి పెళ్ళి చేయడం విశాల హృదయం కాదుగదా! ఎవరన్నా అలా చేయాలని నినాదాలు చేశాడంటే వాడికింకా పెళ్ళి కాలేదనో, వాడి భార్య వాడికి పనికిరావడంలేదనో అర్థం చేసుకోవాలి. కులాలు వదిలిపెట్టమనడం కూడా అలాంటిదే. ఒక డిల్లు కట్టుకొని తన కుటుంబంతో ఉంటూ ఉంటే ఆ ఇల్లు నీకే ఎందుకుండాలి? మే మంతా ఉండవచ్చుగదా అనరాదు. అలా అన్నట్లయితే ఎవరికీ ఉండటానికి వీలు లేకుండా పోతుంది. అలాగే కులాల సంగతికూడా! ఒక కులంవాళ్ళు- ఇంకొక కులంవాళ్ళని పెళ్ళి చేసుకుంటేనో, ఎంగిలి తింటేనో, విశాల హృదయం కలుగుతుందని వాదించడం ఆత్మవంచన. ఇంకొక కులంలోని పేద పిల్లకు సహాయం చేయడం ఇష్టంలేని

వాడు కూడా ఆ పిల్లను పెళ్ళిచేసుకుంటాననవచ్చు. తనవాళ్ళు కాకపోయినా సహాయం చేయగలగడంలో ఉండే విశాలత్వం వేరు. తన వాళ్ళుగా చేసుకుందామనే స్వార్థబుద్ధి వేరు. తన చెంబు కాకపోయినా ఎవుటి వాడికి తోమిపెట్టినవాడు ధర్మాత్ముడు. అది తనకిస్తే తోముకుంటానన్న వాణ్ణి వమ్మటానికి వీల్లేదు.

ఇక ఇతర దేశాలలో కులాలసంగతి చూడు, అమెరికాలో తెల్లవాడు, నల్లవాడు భస్తే కలవరు. ఫ్రాన్సులో వంటవాడు, వడ్డనచేసి వాటుకు వెళ్ళితలుపేసుకుంటేనే గాని పెద్దకుటుంబాల వాళ్ళు భోంచేయరు. అంతస్తు తేడా ఉన్నవాణ్ణి తెల్లవాళ్ళు భోజనానికి పిలవరు. బెల్జియంలో ఫ్రెంచిభాష మాట్లాడే వాళ్ళూ, ఫ్లెమిష్ భాష మాట్లాడేవాళ్ళూ కలిసి భోంచేయరు. ఆర్థిక సామ్యం లేని వాళ్ళ మధ్య వివాహాలు జరుగవు. ఇలాంటి విభేదాలు ఉండకూడదుగాని, పరస్పరం సహకరించే కులాలుండవచ్చు. కులాల్ని నిందించడానికి కారణం ఒక కులం మీద ఉండే ద్వేషమేగాని విశాల భావం కాదు.

వ్యక్తి: చాలా చక్కగా వివరించారు మాస్టారూ మీరు. మీ రన్నట్లు ద్వేషానికి దుష్టత్వం కారణం గాని కుల మెలా కారణం అవుతుంది? ఎక్కువ తక్కువలు కూడా మానవుల మనస్సుల్లో పుట్టే విషవృక్షాలు గాని కులాలకు సంబంధించినవి కావు. మనిషి తాను సరిగ్గా ఉన్నప్పుడు అన్నీ సరిగ్గానే ఉంటాయి. తాను చెడిపోయినపుడు అన్నిటినీ చెడగొట్టుకుంటాడు. మీరు వివరించి చెబుతుంటే నాకు బోధపడిందేమిటంటే మనం మనుష్యుల్లో నైతిక విలువలు పెంచడానికి కృషి చేయాలిగాని, అక్కర్లేని, అర్థంలేని వివాదాలు చేయకూడదు అని.

మాస్టరుగారు: మంచో, చెడో ఉన్నది మనిషిలోనే గమటోయ్! వీడి మనస్సనే ఉపకరణానికి (Instrument) కి జీరో యెర్రర్ కట్టు

కోవడం చేతనైతే సమస్యలే ఉండవు. అది చేతకానప్పుడే నినాదాలు పెరుగుతాయి.

## సెక్యులరిజం అంటే ?

వ్యక్తి : మాస్టరుగారూ ! సెక్యులరిజం పేరిట ఎన్నో నినాదాలు, ప్రవచనాలు జరుగుతున్నాయి. ఇంతకీ సెక్యులరిజం అంటే ఈ నినాదాలు చేసే వాళ్లెవరికీ సరిగ్గా తెలుసునని చెప్పలేం. మతాలు లేకపోవడమే, మత సిద్ధాంతాలను, ఉపదేశాలను పట్టించుకోక పోవడమే సెక్యులరిజం అని కొంత మంది నమ్ముతున్నారు. దానితో పిల్లలకు, యువకులకు, ధార్మిక మైన క్రమశిక్షణను పరిపాలకు లివ్వలేక పోతున్నారు. ఈ శిక్షణ లేక పోవటంవల్ల నీతి నియమాలు తగ్గి జనం దారితప్పుతున్నారు. నిజమైన సెక్యులరిజం అంటే ఏమిటో మీరు కొంచెం వివరించి చెప్పాలి.?

మాస్టరుగారు : సెక్యులరిజం అంటే మతానికి అతీతమని అర్థం గాని, మతరహితమని అర్థం కాదు. మత ప్రభుత్వాలు ఉన్న దేశాలు, మతాలు కారణంగా పట్టపగలు వేలమందిని హత్యచేసుకుంటూ ఉన్న దేశాలు ప్రచండంగా విజృంభిస్తూ ఉన్న ఈ అనాగరికపు శతాబ్దంలో క్రమశిక్షణకు సహాయం చేసే మత సంప్రదాయాలు ఉండటం వల్ల మేలే చేకూరుతుంది గాని, తలవంపు ఏమీ ఉండదు. "మా జాతి ఈ మతానికి సంబంధించినది" అని ప్రకటన చేయడానికి క్రైస్తవ దేశాలుగాని, మహమ్మదీయ దేశాలు గాని, ఏమీ సిగ్గుపడటంలేదు. ఇతర మతాల వాళ్ళకి స్వేచ్ఛ నిస్తున్నది, భారత దేశం ఒక్కటేనన్న సత్యం ఎవడూ కాదనలేడు, అలాంటప్పుడు ఇతర మతాల వాళ్ళుగాని, స్వలాభం కోసం వాళ్ళని ఆకట్టుకునేందుకు భజన చేసే వాళ్ళుగాని, దుండగం చేసినా విభేదాలు కల్పించడానికి చూచినా సహించనక్కరలేదు. సహిస్తే మనది మతాతీత సామ్రాజ్యం కాదు. ఎవరి

హద్దులలో వాళ్లుండటం సెక్యులరిజం అవుతుంది. అంతేకాని జాతీయతను సమన్వయ పరచి ఐక్యభావం పెంపొందించడానికి ప్రభుత్వం కూడ ఒక మతానికి సంబంధించి ఉండడంలో తప్పులేదని అనేక దేశాల ప్రశాంత ప్రభుత్వాలను చూస్తే స్పష్టపడుతుంది. ఇంతకూ మతం అనేది మానవుని క్రమశిక్షణకు, ఆత్మ వికాసానికి తోడ్పడే శిక్షణాలయం, ఈ విషయం హిందూమతానికి సంబంధించినంత వరకూ మిగిలిన వాటికన్న ఎక్కువ సత్యం. ఎందుకంటే ఈ మతం ఒకే ప్రవక్తనుగాని, ఒకే అవతార మూర్తిని గాని మాత్రమే అనుసరించాలని ఎన్నడూ శాసించలేదు.

ఇంతకీ భారతదేశంలో ఉన్న జాతీయమైన పునాది హిందూమతం కూడా కాదు. సనాతన ధర్మం దీని పునాది. అది ఏ ఒక్క మతమూకాదు, కనుకనే వేదాలలో- ఉపనిషత్తులలో, పురాణాల్లో, ధర్మశాస్త్రాల్లో 'మత' మనే వ్యవస్థ ఎక్కడా ఉన్నట్లు ఎవరూ చూపలేరు హిందూమతం కూడా ఈ పుస్తకాలలో ఎక్కడా కనపడదు. ఇక మిగతా మతాల సంగతి సోది లోకి కూడా రాదు. తృప్తికోసం ఎవరెన్ని మతాలు పెట్టుకున్నా, ఎంత మంది నూతన మత స్థాపకులు దిగివచ్చినా, అందులో మంచి అనేది ఉన్నంత వరకు సనాతన ధర్మంలో ఒక భాగమే అవుతుంది. మానవుడు ఎలా నడుచుకొని ఇహపరాలు సుఖవంతం చేసుకోవాలో చెప్పేది సనాతన ధర్మం, అందులో ఎంతమంది అవతార మూర్తులు దిగివచ్చినా వారిని ప్రత్యేక మతకర్తలుగా చిత్రించినవారు ఆ మార్గంనుండి తమ మార్గాన్ని సంకోచపరచుకోక తప్పదు. సనాతన ధర్మాన్ని సంస్థాపించినవారు అవతార పురుషులు, ప్రవక్తలు, దేవుని పుత్రులు అవుతారు. వారిలో ఒకడి పేర చెల్లేది మతం అవుతుంది. కనుక ఏ మతమూ సనాతన ధర్మం మాత్రం కాలేదు. భారత దేశానికి సహస్రాబ్దాలుగా వెన్నెముక వంటిది ఈ సనాతన ధర్మం. కనుక అది ఒక్కటే నిజమైన సెక్యులరిజం.

వ్యక్తి: చాలా స్పష్టంగా బోధపడింది. మాస్టారూ! అవతార మూర్తు లందరూ సనాతన ధర్మాన్ని సంస్థాపన చేస్తూంటే మానవులు వ్యామోహంలో పడి సనాతన ధర్మాన్నుండి తప్పుకొని ఆ మూర్తుల పేర మతాలు మాత్రం మిగుల్చు కుంటున్నారన్న మాట. ఈ సత్యాన్ని తెలిసి సనాతన ధర్మానికి మనని మనం సమర్పణ చేసుకున్న నాడు అవతార మూర్తులందరి లోను మనకు ఒకే వెలుగు దర్శన మిస్తుంది. ప్రజలచేత సనాతన ధర్మాన్ని పలింబింప చేసి అవతారమూర్తు లందరిలోనూ ఒకే వెలుగును అనుభవింప చేసిన పరిపాలకులే సెక్యులరిజాన్ని పాటించిన వారవుతారు.



# మహానుభావుల మర్మాలు

## మహిమలు చేయడమెందుకు ?

వ్యక్తి: మాస్టరుగారూ! అన్నీ బాగున్నాయి కాని, సత్యసాయిబాబా గారు మిరకిల్స్ చేయటమే నాకు నచ్చలేదు. మిరకిల్స్ చేయకుండా ఆయన నిర్వహిస్తున్న మిగతా మంచి పనులనే పెంచుకున్నట్లైతే ఆయన మీద ఇన్ని దుష్ప్రచారాలు ఉండేవి కాదేమో అన్పిస్తోంది.

మాస్టరుగారు : మహానుభావులు భూమికి దిగివచ్చినప్పుడు తగిన రీతిలో వాళ్ళ వాళ్ళ ప్రణాళికను నిర్ణయించు కుంటూ ఉంటారు. బాబాగారి ప్రణాళికలో మిరకిల్స్‌కు కూడా స్థాన మిచ్చారాయన. మిరకిల్స్ రెండు రకాలు. 1. సాధించుకుంటే వచ్చేవి. ఇవి క్షుద్రవిద్యా ఉపాసనల వల్ల సిద్ధి స్తాయి. 2. వాటంతటవి వరించేవి. పరిణామ క్రమంలో ఉత్తమ మగు స్థితిని పొందిన కొద్దీ సూర్యుని నుండి కిరణాలు వ్యక్తమైనట్లు ఇవి అప్ర యత్నంగా వ్యక్తమవు తుంటాయి. సామాన్యులకు అది మహిమ కాని వారి కది సహజం. తనని సహజంగా వరించిన మహిమలను సద్వినియోగ పరుస్తూ బాబాగారు జనాన్ని ఆకర్షించి ధర్మ మార్గంలో పెడుతున్నారు. ఏడు స్తున్న పిల్లవాణ్ని గిలక్కా యిచ్చి మరిపించినట్లు అశాంతిలో పడి కొట్టు కుంటున్న జనాన్ని తమ మహిమలతో మరిపించి నిజస్థితిలోకి నడిపిస్తున్నా డాయన. ఫలానా పని మంచిదా చెడ్డదా అనేది, అది ఎందుకు చేస్తున్నా మన్న దానిమీద ఆధారపడి ఉంటుంది.గారడీవాడూ చేస్తున్నాడు మహిమలు. రూపాయలు సృష్టించి మురిపించి, కాసీలు అడుక్కుంటున్నాడు. మరి కొందరు వస్తువుల్ని సృష్టించి ఇచ్చి, తమను దివ్యాంశ సంభూతులుగా గుర్తించమని అడుక్కుంటున్నారు. కాని బాబాగారు మానవులను ఉద్ధరించ డానికి మాత్రమే మహిమలను ఉపకరణాలుగా ఉపయోగిస్తున్నారు. అందు

పల్లనే ఇక్కడికి రానక్కర్లేదు. ఇళ్ళ దగ్గరే ఉండి ధ్యానం చేసుకోండని ఆయన ఎన్నిసార్లు చెప్పినా జనం ఆయన దగ్గరకు వెళ్ళకుండా ఉండలేక పోతున్నారు. తల్లి కాఫీ ఇస్తోంది. హోటల్‌వాడూ కాఫీ ఇస్తున్నాడు. మనతో పని ఉండి మనల్ని కాకాపట్టే వాడు మరింత మంచి కాఫీ ఇస్తు న్నాడు. మూడూ కాఫీలే. మూడిటి విలువ మాత్రం ఒకటికాదనేది స్పష్టమే కదా! మహిమల విషయంలో కూడా అంతే. ఏ పని ఎవరికి చేసినా ఆ పని చేయడంవల్ల ఎవటి వారి నుండి ఏమైనా కోరితే అది వ్యాపారం అవు తుంది. ఏమీ కోరకుండా ఎవరికి ఏ పని చేసినా అది పరానికి బాట అవు తుంది. మన నుండి ఏమీ ఆశించకుండా మన కొరకు పని చేస్తున్నవారే మహానుభావులు, దైవ స్వరూపులు.

## అంత వైభోగమా!

వ్యక్తి : మిగతావన్నీ బాగానే ఉన్నాయి. కాని మాస్టారూ బాబాగారు భోగాలతో తులతూగటమే నాకు నచ్చలేదు. నిరాడంబరంగా ఉండవచ్చు కదా! అవతార పురుషుడన్న వాడు ఉండవలసిన తీరేనా అది?

మాస్టరుగారు : అవతార పురుషులు భోగాలు అనుభవించకూడదా! ఆ లెక్కకొస్తే శ్రీకృష్ణుడు ఇంతకన్నా భోగంగా బ్రతికాడు. మరి అతనికి దణ్ణం పెట్టటం మానేశామా? మీరు చెప్పింది మీకు వచ్చిన పద్ధతి. ఆయ నుంటున్నదీ ఆయనకు నచ్చిన పద్ధతి. మన ఐడియాలకు తగ్గట్లు మహాను భావులు నడుచుకోవాలను కోవడం అహంకార పడటం అవుతుందా? ఆరాధించడం అవుతుందా?

## ధనధాన్యాలు సృష్టించవచ్చుగా?

వ్యక్తి మాస్టరుగారూ! ఈ బాబాలు, మాతృశ్రీలు, ఆశీస్సులు, ఉప న్యాసాలు, మహిమలు చూపకపోతే దారిద్ర్యంతో బాధ పడుతున్న మన దేశ ప్రజ అందరకు తమ మహిమలతో ధనధాన్యాలను సృష్టించి ఇచ్చి వాళ్ళ బాధలు తీర్చవచ్చుకదా!

మాస్టరుగారు : మీరన్న తీరులో మనకు విదేశాల నుండి అపకారం ఎలాగూ జరుగుతూనే ఉంది. ఇంకా వీళ్ళను కూడా ఇరికించడం ఎందుకు? విదేశాలనుండి పాలపొడి, గోధుమలు మొదలైనవి మన దేశానికి దిగుమతి అవుతుంటే మనవాళ్ళు పండించటం మాని ఓడలపైపు చూస్తూ కూరొ వడం చూస్తున్నాంకదా! మీరు అడిగారు కాబట్టి ఉన్న నిజం చెబుతా: వినండి. నేను ప్రతి సంవత్సరం ప్రపంచాన్ని చుట్టి వస్తున్నాను. కా ప్రకృతి వనరుల విషయంలో మన దేశంలాటి దేశం నాకు ఎక్కడా క పడలేదు. అప్పుడు ఆలోచించాను. మన దేశం ఎందుకింత దారిద్ర్య స్థితిలో ఉన్నదీ అని? నాకు వచ్చిన సమాధాన మేమిటంటే దేశం దారిద్ర్య దేశంకాదు. దేశంలో ఉన్న మనం మన సోమరితనం వల్ల, అవివేకంవల్ల, దారిద్ర్య స్థితిలో ఉన్నాం అని. మన దేశంలో ఎక్కువమంది పళ్ళువంచి పనిచేయడానికి ఇష్టపడక పోవడం వల్ల, కొద్ది మంది కష్టించి పండించిన ఆహార పదార్థాలు అవివేకంతో ఇతర దేశాలకు ఎగుమతి చేస్తూఉండటం వల్ల, మన దేశానికీ దీనస్థితి వచ్చింది. ఇలాంటి స్థితిలో ధనధాన్యాల సృష్టించి పొయ్యడం జాతికి విషం పెట్టడంతో సమానం. పళ్ళువం: ఎవరి పనులు వాళ్ల క్రమశిక్షణతో చేసేట్లు చూడటమే ఇప్పుడుజరగవలసిన ధర్మ సంస్థాపన, ధర్మ సంస్థాపన అంటే అదే. ఎవడి ధర్మాన్ని వాడు తు. చ. తప్పకుండా ఆచరించేటట్లు చూడటం.

## నిజంగా అవతార పురుషుడేనా?

వ్యక్తి : మాస్టారూ! బాబాగారు నిజంగా అవతార పురుషుడే నంటారా ?

మాస్టరుగారు : ఆ అనుమానం ఎందుకు వచ్చింది ?

వ్యక్తి : ఆయన గొప్పవాడే నేను కాదనను. కాని సాక్షాత్తు దేవుడే నని ఆయనని పూజించటం కొంచెం విడ్డూరంగా ఉంటుంది.

మాస్టరుగారు : ఆయన మాటలు మీరు విన్నారనుకుంటాను. మీరు దేవుడేనా అని అడిగితే ఆయన ఏం చెబుతారో తెలుసా? "నేను దేవుణ్ణి.

ఆ సంగతి నాకు తెలుసు. నీవూ దేవుడివే. ఆ సంగతి నీకు తెలియదు. అదీ తెలియచెప్పడానికే వచ్చాను." ఆ మాటలు కొంచెం మంత్రాలలాగ ఉంటాయి. మననం చెయ్యగా చెయ్యగా తప్ప బోధపడవు.

## ఏమిటా అవతార పురుషుని లక్షణం ?

వ్యక్తి : ఎందుకు మాస్టారూ! అవతారపురుషుడు, అవతార పురుషుడని బాబా వెనకాల పిచ్చెక్కినట్లు పడుతున్నారు జనం. ఇంతకూ అతనిలో వున్న అవతార పురుషుని లక్షణం ఏమిటి ?

మాస్టరుగారు : మానవులందరికీ కావలసిందీ, మామూలుమనుషులు చేయలేకపోతున్నది చేసి చూపడమే అవతార పురుషుల లక్షణం. అందరూ పిల్లలను ఎలా పెంచాలో తెలియక కాన్వెంట్లపాలు చేసి కాలక్షేపం చేస్తున్న రోజులలో ఊరూరా బాలవికాస్‌లు పెట్టి ఆయన పిల్లలను తీర్చిదిద్దే బాధ్యత చేపట్టారు. వయసులో ఉన్న కుఱ్ఱవాళ్ళు ఎంతెంత వెఱ్ఱి వేషాలు వేస్తున్నారో మనం చూస్తున్నాం కదా! మన కాలేజీలన్నీ ఎంత చక్కగా వుంటున్నాయో మనకు తెలుసుకదా! మరి ఆయన కాలేజీలు పెట్టి కుఱ్ఱ వాళ్లని చేర్చుకొని ప్రొద్దున్న సాయంత్రం ప్రార్థన, సంకీర్తన, నీతి, నియమం, నిష్ఠ, కావలసిన విద్య, అన్నీ నేర్పిస్తున్నారు. మరి ఇదిఅందరూ చేయగలిగారా? మనం ఎవరైతే ధనవంతులనీ, మోతుబరులనీ అనుకుంటున్నామో వాళ్ళందరూ తెల్లవారుఝామునవే లేచి, స్నానాలు చేసి కాలినడకన ఊరంతా నగర సంకీర్తన చేయటం మనం చూస్తున్నాం కదా! ఇలాగ మానవులందరికీ కావలసినవీ, మానవులందరూ చేసుకోలేక పోతున్నవీ జరిగేటట్లుగా చూసేవారే అవతార పురుషులనబడతారు. ప్రజలకు, నాయకులకు, ప్రభుత్వాలకు నిర్వహించడం సాధ్యం కాని పనులను నిర్వహించి చూపిస్తున్నవారు అవతార పురుషులు కాక మరేమౌతారు?

## రమణ మహర్షికి క్యాన్సరు రావడమా ?

వ్యక్తి : మాస్టరుగారూ! రమణ మహర్షికి క్యాన్సరు వ్యాధి వచ్చిందంటారు గదా! అంతటి అవతార పురుషుడికి క్యాన్సరు వ్యాధి రావడంలో అర్థం ఏమిటండీ?

మాస్టరుగారు : రమణ మహర్షికే కాదు, రామకృష్ణ పరమహంసకి కూడా క్యాన్సరు వ్యాధి వచ్చింది. దీనికి కారణాలు రెండు విధాలు.

1. ఆ మహానుభావులు చేసే సాధనలో పూర్వకర్మ ఫలితాలను రహితం చేసుకొనే వ్యామోహం లేకుండా కర్మనాశం చేసుకోవడం. అప్పుడు కర్మ బంధం తెగిన తరువాత కూడా పూర్వం చేసిన కర్మల ఫలితాలు అయిపోయే వరకూ వర్తిస్తూనే ఉంటాయి. అప్పులు చేయటం మానుకున్న వాడికి కూడా వెనుకటి అప్పులకి సమాధానం చెప్పడం తప్పదు. దేహాన్ని గూర్చి పూర్వకర్మ విషయంలో పట్టించుకోని వాళ్ళకి ఇలాంటివి వస్తాయి. పట్టించుకొన్నవాళ్ళు పట్టుబట్టి దీన్ని కూడా రహితం చేసుకోవచ్చు. వాళ్ళకిలాంటివి రావు. దేహానికి వ్యాధి వస్తే నష్టమేమిటని రమణ మహర్షి లాంటి వాళ్ళ మతం.

2. ఇలాంటి మహానుభావులకి కర్మబంధంతో ఏమీ ప్రమేయం లేకపోయినప్పటికీ నరజాతి యొక్క సామూహిక దుష్కర్మ ఫలాలు వీళ్ళ దేహాలమీదుగా పోతాయి. అలాంటప్పుడు ఫలితం ఎప్పుడూ క్యాన్సరు వ్యాధే.

వ్యక్తి: సామూహిక దుష్కర్మఫలం ఏ మహానుభావుడి మీదుగా పోయినా అప్పుడు ఆ మహానుభావుడికి క్యాన్సరు వ్యాధే వస్తుందా మాస్టారూ!

మాస్టరుగారు : అవును తప్పకుండా క్యాన్సరు వ్యాధే వస్తుంది. "ఈసోటిరిక్ హీలింగ్" అనే పవిత్రగ్రంథంలో జ్వాల్‌కూల్ మహర్షి ఈ విషయాన్ని వివరించారు చూడు.

## ఆశ్రమంలో శిష్యుల కోపతాపాలు

వ్యక్తి : మాస్టరుగారూ! రమణ మహర్షి ఆశ్రమంలో ఆయన వున్న రోజులలోనే ఆ ఆశ్రమంలో ఉండే శిష్యులు చాలామంది ఎంతో ఘోరంగా ప్రవర్తించేవారుట. కథలు కథలుగా చెపుతూ ఉంటారు ఆ శిష్యుల దుండగాలను గూర్చి. తన కళ్లముందే అవన్నీ జరుగుతున్నప్పుడు

రమణమహర్షి చూస్తూ ఉపేక్షించడం ఎందుకు మాస్టారూ? పూనుకొని వాళ్ళను క్రమశిక్షణలో నిడిపించవచ్చు గదా! మరి రమణ మహర్షి ఎందుకలా చేయలేదు?

మాస్టరుగారు : రమణ మహర్షి అయినా, రాముడైనా, కృష్ణుడైనా తమ భక్తులకు అవతార పురుషులే గాని, ఆశ్రమంలో ఉన్నవాళ్లకి కాకపోవచ్చు. కృష్ణుడితో పాటు ద్వారకలో వున్న యాదవుల గతి ఎలాంటిదో రమణ మహర్షితో పాటు ఆశ్రమంలో వున్న చాలామంది గతి కూడ అలాంటిదే ఆశ్రమంలో చేరేవాళ్లల్లో అందరూ అవతారమూర్తి కోసం చేరరు. ముద్దకోసం చేరేవారి దగ్గరనుండి ఆశ్రమంపై అధికారం కోసం చేరేవాళ్ళదాకా ముష్టివాళ్ళు ఉంటూనే ఉంటారు. అవతార మూర్తులకి ఆశ్రమం సృష్టిలో ఒక భాగమే కాని ప్రత్యేకత ఏమీ లేదు. అందుకే ఒక్కొక్కప్పుడు అకస్మాత్తుగా ఆశ్రమాన్ని, శిష్యుల్ని విడిచి ఇంకొకచోటికి వెళ్ళిపోయిన వాళ్లు కూడా వున్నారు. పిల్లి పిల్లల్ని మార్చినట్లు శ్రీకృష్ణుడు వ్రేపల్లె నుండి బృందావనానికీ, అక్కడి నుండి మధురకూ అక్కడినుండి ద్వారకకూ మకాం మార్చాడు. అలాంటి వాళ్ళకు జీవిత కాలంలో చేయదల్చుకున్న పని ముఖ్యం గాని, తనవెంట ఉన్నవాళ్ళకోసం తాపత్రయం ముఖ్యం కాదు. వాళ్ళకి ఉండేది తాపత్రయం కాదు ప్రేమ. దానికందరూ ఒక్కటే. వాళ్ళ వాళ్ళ అర్హతను బట్టి ఆ ప్రేమపొందుతారు. ఆశ్రమంలో శిష్యుల్ని సర్దటం మొదలుపెడితే రమణ మహర్షికి కూడా ఒక బోర్డింగ్ లాడ్జింగ్ హోటల్‌వాడికి పట్టిన గతే పడుతుంది. హోటల్ వాడు చేసినంత సంరక్షణ ఎవ్వడూ చెయ్యడుగదా! వాడికి నీ మీద వ్యామోహం ఎందుకంటే నీవల్ల వాడు సుఖసంతోషాలు పొందుతున్నాడు. వాడి జీవితం నీమీద ఆధారపడి వుంది. రమణమహర్షి జీవితం ఆశ్రమంలో శిష్యులమీద ఆధారపడి లేదు. అంతర్యామి మీద ఆధారపడి వుంది. తనకు వున్నది నీకిస్తాడు గాని, నిన్ను తీసుకోమని బలవంత పెట్టడు.

వ్యక్తి : బోధపడింది మాస్టారూ! కనువిప్పు కలిగింది. మహానుభావుల జీవనసరళి దర్శనమిచ్చింది.

## అరవిందుడు సాధించిన దేమిటి ?

వ్యక్తి : మాస్టరుగారూ! అరవిందయోగి స్వాతంత్ర్య సమరంలో దీక్షతో పనిచేస్తూ మధ్యలో అంతర్వాణి ప్రబోధం వలన తపస్సుకి తరలి వెళ్ళిపోయాడుగదా! అలా వెళ్ళిపోవడం వలన ఆయన ప్రత్యేకంగా సాధించిందేమిటని కొందరు ప్రశ్నిస్తూ ఉంటారు. అసలేం జరిగిందో, ఎందుకు జరిగిందో? మీరు చెప్పాలి.

మాస్టరుగారు : బాహ్య ప్రపంచంలో ఎవడైనా చేయగల మంచి పని చాలా పరిమితంగా సాగుతుంది. ఆ పరిమితిని మించి ఏ మహాత్ముడూ భౌతిక కక్ష్యలో చేయలేడు. ఎంత మంచి వైద్యుడైనా భూమిమీద అందరికీ మందులీయలేడు. ఇది భౌతికంలోని పరిమితత్వం. దీన్ని తెలిసిన వారు కొందరు తమవంటి వాళ్లు కొన్ని వందలమంది చేత అదే పని వారి రంగాలలో చేయించడం నేర్చుకుంటారు. దానికి ప్రజా బాహుళ్యంలోని కొందరి మనస్సులను ఆకర్షించి నడిపించటం కావాలి. దానికోసం వారు తపస్సుచేసి తమ మనస్సును ఇతరుల మనస్సులలోనికి వ్యాపింప చేస్తారు. అది వాళ్ళ వాళ్ళ స్వంత సంకల్పంలాగా పనిచేస్తూ ఉంటుంది. అలా చేయడానికి ఒక శక్తివంతమైన, ప్రశాంతమైన ప్రత్యేక స్థానం అవసరం. వాళ్లు ఆ ప్రదేశాన్ని కనిపెట్టి అక్కడ స్థిరపడి అక్కడి నుండి పని ప్రారంభిస్తారు. భారతదేశ స్వాతంత్ర్యం కోసం ప్రయత్నించిన వారందరి మీద ఇలాంటి ప్రభావం అరవిందుడికి ఉన్నది. అది కొంత అతని పనులద్వారా, మరికొంత అతని రచనల ద్వారా, ఇక మిగిలిన భాగం తపస్సు ద్వారా సాధించబడ్డది. ఇది జరిగింది అనడానికి ఒక్కటే నిదర్శనం, తన జన్మదినంనాడు భారత దేశానికి స్వాతంత్ర్యం రప్పిస్తానని అతడు ఎంతో ముందుగా చాటి చెప్పాడు అది అలాగే జరిగింది.

మరొక విషయం అవతారమూర్తులు, కారణ జన్ములు, తాము దేని కోసం జన్మించారో తెలుసుకొని దానినిబట్టి మెలుగుతారు గాని ఇతరులు సాధిస్తున్న మార్గాన్నే తాము సాధించాలని అనుకోరు. ఒక జాతికి సంబంధించిన కార్యసాధన మార్గాలు కొన్నివేలుంటాయి. అందులో ఒక్కొక్కడు

ఒక్కొక్క పని చేస్తాడు. ఒకడు చేసింది ఇంకొకడు చేయటానికి తయారు కాకూడదు. మన మందరం కలిసి గురుపూజలు చేస్తున్నామంటే ఏమిటి అర్థం? ఉపన్యాసాలు ఇచ్చేవాళ్ళు వేరు, వంటశాలలో వండేవారు వేరు, భోజనాలు వడ్డించేవారు వేరు, ప్రయాణ సౌకర్యాలు చేసేవాళ్ళు వేరు. వీళ్ళల్లో ఒకళ్ళు చేసేపని వదిలిపెట్టి ఇంకొక పనికి పోతే ఏమౌతుంది? వంటశాలలో వారు గురుపూజలు మూడురోజులు మనకు కనిపించలేదంటే వారేమీ చేయలేదని అర్థంకాదు. వారు చేసేది కనపడదు. అలాగే జ్ఞానమయ, తపోమయ లోకాలలో చేయవలసిన వారు చేసేది భౌతికమైన లోకంలో 'హంగామా'గా కనపడదు. మొత్తానికి కార్యక్రమం జయప్రదం కావడం పెద్దలందరి సంకల్పం. ఇలాంటి కారణాల వల్లనే ముమ్మిడివరం బాలయోగిలాంటి వారు అసలే ప్రపంచానికి కనపడరు. వాళ్ళది వంటశాల, స్టోర్ రూము 'ఇన్‌ఛార్జి'

వ్యక్తి : బోధపడింది మాస్టారూ! మహానుభావులు పనిచేసే తీరు, పురిటి నొప్పులు గొడ్రాలికేమి తెలుస్తాయన్నట్లు అలాంటి వారి తత్త్వం మీ వంటివారే వివరించాలి.

## బాలయోగి-ఆహార స్వీకరణ

వ్యక్తి : మాస్టరుగారూ! ముమ్మిడివరం బాలయోగినిగూర్చి ఈ మధ్య వాదోపవాదాలు బాగా సాగుతున్నాయి. ఆయన ఆహారం తీసుకుంటాడని కొందరు, తీసుకోడని కొందరు తీసుకోకుండా ఉండడం ఎలా సాధ్యమని కొందరు, ఎవరికి తోచినట్లు వాళ్లు సిద్ధాంతాలు చేస్తున్నారు. ఆయన చూస్తే సంవత్సరానికొక్కరోజు బయట కొస్తాడు. ఆ నాడు కూడా మన స్పృహలో ఉండడు. ఏమిటి ఆయనను గూర్చిన సత్యా సత్యాలు?

మాస్టరుగారు : ముమ్మిడివరం బాలయోగి భోజనం చేయడని చెప్పేదీ, చేస్తాడని అనుమాన పడేది ఇతరులే గాని, అతనుకాదు. అతడు భోజనం చేయనని చెప్పలేదు. గనుక ఒకవేళ చేస్తూ ఉన్నా అంత పెద్ద అపచార మేమీలేదు. అన్నం తినటం బూతుపని అయితే ఈ ప్రశ్నించే సన్యాసి సరుకంతా ఎందుకు భోంచేస్తున్నారు? అతడు తిననని చెప్పలేదు.

గనుక తింటున్నా, లోకాన్ని మోసంచేసింది ఏమీలేదు. ఒకవేళ అతగాడికి భోజనమే అవసరమయితే దర్శనమిచ్చే రోజుల్లో రోజంతా ప్రజలమధ్యనే కూర్చుంటాడు. అప్పుడు భోజనంగాని, మంచినీళ్ళుగాని అవసరం రావా! కనీసం ఒకటికైనా లేవడా! ఈ ప్రశ్నించే వాళ్ళల్లో ఎవరైనా కుక్కతోక కదలకుండా ఉన్నంత సేపైనా నిశ్చలంగా ఉండగలరా? మరి అతడు కూర్చొపెట్టిన పద్ధతిలోనే రోజంతా ఉండిపోతాడు. దాన్నిబట్టే ఊహించవచ్చు తెలివి ఉంటే.

అన్నపానీయాలు లేకుండా శరీరంతో ఉండటం సాధ్యమా? అనే ప్రశ్న ప్రశ్నించే వారి విషయంలో ఎలాగూ తేలదు. సాధ్యమయినవారి విషయంలో నమ్మకం లేదు గనుక ఎలాగూ తెలుసుకోలేరు. సాధ్యమయిన పక్షంలో వారికి తేలే విధానమేమిటో వారే చెప్పవలసి వుంటుంది. సాధ్యమా? అనే ప్రశ్నకు సాధ్యమే అనటానికి అతడే నిదర్శనంగాని ప్రశ్నించేవారు కానప్పుడు అది వారికి తేలే సమస్యకాదు. ఇకపోతే ఒక సంవత్సరం తమ కెదురుగుండా అతన్ని కూర్చోమనవచ్చు. తాము ఒక సంవత్సరం అతడి కెదురుగుండా కూర్చొ గలిగినప్పుడే అది సాధ్యం అంత ఓపిక ఉన్నవాడు ఆయనను పరీక్షించ నక్కరలేదు. తానే అలా కూర్చుని చూపిస్తాడు. కాబట్టి ఇది తేలే బేరంకాదు.

వ్యక్తి : మూర్ఖులు తమనుబట్టి మహానుభావుల్ని అంచనా వేస్తూ ఉంటారు. అలా వేసినప్పుడే ఇలాంటి అర్థంలేని అనుమానాలు వస్తూ ఉంటాయి.

## అమ్మ సన్నిధిలో దొంగతనమా ?

వ్యక్తి : మాస్టరుగారూ! ఆ మధ్య జిల్లెళ్ళమూడి అమ్మగారి ఆశ్రమంలో దొంగలు వచ్చారని చెప్పుకున్నారు. సర్వజ్ఞురాలైన అమ్మసన్నిధిలో దొంగతనం ఎలా సాధ్యమయింది మాస్టారూ?

మాస్టరుగారు: జిల్లెళ్ళమూడిలోనే కాదు, రమణమహర్షి ఆశ్రమంలో కూడా దొంగలు వచ్చారు. సింహాచలం స్వామి నగలు కూడా ఎత్తుకు పోయారు. అమ్మకు సర్వజ్ఞత్వం ఉన్నదని ఆమె చెప్పలేదు. ఆమె తరపున

ఎవరూ మొహమాట పడ నక్కరలేదు. అమ్మలో ఉన్న దేవుడే, దొంగ లోనూ, వాడు పట్టుకున్న కర్రలోనూ కూడా ఉన్నాడు. దేవుడి పని దొంగల్ని కాయటం కాదు. కనువిప్పు కలిగించడం. అంతర్యామి దేవుడు అందరి లోనూ ఉంటాడు. కనువిప్పు కలిగించే సంకల్పం గల అదే దేవుడు కొందరి రూపంలో ఉంటాడు. ఎవడి పని వాడు చేస్తూ వుంటాడు. గుళ్ళో దేవుడికి, పూజారికీ యే భేదం వుందో అమ్మకి, అక్కడ చుట్టూ ఉన్న వాళ్ళకి అదే భేదం వుంది. పూజార్ల మెలకువను బట్టి దొంగతనాలో, దొరతనాలో జరుగుతూ వుంటాయి. అది వాళ్ళకి, వీళ్ళకి సంబంధించిన కర్మబంధం. దానికీ దేవుడికీ ఎలాంటి సంబంధంలేదు. మన వాళ్ళ మాడుగుల దగ్గర మిధిల నిర్మించే ప్రయత్నం పురిట్లోనే సంధికొట్టి ఎందుకు పోయింది? మొదటగా అక్కడకు వెళ్ళిన సోదరబృందంలో కొందరు ప్రవర్తింపచేసిన లీలలే గదా, దానికి కారణం. అలాగే జనసమ్మర్దంలో ఎవరి కర్మకు తగిన గుప్పెడు వారికి లభ్యమౌతుంది. ఈ ఆశ్రమాల్లో, పుణ్య క్షేత్రాల్లో జరిగే దొంగతనాలన్నీ అలాంటివే.

## ఎక్కువగా మాట్లాడదేమి?

వ్యక్తి: ఎంతో దూరం నుండి పనివేళా చూద్దామని కోరి మరీ వెళతాం గదా! ఇంతా వెళితే అమ్మ ఎక్కువగా మాట్లాడనే మాట్లాడదు. నోరారా మాట్లాడ వచ్చుగదా! అనిపిస్తుంది. ఎందుకు మాట్లాడదో తెలియదు.

మాస్టరుగారు: అమ్మను చూడటానికి నీవు వెళ్ళావుగాని, ఆమె నిన్ను రమ్మని పిలువలేదు. కనుక ఆమె ఎలా ప్రవర్తించాలో నిర్ణయించే అధికారం నీకు లేదు. ఆమె ప్రవర్తనను అర్థంచేసుకునే అవసరం నీకు కలిగితేనే మెళ్ళు. రోగి చెప్పినట్లు వైద్యుడు చేస్తే రోగం తగ్గదు. బిడ్డ కోరింది తల్లి మేపితే వాడు అజీర్ణం చేసి చస్తాడు.

అమ్మ అంటే ప్రేమ అని అర్థం. దానికి నువ్వు అనుకునే ప్రవర్తనంగాని, అక్కడ మిగిలినవాళ్ళ చూపే ప్రవర్తనంగాని ముఖ్యంకాదు. ప్రేమ అంటే అనుభవంగాని, ప్రవర్తనం కాదు. తల్లి అపేక్ష బిడ్డకు

తెలియక పోవచ్చు, అంతమాత్రాన ఉపన్యాసాలు, ఉపదేశాలు మేపనక్కర లేదు. నీకు ఆకలి వేస్తే పెట్టిన అన్నం నువ్వే తింటావు. అప్పటిదాకా ఆగిచూడు.

## ఇంతమంది అవతార పురుషులైతే ఎలా?

వ్యక్తి: మాస్టారూ! ఎవరో ఒకరే అవతార పురుషులైతే వాళ్ళకి దణ్ణం పెట్టుకొని తరించటానికి వీలుంటుంది. ముగ్గురో, నల్గురో అవతార పురుషులుగా చెలామణీ అవుతున్నప్పుడు ఇందులో ఎవర్ని అనుసరించాలా అని సందేహం వస్తూ ఉంటుంది. ఆ కనపడే దేవుడేదో ఒక్క రూపం లోనే కనపడితే ఈ చికాకులన్నీ ఉండవుకదా? మతాల పేరిట ప్రజలు కొట్టు కోరుకదా?

మాస్టరుగారు: ఇన్నిసార్లు ఇన్ని రూపాలుగా దేవుడు దిగిరావడం వాడిదే తప్పంటావు. వాడి పేరిట మనం మతాలు పెట్టి కొట్టుకుంటూ, ఈ కొట్లాటలకు వాడే కారణ మంటావు.

వ్యక్తి : కాదు మాస్టారూ! వీటి అన్నిటికీ సమన్వయం కుదిరేది ఎలాగా అని!

మాస్టరుగారు: రోజూ సూర్యోదయం అవుతోందికదా! నిన్న వచ్చిన సూర్యుడు, ఈ రోజు వచ్చిన సూర్యుడూ ఒకడేనా అని మన కెప్పుడైనా అనుమానం వచ్చిందా? ఆ అనుమానం వచ్చిన వాడెంత పిచ్చివాడో, ఈ దిగి వస్తున్న అవతార పురుషులంతా ఒకరేనా అన్న అనుమానం వచ్చిన వాళ్ళు కూడా అంతే. అసలువాడు, మన అందరిలో కలుపుకొని ఉన్నది 'నేనొక్కడినే', మరి రెండవది లేదంటున్నాడు. మరి దానికేం చెబుతావు.

మన ఇంటికి కరెంటు పెట్టించుకొన్నపుడు అవసరాన్ని బట్టి నాల్గుచోట్ల నాలుగు లైట్లు వేయించుకుంటాం. నాలుగులైట్లు వెలిగించు కుంటాం. అందులో ఏ బల్బులో వెలుగుతున్నది నిజమైన కరెంటు అని గాని, ఏ బల్బుని ఇప్పుడు మనం ఉపయోగించుకోవాలని కాని ఆలోచిస్తున్నామా! అలాగే జాతి అవసరాన్ని బట్టి దైవం కావలసినన్ని శరీరాలతో

నలువైపులకి దిగివస్తాడు. ఎవరికి తగిన రీతిలో వారికి శిక్షణ ఇస్తాడు. వాళ్లల్లో ఎవరి ప్రణాళికకు మన సంస్కారం దగ్గరగా వుంటుందో అక్కడకు మనం చేరి శిక్షణ పొందటం జరుగుతుంది. మన సంస్కారానికి ఏది దగ్గరో అక్కడ చేరటం వుంటుందిగాని, ఉన్నవాళ్లల్లో ఎవరు ఎక్కువగా కీర్తింపబడుతున్నారో అక్కడ చేరటం వుండదు. విద్యార్థి కాలేజీ అంతా తిరిగినా చివరకు తన క్లాసు రూములోకి వచ్చి చతికిలబడినట్లు ఎన్ని రూపాలలో దైవాన్ని దర్శించినా మన సంస్కారానికి దగ్గరగా వున్న రూపం దగ్గర మనం చతికిలబడతాం. దానినే మనం నచ్చడం అంటాం. ఈ రహస్యం తెలియక తొలి రోజుల్లో మనకు నచ్చిన వాడే మహానుభావుడనీ, మిగతావారు కారనీ ప్రచారాలు చేస్తాం. అప్పుడే మతాలు పుడతాయి. ఇవి చిన్న పిల్లల తగాదాల లాంటివి. పరిణామంలో ముందు మెట్లు ఎక్కుతున్న కొద్దీ మతాలు కొట్టుకోవడం కోసం ఏర్పడలేదనీ, సౌకర్యంకోసం ఏర్పడినాయనీ తెలుస్తుంది.

వ్యక్తి : ఇలా వివరించి చెప్పేవారు లేకనే ఇన్ని గొడవలు వస్తున్నాయేమో అనిపిస్తూ వుంటుంది.

మాస్టరుగారు: వివరించి చెప్పేవారు, లేకపోవడ మనేది ఉండదు. ఇప్పుడు నీకు నేను దొరకలా! అలాగే సత్యదర్శనాన్ని ఎవరు కోరినా ప్రసాదించేవాడు పక్కనే ఉంటాడు. ఇది ప్రకృతి చేసిన ఏర్పాటు. వివరించినపుడు వినేవాళ్ళు దొరకాలి. అంటే వినగలిగే చెవులు మొలుచుకుని రావాలి. ఏసుక్రీస్తుగా ఇదివరకే చెప్పి ఉన్నాను.

వ్యక్తి : చాలా బాగుంది మాస్టారూ! లోకం చెడిపోతుందనుకున్న నాకు చెడిపోవడం అనేదే ఉండదని మీ దయవల్ల తెలిసింది.

